# చతుర

సంపుటి : 3 అక్టోబర్ 1980 సంచిక : 9

## ఈ నెల సమగ్ర నవల

స్వార్థంతో కన్న తండ్రే ఆమెను నాటకాల్లోకి దింపాడు. తండ్రి బలవంతం మీద అయిష్టంగానే రంగ ప్రవేశం చేసినా మొదటి నాటకంతోనే ఆమె జనాన్ని ఆకట్టుకుంది. ప్రశంసలు...చప్పట్లు... అభినందనలు...కీర్తి తోరణాలు ఆమెను మరోలోకానికి తీసుకుపోయాయి మహానటి అనిపించుకోవాలన్న ఆశలకు ప్రాణం పోశాయి.

ఫలితంగా తప్పనిసరై తనవాళ్లకి దూరమైంది. శీలాన్ని కబళించాలని పొంచున్న గుంటనక్కలు, పెద్దపులుల బారినుంచి తనను తాను ఎలాగోలా కాపాడుకోగలిగినా చివరికి నాటకాలు వదిలిపెట్టాలనే నిశ్చయించుకుంది.

పెళ్లి చేసుకుంది. అనుకూలుడైన భర్తతో కొత్త జీవితం గడప బోయిన క్షణాల్లో మరి ఆమె కోసం కాచుకున్న పెద్దపులులు, గుంట నక్కలు ఊరుకున్నాయా? కీర్తి కాంక్ష నుంచి, రంగుల రంగస్థలం నుండి ఆ బయటపడగలిగిందా? ఆమె దాంపత్య నందనవనంలో-

# తెర

వెనుక జీవితం, తెర జీవితం ఎటువంటి ప్రభావాన్ని కలిగించాయి ?... జీవితంలో హీరోయిన్‌గా స్థిరపడాలని విఫల ప్రయత్నం చేసిన ఓ మధ్య తరగతి మగువ ఎదుర్కొన్న కష్టాల్ని సమర్థవంతంగా చిత్రించిన

## వీరభద్రరావు పమ్మి

నవల 'తెర' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం: వి. ఇలంగో

2వ కవరు: సూరజ్ ఎస్. శర్మ

3వ కవరు: గీతాదత్త

---

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది-చార్మినార్!




చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం

STATUTORY WARNING.
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

1 రూపాయికి 10*

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASVS-238-182 TEL

---

మెయిన్ డీలర్ : కె. వెంకటేశ్వరరావు, పాలకొల్లు

# మిలియన్లు బిలియన్లు

అమెరికాలో ప్రతి 500 మంది పౌరుల్లో ఒక మిలియనీరూ, దేశం మొత్తం మీద 100 మంది బిలియనీర్లూ వున్నారని ప్రపంచ బ్యాంకు లెక్కల వల్ల తేలింది. వీరిలో చాలామంది కష్టపడి పనిచేసే వ్యాపారస్థులే. వీరిలో చాలా తక్కువ మంది మిలియనీర్లకు మాత్రమే బిలియనీర్లవ్వాలన్న కోరిక వుంది. ఓపిక వుడిగి



పోకముందే యవ్వనంలోనే బాగా డబ్బు సంపాదించి త్వరగా రిటైరయి మిగతా కాలమంతా ఈ డబ్బుతో కాలుమీద కాలు వేసుకుని గడిపేయాలన్నది వీరి ఆశ.

అమెరికాలో కనీసం 4 లక్షలమంది మిలియనీర్లుంటారని అంచనా. జర్మనీ, స్విట్జర్లాండు, దక్షిణాఫ్రికా, ఫ్రాన్స్‌లది తర్వాతి స్థానం. రష్యా, చైనాల్లో వందకు పైగా మిలియనీర్లున్నారని అంచనా.

ఈరోజుల్లో మిలియనీరు (పది లక్షలకు అధినేత) అవ్వాలంటె కలవారిబిడ్డే కానవసరం లేదు అంటాడు అమెరికా ట్రస్టులో ఉపాధ్యాయుడిగాపనిచేస్తున్న రాడ్నీ ఉడ్స్. రాను రాను ఆస్తులు వారసత్వంగా ప్రాప్తించే వారి సంఖ్య తగ్గిపోయి స్వయం కృషితో డబ్బు పండిస్తున్న వారి సంఖ్య అధికమవుతోంది.

కొత్తగా ధనవంతులయిపోతున్న వారిలో వ్యాపారస్థులు, శాస్త్రజ్ఞులు, లాయర్లు, సర్జన్లు వున్నారు. అభివృద్ధి చెందిన కంప్యూటర్ మొదలైన సాంకేతిక రంగాలు, సిలికన్ చిప్స్, మైక్రో సర్క్యూటరీలో మంచి హోదాలో వున్న వారు కూడా వున్నారు.

అమెరికా అంతర్జాతీయ రెవెన్యూ సర్వీసు లెక్కల ప్రకారం 15 ఏళ్ళ క్రిందట అమెరికాలో మహా వుంటే 398 మంది మిలియనీర్లు, 5 మంది బిలియనీర్లు (కోటీశ్వరులు) మాత్రమే వుండేవారట. గత 5 ఏళ్ళలో అమెరికా మిలియనీర్ల సంఖ్య 50 వేలకి పెరిగిపోయింది.

డేనియల్ లడ్‌విగ్ అనే అత్యంత సంపన్నుని దగ్గరున్న డాలరు నోట్లను ఒకదానివెనక ఒకటి పేర్చుకుంటూ పోతే చంద్రమండలం దాటి ఇంకో 60 వేల మైళ్ళ దూరం వెళ్ళాల్సి వసుంది. అతను ఎక్కడికయినా వెళ్ళాలంటే టాక్సీని కూడా పిలవకుండా నడిచే వెళ్తాడట.

లఫీయతే హంట్ అనే నూరు కోట్ల డాలర్ల ఆస్థి ఉన్నతను పుచ్చకాయ కొనడానికి వెళ్ళాల్సి వచ్చినాసరే పార్కింగ్ ఛార్జీ ఇవ్వాల్సివసుందని కారుని ఓ మైలు దూరంలో ఆపి నడిచివచ్చి మళ్ళీ పుచ్చకాయ మోసుకుంటూ కారుదాకా నడిచే వెళ్తాట్ట. నోట్లు వుంటే ఎక్కడ ఖర్చయి





పోతాయోనని జేబుల్ని చిల్లర డబ్బుల్తో నింపి వుంచుకుంటాడు.

పెద్ద యుద్ధ, వాణిజ్య నౌకా నిర్మాణ కేంద్ర యజమాని అయిన గ్లిన్ హార్స్టర్‌కి పెద్ద పెద్ద టెన్నీసు పార్టీలివ్వడమంటే సరదా. కానీ ఎన్నడూ టెన్నీసు బంతులు మాత్రం ఇవ్వడు. ఆడుకోవాలనుకున్న అతిథులు ఎవరి బంతులు వారే తెచ్చుకోవాలి.

మిలియనీర్లందరూ ఇతరులతో ఎంతో వినయంగా ప్రవర్తిస్తారట. ఒక కాలిఫోర్నియా ఆయిల్ వ్యాపారి ఆదాయం వారం వారం పదిహేను లక్షల డాలర్ల చొప్పున పెరుగుతూ వస్తోంది. అయినా "నాకు చదువులేదు - అందుకని నా కోసం నేనేదైనా చేసుకోవాలి కదా!" అంటాట్ట సవినయంగా.

## జీవ కణాలు

ఈమధ్య శాస్త్రజ్ఞులు రకరకాల కొత్త సిద్ధాంతాలను ప్రకటిస్తున్నారు. భూమి వాతావరణం బయటనున్న శక్తులు భూమి మీది జీవజాలం యొక్క పరిణామాన్ని నిర్దేశిస్తుంటాయని ఓ కొత్త సిద్ధాంతం. భూవాతావరణం బయట వుండే వైరాయిడ్స్‌కి చెందిన వైరస్ కణాలు మన శరీరంలోని 'జీన్'లో వున్న వైరస్ కణాలు పరస్పరం ఒకదాని మీద ఒకటి ప్రభావం చూపిస్తాయి.

ఇది పూర్వం నుంచీ వున్న భూమి పరిధికి మాత్రమే సంబంధించిన పరిణామ సిద్ధాంతానికి పూర్తి వ్యతిరేకం. ఈ కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవారు ఫ్రెడ్ హుయాల్, చంద్రా విక్రమ్‌సింగ్. వీరు కార్డిఫ్‌లోని యూనివర్సిటీ కాలేజీకి చెందినవారు. రెండేళ్ళ క్రితం వీరు ప్రకటించిన అన్నిరకాల వైరస్‌లు రోదసి నుంచే భూమిపైకి దండెత్తి 'ఫ్లూ' వ్యాధిని కలిగిస్తున్నాయన్న సిద్ధాంతం తీవ్ర విమర్శలకు గురైంది.

ఆ తర్వాత వీరు తమ సిద్ధాంతానికి మెరుగులు దిద్ది మరింత శాస్త్రబద్ధమైనదిగా మార్చారు. దీని ప్రకారం బయటి ప్రపంచం నుంచి భూమిని చేరే వైరాయిడ్స్ చిన్న చిన్న జెనెటిక్ తునకల రూపంలో వుండి ప్రేరేపకంగా పనిచేసి జీవజాలంలోని కణాలను మారుస్తుంది.



అయితే ఈ మార్పులు అన్ని వేళలా మంచివి కావని చెప్పలేం. కొన్నిసార్లు ఈ వైరాయిడ్స్ అంటు వ్యాధులను వ్యాపింపజేసినా మరికొన్నిసార్లు వీటి ప్రేరేపకాల వలన కణం మరింత ఆధునికీకరణ చెందవచ్చు. జీన్స్ చాలా విపులమైన కార్యక్రమాలు కలిగి వుంటాయి కంప్యూటర్ లాగ. కాని కంప్యూటర్ కన్నా జీన్స్ కార్యక్రమాలు మరింత క్లిష్టతరంగా వుంటాయి. జీన్స్ నిర్వహించే ఈ కార్య

క్రమాలకు బయటనుంచి భూమ్మీదకు వచ్చే 'వైరాయిడ్స్' కారణమవచ్చున్నది పీరి వాదన. ఈ సిద్ధాంతం పూర్వపు సిద్ధాంతం కన్నా చమత్కారంగా వున్నందున ఖండించడం కష్టం. జీవరాసులలోని జీవరసాయన పదార్థాలన్నింటికీ భూవాతావరణానికి బయటవున్న విశ్వమే మూలం అన్న విషయం పీరి వాదనకు మరింత బలం చేకూరుస్తుంది.

# సువర్ణ యోగం

ఒకప్పుడు దక్షిణాఫ్రికాలో బంగారు గనులున్నాయని తెలిగానే మూటా ముల్లె సర్దుకొని ఉరుకులు పరుగులతో తండోపతండాలుగా బయల్దేరారు ప్రజలు. అయితే ఇప్పుడు బంగారం భారీ ఎతున లభించడం లేదు, లభించినా అలా పరిగెత్తే పీలూ లేదు.

గత 30 ఏళ్ళుగా చారిత్రక ఖ్యాతి గాంచిన 'పిల్‌గ్రిమ్స్ రెస్ట్' గ్రామంలో వుంటున్న 78 ఏళ్ళ మార్కెస్ క్రిష్టికి, బంగారానికి అవినాభావ సంబంధం వుంది. ఈ గ్రామంలోని బంగారుగని వలనే ఏటా ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే బంగారంలో మూడు వంతులకు పైగా ఉత్పత్తి చేసే దేశంగా దక్షిణాఫ్రికా రూపొందింది. క్రిష్టి గత 30 ఏళ్ళుగా ఇక్కడ వుంటున్నాడు. అతనికి అర ఔన్స్ బరువున్న బంగారం ముక్క దొరికిందోసారి. అప్పుడు ఔన్స్ బంగారం 32 డాలర్ల ఖరీదు వుంది. తర్వాతెప్పుడూ అలాంటి అవకాశం రాకపోయినా ఆ స్థలాన్ని మాత్రం వదల్లేదతను. ప్రస్తుతం యాత్రికులకి బంగారాన్ని మట్టినుంచి వేరుచేసే విధానం చూపిస్తుంటాడు. ఇప్పటికీ 5 టన్నుల గులకరాయిని కదిలిస్తే అర ఔన్స్ బంగారం దొరుకుతుంది. అక్కడి కొండ పగుళ్ళ లోపల చాలా బంగారం వున్నమాట నిజమే అయినా దాన్ని వెలికి తీయడం చాలా వ్యయంతో కూడిన విషయం.

19వ శతాబ్దిలో ఈ గ్రామం బంగారం ఉత్పత్తిదారుల్లో అగ్రగామిగా వుండేది. ప్రపంచం నలుమూలల నుండి వచ్చిన దాదాపు 1000 మంది పనివారు



ఈ చిన్న నది ఒడ్డున పని చేసేవారు. చాలావరకూ బంగారం బురద రూపంలో లేదా ధూళి రూపంలో లభించేది. కొందరికి మాత్రం రాళ్ళకు అతుక్కొని వున్న బంగారం ముక్కలు దొరికాయి. అలా దొరికిన ఒక పెద్ద బంగారం ముక్క 25 పౌన్లు తూగింది. దీని ప్రస్తుత ధర 2 లక్షల డాలర్లు.

1909లో ఓ ఇటుక పరిమాణంలో బంగారం దొరికిందట ఒకరికి. పిడికిలంత బంగారం ముక్క దొరికితే దానితో

ఫొటో తీయించుకోవాలని ఎప్పటికైనా తన ఆశ నెరవేరుతుందన్న నమ్మకం వుంది క్రిష్టికి.

# దాగి ఉన్న దేవతలు

రకరకాల దేవుళ్ళు, దేవతలు, అందంగా, అతి సుందరంగా చెక్కిన దేవాలయ ద్వారాలు, శివుని వాహనమైన నందీశ్వరుడు, విష్ణు మూర్తి గరుడవాహనం, అద్దంలో అందం చూసుకుంటూ శృంగార భంగిమలో అతి మనోహరంగా నిలబడిన అప్సరస, ఏసుక్రీస్తు, బైబిలు గ్రంథాలు ఎన్నెన్నో కొలువు తీర్చినట్లున్నాయి. చూసే బొమ్మల కొలువేమోనని భ్రమ కలుగుతుంది. కానీ అవన్నీ ఛతర్పూర్‌కి చెందిన బలీరాంశర్మ అనే నలభై ఆరేళ్ళ ఘరానా పెద్దమనిషి తస్కరించిన పురాతన కళాఖండాలు. మొత్తం రెండు వేల ఐదు వందలకి పైనేవున్నాయి. మెహరాలీ ప్రాంతంలోవున్న పొలంలో ఓ కాటేజీ వేసి దాంట్లో వాటన్నింటినీ దాచాడు. చోర్‌బాగ్ మార్కెట్‌లో ఒక పురావస్తు దుకాణం, సౌత్ ఎక్స్‌టెన్షన్ ప్రాంతంలో లక్షలు ఖరీదుచేసే లంకంత ఇల్లు కూడా వున్నాయి. ప్రభుత్వ పురావస్తు విభాగంలో 1966లో గుమస్తాగా చేరిన బలీరాంశర్మ మెలకువలన్నీ తెలుసుకుని గుమస్తాగిరికి గుడ్‌బై చెప్పి పురావస్తువుల కొనుగోలు, అమ్మకాల్లో విపరీతంగా డబ్బు గడించి చూస్తూండగానే లక్షాధికారి అయిపోయాడు.

మొన్న మే నెలలో సంపాదించిన పురావస్తువుల్ని వాన్‌లోవేసి వెనకాల తెల్ల ఎంబాసిడర్ కారులో వెళుతుండగా అప్పటికే అందిన సమాచారంతో పోలీసులు బలీరాంకి, వాన్ డ్రైవరుకి బేడీలువేసి వాన్లోని వస్తువుల్ని స్వాధీన పర్చుకున్నారు. బలీరాం పోలీసుల చేతుల్లో చిక్కడం ఇది మూడవసారి. నిజమైన పురావస్తువులేకాక అతని కాటేజీ ముందు ఎండా వానల పాలబడుతూ పురాతన రూపం వచ్చేందుకుగాను పడేసిన ఎన్నో వస్తువులు పోలీసుల కంటబడ్డాయి. పురావస్తుశాఖవారి ప్రత్యేక పరీక్షలో అమూల్యమైన కళాఖండాలెన్నో ఆ కాటేజీలో భద్రపర్చబడి



నట్లు తేలింది. దక్షిణ భారత దేవాలయాల్లోంచి, గోవా చర్చిల్లోంచి, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ దైవపీఠాల్లోంచి దొంగిలించిన లక్షల విలువచేసే ఈ వస్తువుల గురించి మద్రాస్, గోవా, జైపూర్, లక్నో పోలీసులు ఈ తరహా దొంగతనాల ఫైళ్ళను భూతద్దాలుపెట్టుకుని మరీ గాలిస్తున్నారు.

తెర పడింది—

హాలు చప్పట్లతో మార్మోగిపోయింది. మంచి నాటకం చూశామన్న తృప్తి ప్రేక్షకుల మొహాల్లో కనిపిస్తోంది.

అంత అలసటలోనూ ప్రసాద్‌కి ఎంతో ఆనందంగా, తృప్తిగా ఉంది. రామరాజు వచ్చి ఆప్యాయంగా ప్రసాద్ జుట్టు సవరిస్తూ "వెల్‌డన్-ఇంక లేవండి" అన్నాడు.

"తెర పడి చాలా సేపైంది. ఇంక లే" అన్నాడు ప్రసాద్ తన ఒళ్లో ఉన్న రాధికతో. కాని ఆమెలో చలనంలేదు. భుజం తట్టిలేపాడు ప్రసాద్. కాని ఆమె లేవలేదు.

ప్రసాద్ కంగారుపడ్డాడు— ఆమెను కుదిపాడు.

అతని ఒళ్లో పడుకుని వున్నదల్లా వెల్లకిలా పడిపోయింది రాధిక.

కంగారుగా ఆమె ముఖంలోకి చూసి "నీళ్లు పట్టండి" అని కేక పెట్టాడు. ఎవరో నీళ్లు తీసుకొచ్చి అందించారు. రామరాజు ఆమె ముఖం మీద నీళ్లు చల్లాడు.

చుట్టూ మూగిన జనాన్ని దూరంగా వెళ్ళమని ఎవరో హెచ్చరిస్తున్నారు. అంతవరకు గ్రీన్ రూంలో వున్న ఆమె తండ్రి వెంకటరత్నం హడావిడిగా స్టేజిమీద కొచ్చాడు.

రాధికలో చలనం కలిగంది.

రామరాజు ముఖంలో ఆందోళన తగ్గింది. ప్రసాద్ ముఖం విప్పారింది. ఇద్దరూ కల్సి రాధికను సాయం పట్టి గ్రీన్ రూంలో బెంచిమీద పడుకోబెట్టారు. డాక్టర్ని తీసుకరమ్మని రామరాజు మనిషిని పంపాడు.

కాస్త వైద్యం తెల్సిన మరో నటుడు ఆమె అరచేతుల్ని రాస్తున్నాడు. నాడి చూసి "ఏంలేదు. నీరసంగా వుంది. కంగారు పడక్కర్లేదు" అన్నాడతను.

"అన్నం తిని స్టేజి ఎక్కవే అంటే యినలేదు. ఒంటి మీదకు తెచ్చుకుంది" అన్నాడామె తండ్రి.

"నువ్వేం కంగారు పడకయ్యా! నీ కూతురికేం ఫరవాలేదు" ఎవరో ధైర్యం చెప్పారు.

ప్రసాద్ మనసులోని ఆందోళనను అణచుకుని అట్టతో ఆమెకు విసురుతున్నాడు.

"అమ్మా" అంటూ రాధిక కదిలింది. రామరాజు ఆమె నోట్లో నీళ్లు పోశాడు. ఆమె కళ్ళు తెరిచి చుట్టూ కలియజూసింది.

అందరూ ఆందోళనగా, ఆత్రంగా, ఆశ్చర్యంగా తనకేసి చూస్తున్నారనిపించి సిగ్గుపడింది.

పమిట సవరించుకుని ప్రసాద్ కళ్ళల్లోకి చూసింది. అతనూ ఆమె కళ్ళలోకే ఆందోళనగా చూస్తున్నాడు.

ఆమెలో ఏ జ్ఞాపకం తాలూకు నరానికి నిప్పంటుకుందో, ఏ బాధ తాలూకు సముద్రానికి కట్ట తెగిపోయిందో...... వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది.

"ఏడవకే ఎర్రిమొకమా-నీకేంకాలేదు" అన్నాడామె తండ్రి. ప్రసాద్‌కి ఎన్నో మాట్లాడాలనిపిస్తోంది. ఆమెకు ఎన్నో చెప్పి ధైర్యం చెప్పాలనిపిస్తోంది. కాని ఏం చెయ్యలేక "ఏడవకు. నీకే ప్రమాదం లేదు" అని మాత్రం అన్నాడు.

డాక్టర్ వచ్చి ఓ ఇంజక్షన్ ఇచ్చాడు. నీరసంవల్ల 'ఫైంట్' అయిందని, ఆందోళన పడాల్సిన పని లేదని చెప్పాడు. ఆమె కేదైనా టిఫిన్ పెట్టమన్నాడు.

ఆరోజు...

టౌన్ హాల్లో రామరాజు అసోసి




యేషన్‌వాళ్ళ నాటిక ప్రదర్శన జరిగింది. జనం విపరీతంగా వచ్చారు. ప్రసాద్ రాధిక అందులో అన్నా చెల్లెళ్ళుగా నటించారు. చివరి సీనులో చెల్లెలు పాత్ర అన్న ఒడిలో పడి ప్రాణాలు వదులుంది. నాటకంమొదలైనప్పట్నుంచి ప్రేక్షకుల్లో ఉత్సాహంపెరిగింది.ఆడియన్స్ రెస్పాన్స్ పెరిగేసరికి పాత్రధారులు పోటీపడి నటించారు. చివరి సీనులో రాధిక ప్రసాద్ ఒడిలో పడి ఫెంట్ అయింది.

తెలివి రాగానే వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

* * *

రాధిక తండ్రి వెంకటరత్నం ఓ మామూలు వెంకటరత్నం. అంతే!

అతను చిన్నప్పుడు రకరకాల వృత్తులు చేశాడు. చివరికి ఓ లారీ కంపెనీలో డ్రైవర్‌గా స్థిరపడ్డాడు. ఆ కంపెనీ ప్రొప్రైటరు శర్మగారు తనదగ్గర పన్జేసే వాళ్ళని కుటుంబ సభ్యుల్లా ఆదుకుంటారు.

శర్మగారి పద్ధతి వెంకటరత్నానికి నచ్చింది. అంచేత అతను మిగతావాళ్ళల్లా ఉద్యోగాలు మారకుండా అదే కంపెనీలో స్థిరంగా పన్జేసాడు.

అతను,భార్య, నలుగురుపిల్లలు రెండు పూట్ల కడుపునిండా అన్నం తినసాగారు. వెంకటరత్నం దృష్టి ఎప్పుడూ 'ఈరోజు' మీద తప్పితే రేపుమీద పడలేదు. అయితే శ్రమ మరచిపోవడానికి మొదలెట్టిన తాగుడు అతనికి వ్యసనం అయిపోయింది. పిల్లలా ఎదిగారు. ఖర్చులూ పెరిగాయి. అయినా అలవాట్లను మానుకోలేని పరిస్థితి.

రానురాను సంసారం గడవడం కష్టమై పోయింది. ఒకోసారి మరీ తాగి వెంకటరత్నం డ్యూటీకి వెళ్ళలేక పోయేవాడు. ఆరకంగా కొంత జీతంనష్టం.

శర్మగారతనికి బుజ్జగించి తమ్ముడికి చెప్పినట్టు చెప్పేవారు తాగుడు మానమని. ఆయన చెప్పేదంతా శ్రద్ధగా వింటాడు. తప్పక ఆయన సలహా పాటించాలను కుంటాడు. జాగ్రతగా ఉండాలను కుంటాడు. కానీ సాయంత్రమయ్యేసరికి దృష్టి మళ్ళీ సారా వైపు పరిగెత్తేది.

రానురాను ఇబ్బందులు ఎక్కువై కష్టపడకుండా సంపాయించాలనే ఆలోచన కలిగిందతనికి.

ఆరోజుల్లో బ్రాకెట్ ఆటకి విపరీతమైన గిరాకీ వుంది. ఒకడు కాసిన నంబరు బ్రాకెట్లో వస్తే డెబ్భైరెట్ల డబ్బుఇస్తారు. రూపాయికి డెబ్భై రూపాయలు...

వెంకటరత్నం బ్రాకెట్ ఆడటం మొదలెట్టాడు.

రానురాను వెంకటరత్నం తాగుడు, బ్రాకెట్ అనే వ్యసనాల మధ్య ఇరుక్కు పోయాడు. అతనిక బాగుపడడని నమ్మకం కుదిరిన శర్మగారు అతని గురించి పట్టించుకోడం మానేశారు. చదువు సగంలో ఆపేసి ఇంట్లో కూర్చున్న అతని కొడుకు మోహన్ని పిల్చి "మీనాన్న ఎలాగూ బాగుపడడు. నేను లారీ కంపెనీ పెట్టిన కొత్తలో నాదగ్గర చేరాడు. ఇన్నాళ్ళు నాదగ్గర నమ్మకంగా పన్జేసాడు. నాకు అభిమానం వుంది. వచ్చిన డబ్బు కాస్తా అతనిలా వ్యసనాలకు తగలేస్తుంటే మీరెన్నాళ్ళిలా అవస్థపడతారు. అందుకని నేను సుబ్బరాజుగారితో మాట్లాడతాను. నువ్వు వాళ్ళ మెకానికల్ షెడ్‌లోచేరి పని నేర్చుకో. మొదట్లో కొద్దిగా జీతం ఇస్తారు. పని నేర్చుకున్నాక జీతం పెంచుతారు. తర్వాత నువ్వే ఓ చిన్న షెడ్ పెట్టు కున్నావంటే జీవితం హాయిగా ఉంటుంది"



అన్నారు.

మోహన్‌కి అప్పటికి పదిహేడేళ్లు. ఆ వయసుకే అతనికి శర్మగారి సలహా వచ్చింది. జీవితానికి ఓ దారి కన బడుతోందని సంతోషించాడు. వెంటనే వెళ్ళి సుబ్బరాజుగారి షెడ్‌లో చేరాడు.

కొద్దిరోజులకే మోహన్ సుబ్బరాజుగారి అభిమానం సంపాయించుకున్నాడు. సీనియర్ మెకానిక్కుల దగ్గర అతను వినయంగా మసలుకునేవాడు. శ్రద్ధగా పని నేర్చుకున్నాడు. ఎప్పటికప్పుడు జీతం పెంచుతూనే వున్నారు. నాల్గు సంవత్సరాలకే 'అతను లేకపోతే సుబ్బ రాజుగారి షెడ్డులేదు' అనేస్థితికి వచ్చాడు.

కొడుకు సంపాదనాపరుడై ఇంటి బాధ్యతను కొంత నెత్తిమీద వేసుకుంటే ఏ తండ్రైనా సంతోషిస్తాడు. వెంకట రత్నం కూడా అలాగే సంతోషించక పోలేదు. కాకపోతే ఇంటి బాధ్యతను మొత్తం కొడుకుమీద వదిలేసి తను సంపాదించే కొద్దిపాటి మొత్తం వ్యసనాలకు ఖర్చుచేయటం మొదలెట్టాడు. ఈ పరిస్థితి మోహన్‌కి బాధ కలిగించింది. అతనిబాధ తన సంపాదనంతా ఇంటికి ఖర్చయి పోతుందని కాదు. పెద్దకొడుకుగా కుటుం బాన్ని ఆదుకోవల్సిన నైతిక బాధ్యత తనకుందని అతనికి తెలుసు. కాని తండ్రి డబ్బు, ఆరోగ్యం పాడుచేసుకుంటు న్నాడని. దానికి తగలేసే డబ్బు సద్విని యోగ పరిస్తే కుటుంబం మరికాస్త సుఖ పడుతుందని అతని అభిప్రాయం.

వెంకటరత్నం పరస్థితి మరీ దిగ జారింది. ఉద్యోగానికి సరిగా వెళ్ళక పోవడం,వెళ్ళినావచ్చినడబ్బంతా తాగెయ్య డం, బ్రాకెట్ ఆడెయ్యడం జరుగుతోంది.

జేబులు ఖాళీ అయ్యాక మాత్రమే ఇంటికి రావడం అలవాటు చేసుకున్నాడు. పైగా తన దగ్గర తాగుడికి డబ్బు లేనప్పుడల్లా భార్యచేత కొడుకు నడిగించి దాంతో తాగెయ్యడం మొదలెట్టాడు.

ఈ పరిస్థితి మోహన్‌కి నచ్చలేదు. చాలాసార్లు తండ్రికి చెప్దామనుకుని, ఆస్థి పాస్తులు ఇవ్వకపోయినా కని పెంచి పెద్ద చేసిన తండ్రి ముఖం మీద చెప్పడాని కతను సంశయించాడు.

ఓరాత్రి పక్షవాతంతో పడిపోయిన వెంకటరత్నాన్ని సారాకొట్టునుండి స్పృహ లేని స్థితిలో ఇంటికి తీసుకొచ్చారు.

అతన్నా స్థితిలో చూసి పిల్లలంతా ఘొల్లుమన్నారు.

వెంకటరత్నంకూతురు రాధికకళ్ళుతిరిగి పడిపోయింది. చెల్లెలి ముఖం మీద నీళ్ళు చల్లి లేవదీసి మంచంమీద పడుకోబెట్టాడు మోహన్.

అతను దీనంగా చెల్లెలికేసి, తండ్రికేసి చూస్తూ ఉండిపోయాడు.

* * *

కుడి కాలు, కుడిచేయి పడిపోయిన వెంకటరత్నాన్ని ఆసుపత్రిలో చేర్చారు. అతను మెల్లగా కోలుకుంటున్నాడు. జైలు, నరకం కలిపి ఒకేచోట స్థాపించి దానికి ఆసుపత్రని పేరుపెట్టి అందులో తనని పడవేసినట్లుగా ఉందతనికి. తాగుడులేదు. బ్రాకెట్ లేదు. ఓపెనింగు ల్లేవు. క్లోజింగుల్లేవు. అతనికి చాలా చిరాకుగా అనిపిస్తోంది.

చేదుమందులు మింగడం, ఇంజక్షన్లు తీసుకోవడం, రాధిక తెచ్చిన చప్పిడి భోజనం తినడం...అంతే! ఏ మజాలేదు. ఏ సరదాలేదు.

"నన్నీ నరకంలోంచి ఎప్పుడు ఇంటికి తీసుకెళతావురా?" అని కొడుకుని చాలా

సార్లడిగాడు.

వెంకటరత్నం ఆస్పత్రిలో వుండగా ఎక్కువ శ్రమ పడ్డది రాధికే. పొద్దుటే కాఫీ తీసికెళ్ళడం దగ్గర్నుంచి, రాత్రి భోజనం చేశాక అతని కాలికి,చేతికి మందు రాసి మర్దనా చెయ్యడంతో ఆమె దినచర్య పూర్తవుతుంది.తండ్రి మంచాన పడటంతో ఆమె చదువుకి స్వస్తి చెప్పాల్సి వచ్చింది. అప్పటికామె వయసు పద్దెనిమిది.

కష్టపడుతున్న రాధికమీద మోహన్‌కి ప్రత్యేకాభిమానం. అతనికి తల్లి అన్నా, మిగతా తమ్ముళ్ళన్నా కూడా అంతే. తండ్రి వల్ల దరిద్రం అనుభవించిన వాళ్ళందర్నీ సుఖపెట్టాలని అతని తాపత్రయం.

ఓరోజు శర్మగారు మోహన్ని పిల్చి "ఇలాంటిదేదో జరుగుతుందని భయ పడుతూనే ఉన్నాను. మీ నాన్న చెప్తే విన్నాడుకాదు. ఏ రకంగానైనా నీకు కుటుంబ బాధ్యతలు తప్పవు. ఈ సొమ్ము ఉంచు. మీ నాన్న వైద్యానికి ఉప యోగించు" అన్నారు ఓ కవరందిస్తూ.

ఆయన వాత్సల్యానికి అతని గుండె ద్రవించింది. ఆ సాయంత్రం మందులు కొనడానికి కవరు తెరిచిన మోహన్‌కి అందులో మూడు వందలు కనిపించాయి.

ఆసుపత్రినుంచి వస్తూ "చిట్టీ ఈ పది రూపాయలు నీ దగ్గరుంచు" అని రాధికకు ఇచ్చాడు.

"అసలే నువ్వు ఖర్చులో ఉన్నావ్. ఇప్పుడు నాకెందుకు?"ఆమె తీసుకోడానికి సంశయిస్తూ అంది. ఆ మాటలకు అతనికి సంతోషమెక్కువయింది."ఫరవా లేదు. ఉంచు. నా ఖర్చులెప్పుడూ ఉండేవే!" అన్నాడు.

"తీసుకోవే వెర్రిమొకమా ! మనిద్దరం ఇక్కడే పడుంటాం- ఏదైనా కర్సొస్తే ఎలా?" వెంకటరత్నం అన్నాడు.

మోహన్ తండ్రికేసి అదోలా చూశాడు. రాధిక నోటు అందుకుంది. అన్నను సాగనంపడానికి ఆస్పత్రి గేటు దగ్గర కొచ్చిన రాధికతో "చిట్టీ ఆ డబ్బు నీ కోసమే ఇచ్చాను. నువ్వే ఖర్చుపెట్టుకో.. మరి..." ఇంకా ఏదో చెబ్దామనుకుని చెప్పలేకపోయాడు మోహన్.

ఆమెకేమీ అర్థం కాలేదు.

వెళ్ళిపోతున్న అన్నమీద జాలితో కూడిన ప్రేమ కలిగిందామెకు.

ఆ రాత్రి ఆస్పత్రి సద్దుమణిగాక "చిట్టీ!రంగయ్యనోసారి పిలు." అన్నాడు వెంకటరత్నం.

"ఇప్పుడెందుకు?" రాధిక అడిగింది.

"ఎదవ ఎదురు ప్రశ్నలెయ్యకుండా అణ్ణిపిలు" వెంకటరత్నం అరిచాడు.

ఆమె బాధగా అక్కణ్నుంచి కదిలింది.

వాచ్‌మన్ రంగయ్యంటే రాధికకు ఓ రకమైన జుగుప్స. వాడు చూసే ఆకలి చూపులు, మాట్లాడే వంకర మాటలు ఆమె కసహ్యం. రోజూ వచ్చి ఆమెకేసి దొంగ చూపులు చూస్తూ వెంకటరత్నంతో మాట్లాడతాడు రంగయ్య. వాళ్ళిద్దరి సంభాషణ ఎంతసేపు బ్రాకెట్ ఓపెనింగ్ క్లోజింగులు, సారాకొట్టు వ్యవహారాలకు పరిమితమై ఉంటుంది.

ఆరుబైట బెంచి మీద పడుకున్న రంగయ్య ఆమె రాకను గమనించి "ఏటీ ఇంత రాత్రిపూట వచ్చావ్?" అన్నాడు వెకిలిగా. ఆమెకోపం వచ్చింది. తమా యించుకుంది. "మా నాన్న నిన్ను రమ్మంటున్నాడు" ముక్తసరిగా చెప్పేసి వడివడిగా వెళ్ళిపోయింది.

తండ్రి రంగయ్యనెందుకు పిలిచాడో

ఆమె ఊహించింది. అదే నిజమైంది
"రంగయ్యా! నువ్వో అర సీసా ఏసుకుని-నాకో సీసా అట్టుకురా. వచ్చేప్పుడు సోమయ్య కొట్లో రెండు ఆను మీద రెండ్రూపాయలు ఆడేసిరా" అన్నాడు వెంకటరత్నం.

రాధికకు ఏమనాలో తెలీలేదు.

"అలా సూస్తావేటి? ఆ పది కాయితం రంగయ్యకియ్యి!" అన్నాడు.

"వద్దు నాన్నా! నువ్ తాగొద్దు. డాక్టర్ గారు నిన్ను తాగొద్దన్నారు" తండ్రిని బుజ్జగిస్తున్నట్లుగా చెప్పింది.

"ఓసోస్ గుద్దొచ్చి పిల్లనెక్కిరించిందంట. దీని సేతిలో పదిరూపాయలు వుండే సరికి నీతులు సెప్తోంది. నోర్మూసుకుని ఇయ్యి రంగయ్య మిగతా సిల్లర తెచ్చి యిచ్చేత్తాడు"

రంగయ్య ఇకిలించాడు.

తండ్రి మళ్ళీ తాగుతున్నందుకేగాక రంగయ్య ముందు అలా తక్కువ చేసి మాట్లాడినందుకు రాధిక బాధపడింది. మారు మాట్లాడకుండా పది కాయితం రంగయ్యకిచ్చింది. వాడో వెకిలినవ్వు నవ్వి అక్కణ్నుంచి వెళ్ళిపొయ్యాడు.

అన్న వెళ్ళే ముందు గేటు దగ్గర తనతో చెబ్దామని సంశయించిన విషయమేమిటో రాధికకు అర్థమైంది. 'అన్నయ్య ఎంత తెలివైనవాడు. నా మట్టి బుర్రకి తట్టనే లేదు' అనుకుంది.

రంగయ్య వచ్చి సీసా వెంకటరత్నానికిచ్చి రాధిక చేతిలో కొన్ని నోట్లు, చిల్లర కుక్కి హడావుడిగా వెళ్ళిపోయాడు. అవి లెఖ్ఖపెట్టుకున్న రాధిక అతని వెనకాతే వెళ్ళి "మా నాన్న నాలు రూపాయలొస్తా యన్నాడు. రెండే ఇచ్చావేం ?" అనడిగింది.

"నీకు లెక్కలు బాగానే వచ్చునే పిల్లా! నువ్వడగాలే కాని రెండేంటి పాతిక రూపాయలైనా ఇస్తాను. కాకపోతే..."

"మా అన్నయ్యకు చెప్పానంటే లారీ టైర్లు తీసినట్లు నీ కాళ్ళు తీసేస్తాడు" అని విసవిసా అక్కణ్నుంచి వెళ్ళిపోయింది రాధిక.

"వయసొచ్చిన ఆడపిల్లవి. ఆడెస కాలే ఎళ్ళడానికి బుద్దిలేదూ ?" వెంకటరత్నం మాటలకి రాధిక ఎవరో వీపు మీద ఛెల్లున కొట్టినట్లు ఫీలయింది. ఆమె గుడ్లలో నీళ్ళు తిరిగాయి.

మర్నాడుదయమే రంగయ్య వచ్చి బ్రాకెట్ లో అతను ఆడిన నంబరు కొట్టిందని చెప్పాడు. వెంకటరత్నం ముఖం ఆనందంతో వికసించింది. "నాకు పది రూపాయలిస్తే 'ఆ డబ్బు అడిగి తీసుకొస్తా" అన్నాడు రంగయ్య. వెంకటరత్నానికి వేరేదారి కనబళ్లేదు. "సరే అలాగే కానియ్యి. నీ చేతులో కట్టావ్. ఈ అదురుష్టంలో నీకూ బాగముంది" అని చీటీ అందించాడు. అది తీసికెడితేనే డబ్బు ఇస్తారు.

రంగయ్య అక్కణ్నుంచి హుషారుగా వెళ్ళిపోయాడు. వెడుతూ వాడు చూసిన చూపు రాధికకు చిరాకు కలిగించింది.

తండ్రికి డబ్బు రావడం ఆమెకు ఆందోళనగా వుంది. వచ్చిన డబ్బుతో అతను రోజూ రంగయ్య ద్వారా తెప్పించుకుని తాగేసాడని భయపడింది. పోనీ అన్నకు చెప్దామంటే తండ్రిని నిలబెట్టి అడుగుతాడని భయం. చెప్పినందుకు తండ్రి తనని తిడతాడు. పోనీ చెప్పకుండా ఉందామంటే తండ్రి ఆరోగ్యం ?




పది గంటలకు మోహన్ తండ్రికి కేరియర్ తీసుకొచ్చాడు "నువ్వింటి కెళ్ళి స్నానం చేసి భోజనం చేసిరా. అప్పటిదాకా నేనిక్కడుంటాను" అన్నాడు మోహన్. అప్పటికి వెంకటరత్నం నిద్రపోతున్నాడు. రాధిక మోహన్ని బైటికి పిల్చి జరిగినదంతా చెప్పింది. చివర్న "ఇవన్నీ నీకు చెప్పినట్లు నాన్నతో అనకు. నన్ను తిడతాడు" అంది భయపడుతూ. "అలాగేలే" అన్నాడు మోహన్.

తండ్రి లేచి భోంచేశాక డాక్టర్‌తో మాట్లాడి వచ్చాడు మోహన్. అప్పటికి రాధిక కూడా వచ్చింది.

"డాక్టర్‌గారు నిన్ను ఇంటికి తీసి కెళ్ళమన్నారు. సాయంత్రం వెడదాం" అన్నాడు మోహన్.

వెంకటరత్నం చటుక్కున రాధిక మొహంలోకి చూశాడు. తన చూపులు కొడుకు గ్రహిస్తున్నాడనిపించి చూపులు పక్కకి తిప్పాడు.

"ఇక్కడ బాగానే వుందిగా! ఇంకొన్నాళ్ళు ఉండనియ్యరా?" అన్నాడు వెంకటరత్నం. అంతవరకు నరకం నరకం అన్న తండ్రి ఇప్పుడెందుకలా అంటున్నాడో కొడుకు, కూతురు గ్రహించారు.

"ఇంటి దగ్గరైనా ఈమాత్రం బాగానే వుంటుంది. చిట్టీ! నేను సాయంత్రం అయిదింటికల్లా వచ్చేస్తాను. అన్నీ సర్దేసి సిద్ధంగా వుండు" అని చెప్పి వెళ్ళిపోయాడు మోహన్.

వెంకటరత్నం స్వాతంత్ర్యం కోల్పోయినట్లు ఫీలవుతూ కప్పుకేసి చూస్తూ ఉండిపోయాడు.




జీవితంలో తప్పటడుగులు వేసిన వెంకటరత్నం మెల్లిగా కర్ర సాయంతో తప్పటడుగులు వేస్తున్నట్టు నడుస్తున్నాడు. నడవగలుగుతున్న కొద్దీ అతనికి మానసికంగా బాధ ఎక్కువైంది. సఖ్యి మనుషుల్లో తిరగబోతున్నందుకు ఆనందం లేకపోలేదు. కాని నడవడం చేతనవుతున్న కొద్దీ అతనికి ఇంట్లోఉండబుద్ధి కావడం లేదు.

రోగం రాని క్రితం సారా దుకాణంలో గడిపిన సాయంత్రాలు, రాత్రి పన్నెండు గంటలదాకా అయ్యరు కాఫీ హోటల్లో టీ మీద టీ తాగుతూ క్లోజింగు సంబరు కోసం వేచిఉన్న ఘడియలు, సీనియర్ ఆటగాళ్ళు కూడా బ్రాకెట్ విషయంలో తసని సంప్రదించడాలు...జ్ఞాపకం వచ్చి అతని మనసు వికలమవుతోంది.

గతం ఆనందంగాను, నేడు బాధామయంగాను, భవిష్యత్తు నిరాశగాను కనిపిస్తోంది. స్వేచ్ఛగా గడిపిన ఘడియలు మళ్ళీ రావనుకున్నప్పుడు ఏడుపొస్తుంది. జబ్బుపడ్డ మూలంగా పనిలోకి వెళ్ళలేకపోతున్నందుకు, సంపాయించలేకపోతున్నందుకు అంతగా బాధ పళ్ళేదు. పైకి అనకపోయినా" ఇన్నాళ్ళు యాతనలు

పడ్డాను. ఇంకెన్నాళ్ళు? పెద్ద కొడుకై నందుకు ఆడికి తప్పవ్!" అని మనసులో అనుకుని సంతృప్తి పడుతున్నాడు.

ఎంతగా తనను తాను సమాధాన పరచుకున్నా అంతరాత్మ తన బాధ్య తల్ని ఎత్తి చూపుతూనే ఉంటుంది. ఆ అంతరాత్మను తొక్కెయ్యడానికి మనసు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటుంది.

వివేకం,విచక్షణ వున్నవాళ్ళు తమలో జరిగే ఈ ఘర్షణను బేరీజు వేసుకుని తమ పంథా ఏమిటో నిర్ణయించుకుంటారు. మూర్ఖంగా ఆలోచించేవాళ్ళు అంతరాత్మ గొంతు నులిమేసి హాయిగా ఉండాలను కుంటారు.

వెంకటరత్నం రెండో తరగతి మనుషుల్లోనివాడు. అతనిప్పుడు కొడుకు మంచితనాన్ని గుర్తించే స్థితిలో లేడు. ప్రతిచిన్న విషయానికి భార్యను,కూతుర్ని తిట్టడం, కేకలు వెయ్యడం లాంటివి జరుగు తున్నపుడు మోహన్‌కి బాధకలుగుతుంది. అలాంటప్పుడు తండ్రిని మందలించక తప్పదు.



"అప్పన్నా! కుంటి ఎదవగా బతకడమే నా తప్పు. నేను సస్తే మీకీ సమస్యలన్నీ ఉండవ్" అని తండ్రి అన్నప్పుడల్లా అతని మనసు చివుక్కు మంటుంది.

తండ్రితో జాగ్రత్తగా వ్యవహరిస్తూ ఓపిక పట్టమని తల్లికి, చెల్లికి, తమ్ముళ్ళకు చెబుతుంటాడు. ముఖ్యంగా పెళ్ళికెదిగిన చెల్లెల్ని తండ్రి నోటికొచ్చిన బూతులు తిట్టడం మోహన్‌కి ఎక్కువ బాధ కలిగ స్తుంది

కాని ఎన్నాళ్ళు? ఏమిటి పరిష్కారం? చిరాకులు, పోట్లాటలు, బూతులు, కన్నీళ్ళు ...... ఎన్నాళ్ళు ?

ఆస్పత్రిలో వుండగా వచ్చిన డబ్బు వెంకటరత్నానికి కొన్నాళ్ళు శాంతి నిచ్చింది. పక్కింటి కుర్రాడిద్వారా ఎవరికీ తెలియకుండా కొన్నాళ్ళు బ్రాకెట్ ఆడాడు. ఏ ఒక్కరోజు ఆటకొట్టలేదు. అతనిదగ్గర బ్రాకెట్ ఛార్టుల్లేవు. మిగతా వారితో సంప్రదింపుల్లేవు. అందువల్లే తనకి డబ్బు రాలేదని అతను భావించాడు.

ఓ వారం పదిరోజులు బ్రాకెట్టయితే ఆడగలిగాడు కాని తాగడం మాత్రం సాధ్యపడలేదు.

పక్కింటి కుర్రాడి ద్వారా తండ్రి బ్రాకెట్ ఆడుతున్నాడన్న విషయం మోహన్‌కి తెల్సింది. "ఎందుకు డబ్బులు తగలేస్తావ్? పెద్దవాడివి. నాచేత ఎందుకు చెప్పించుకుంటావ్?" అని అడిగాడు. కొడుకు అలా అడిగినందుకు వెంకట రత్నంకి కోపమొచ్చింది.

"నీ డబ్బులేం తగలెయ్యలేదుగా! నీ కెందుకు బాధ?" అన్నాడు పౌరుషంగా.

"డబ్బు ఎవరిదైనా తగలెయ్యడం తప్పు. దాంతో పళ్ళు కొనుక్కుని తినొచ్చుగా !"

మోహన్ మరింత కోపంగా అన్నాడు.

"పెట్టినన్నాళ్ళు మీ అందరికీ నేనే పెట్టాను. ఇప్పుడు మూలపడ్డాను కాబట్టి నువ్వెట్టే తిండితోపాటు నీ తిట్లు కూడా తింటున్నాను."

ఆ రాత్రి భోంచెయ్యనని అలిగి పడుకున్న వెంకటరత్నంతో "నామీద కోపంతో అన్నం మానటమెందుకు?నీరసం వస్తుంది. లేచి తిను" అని ఇంట్లోంచి బైటికెళ్ళిపోయాడు మోహన్.

"అన్నం పెట్టవే!" అని భార్యతో అని వెంకటరత్నం మంచంమీంచి లేచాడు.

* * *

"బెంజిలారీలా హాయిగా బతికేవోణ్ని బ్రేక్ చెయ్యడానికి పనికిరాని లారీలా ఇలా మూలపడిపోయాను."

వెంకటరత్నం కవి కాడు. అయినా ఆరోజు మధ్యాహ్నం నుంచి ఆలోచించి తను మాటాడాల్సిన మాటలకు రూపం వచ్చాక శర్మగారింటికివెళ్ళి ఆ మాటలనేసి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. శర్మగారు బాధపడ్డారు. ఎంత చెప్పినా వినిపించు కోకుండా వ్యసనాలకి బానిసై జీవితాన్ని పాడుచేసుకున్న వెంకటరత్నం మీద ఆయనకి కోపం, జాలి రెండూ కలిగాయి.

"బాధపడకు. ఇహముందైనా జాగ్రత్తగా ఉండు. నువ్వింకా అదృష్ట వంతుడివి. బాధ్యత తెల్సిన కొడుకు వున్నాడు. శేషయ్య చూడు ఎంత బాధ పడుతున్నాడో? తీరా కాలు వంగేనాటికి రెక్కలొచ్చిన కొడుకు ఎగిరిపోయాడు. పెళ్ళాం పిల్లలతో అతనిప్పుడు నానా బాధలు అనుభవిస్తున్నాడు" అన్నారు.

"ఏం కొడుకు బాబూ ! మీరంతా అలా అనుకుంటారు. ఆడు నన్ను, పిల్లల్ని ఎంత ఇబ్బంది పెడుతున్నాడో మీకు తెలియదు. మీరిచ్చిన డబ్బులో ఒక్క రూపాయి




కూడా నారోగం కోసం కర్చు సెయ్యలేదు. పైగా తనమీద పడి తింటున్నామని సీదరింపులు. కడుపు సించుకుంటే కాళ్ళమీద పడతాది. నా మనసిరిగి పోయింది. బాబూ ! ఎందుకు బతకాలా అనిపిస్తాంది."

వెంకటరత్నం దాదాపు ఏడుస్తూ చెప్పాడు.

శర్మగారికి జాలి కలగలేదు. అతను చెప్పిన దాంట్లో కాస్తకూడా నిజం లేదన్న విషయం ఆయనకి తెలుసు. అతనలా ఎందుకు చెప్తున్నాడో కూడా ఆయనకి తెలుసు. అబద్ధాలు చెప్పినందుకు అతని మీద కోపంవచ్చినా ఆయన ఏమీఅనలేదు. వ్యసనాలకు అలవాటుపడ్డవాళ్ళు ఎన్ని అబద్ధాలాడతారో ఆయనకి తెలుసు.

"సరే నీ కొడుకుని ఓ సారి రమ్మన్నానని చెప్పు. అతనితో మాట్లాడతాను. అంతదాకా ఈ ఇరవై ఉంచు" అని రెండు పది కాయితాలందించారు.

"చిత్తం" అని అతను కుంటుకుంటూ వెళ్ళిపోయాడు.

శర్మగారింటిలోంచి బైటి కొచ్చిన వెంకటరత్నం ఆనందాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరయిపోతున్నాడు. అతను రెండు పది కాయితాల్ని చూసి చాల కాలమైంది. ఓ రోజు కొడుకుని పళ్ళు కొనుక్కోవాలి అయిదు రూపాయలిమ్మంటే షెడ్‌కెళ్ళి కుర్రాడి చేత పంపిస్తానన్నాడు. ఓ గంట పోయాక ఆ కుర్రాడు పళ్ళబుట్ట తీసికొచ్చి ఇచ్చాడు.

వెంకటరత్నానికి కోపం వచ్చింది. కొడుకు అయిదు రూపాయలి స్తే హాయిగా తాగొచ్చనుకున్నాడు. ఏ మనిషైనా తెలివిగా ప్రవర్తిద్దామనుకున్నపుడు అవతలిమనిషి మరింత తెలివిగా ప్రవర్తించి బోల్తాకొట్టిస్తే కోపం వస్తుంది.

జేబులో ఇరవై రూపాయలుండేసరికి వెంకటరత్నానికి ఆ రోజు జ్ఞాపకం వచ్చింది.

'అయిదు రూపాయలిమ్మంటే నీ అతి తెలివి సూపించావ్. ఇప్పుడు నా జేబులో ఇరవై ఉన్నాయి తెల్సా!' అనుకున్నాడు.

ఇరవై రూపాయలతో ఏంచెయ్యాలన్న ఆలోచన కలిగిందతనికి. ఏమైనా చెయ్యొచ్చు. చెయ్యాల్సినవి చాలానే ఉన్నాయి. కాని ఉన్నవి ఇరవై మాత్రమే.

ఏడు గంటలదాకా మార్కెట్ లో తిరిగాడు. జబ్బుపడ్డ కాలుతో తిరగడానికతనికి శ్రమ అనిపించలేదు. ఏడుగంటలు దాటాక ముత్యాలమ్మ సారా దుకాణానికి వెళ్ళాడు.

చాలా రోజుల తర్వాత ప్రవేశించిన వెంకటరత్నానికి ఆ పాక కొత్తగావుంది- అక్కడెన్నో మార్పులొచ్చాయి.

"ఏం ఎంకటరత్తం. ఒంట్లో ఎలా వుంది ? సాలా రోజుల కొచ్చినావ్ ?" అంది ముత్యాలమ్మ.

అతని మనసు ఉల్లాసంగా వుంది. ఏదో నోరు తడుపుకోడానికి అన్నట్టు కాకుండా కాస్త ఎక్కువగానే తాగాలని పించింది. తొందరగా ముగించకుండా లేటుగా ఇంటికి వెళ్ళాలనుకున్నాడు.

తొమ్మిదింటికి ఇంటికి వచ్చిన మోహన్ భోంచేసి వెంటనే నిద్రపోతాడు. ఆ తర్వాత ఇంటికి వెడితే అతని కంటపడాల్సిన బాధ తప్పుతుందని వెంకటరత్నం ఆలోచన.

అందుకే తీరిగ్గా మాంసం పకోడీలు తింటూ, తాగుతూ పదిగంటల్దాకా కాలక్షేపం చేసి పది రూపాయలు ఖర్చుపెట్టి బైట పడ్డాడు.

వంతెన దగ్గర కొచ్చేక ఎవర్నో టైం అడిగితే పదిన్నర అయిందన్నారు. కొడుకు ఇంకా మెలకువగా ఉంటాడే మోననిపించింది.

కాలవగట్టున వినాయకుని గుడి దగ్గర చాలా సందడిగా వుంది. లైట్లు వెలుగుతున్నాయి. వెంకటరత్నం అక్కడికి చేరుకున్నాడు.

'సీతాకళ్యాణం' నాటకం జరుగుతోంది.

వెంకటరత్నానికి పౌరాణిక నాటకాలంటే ఇష్టం. వ్యసనాలు ఎక్కువ కానీ డ్యూటీదిగి, స్నానంచేసి భోంచేసి ఏ గుడి దగ్గరకో వెళ్ళటం అతని అలవాటు. అతనో సారి ఏలూరు వెళ్ళడం, లారీ అన్‌లోడింగ్ కాని కారణంగా ఆ రాత్రి అక్కడ ఉండి పోవడం జరిగింది. అనుకోకుండా అతనో నాటకానికి వెళ్ళాడు. రెంటచింతల సత్యనారాయణగారు కృష్ణుడిగా నటించారు అన్ని పద్యాలు ఆయన ఒక్కడూ ఎలా పాడతాడో వెంకటరత్నానికి అర్థంకాలేదు. ఆయన అతని మనసులో నిలిచిపోయారు. ఆ తర్వాత ఆయన నాటకం ఎక్కడఉన్నా పిలునుబట్టి వెళ్ళి చూసేవాడు.

వెంకటరత్నం అలాగే నాటకం చూస్తూ కూర్చుండిపోయాడు. అతని కందులో రామ పాత్రధారి బాగానచ్చాడు.

నాటకం పూర్తయ్యాక నటీనటులు స్టేజి వెనక్కి వెళ్ళి సామాన్లు సర్దుకుంటున్నారు. వాళ్ళచుట్టూ జనం మూగారు. వెంకటరత్నం మెల్లిగా ముందు కెళ్ళి రామ పాత్రధారితో "బాగా పాడారు. తమ దేవూరు?" అనడిగాడు.

"అత్తిలి" అతను సమాధానమిచ్చాడు.

అతని పేరు సత్యం. ఆ నాటక సమాజానికి అతనే ఆర్గనైజర్.

వెంకటరత్నం తనకు తెలియకుండానే సత్యం మీద అభిమానమేర్పర్చుకున్నాడు.

సత్యం సీత పాత్ర వేసిన అమ్మాయికి డబ్బు అందిస్తూ "పద్మాలుగున భీమవరంలో నాటకం. వస్తావుగా?" అనడిగాడు

"పద్మాలుగైతే కుదరదు. మర్నాడు మా అక్కయ్యపెళ్ళి" అందామె.

"చంపేశావ్. ఎడ్వాన్స్ కూడా తీసుకున్నాను. ఇప్పుడెలా?" సత్యం ఆందోళనగా అన్నాడు.

"ఏం చెయ్యను గురూగారూ! అక్కయ్య పెళ్ళి-- అదీ అనకాపల్లిలో. నాటకం వేసి అందుకోలేను. పోనీ మార్టేరు ఉష వేసుందేమో కనుక్కోండి."

ఏం చెయ్యాలో తెలియక తికమక పడ్డాడు సత్యం.

"ఒక్కో నాటకానికి ఎంతిస్తారండీ?" వెంకటరత్నం నవ్వుతూ అడిగాడు.

"తెల్సున్న అమ్మాయి కాబట్టి నూట పాతిక. కొందరు ఇంకా ఎక్కువ తీసుకుంటారు!"

వెంకటరత్నం బుర్ర చురుకుగా పనిచేసింది. అతను మనసులో ఎన్నో ఆలోచనలు, మంచి చెడ్డలు బేరీజు వేసుకుంటున్నాడు.

తర్వాత సత్యంగారితో ఓ అరగంట మాట్లాడాడు. చివర్న "అయితే ఎనిమిదో తేదీన మీ దర్శనం చేసుకుంటాను" అని అక్కణ్ణుంచి ఆనందంగా వెళ్ళి పోయాడు.

సత్యంతోమాట్లాడాక వెంకటరత్నంలో ఉత్సాహం పెరిగింది. అతను వడి వడిగా అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు. ప్రపంచమంతా తన ముందు పరచి వున్నట్టు, అవకాశాల్ని కైవసం చేసు

కొ ద మే అలస్యమన్నట్టు పీల వు తున్నాడు.

దారిలో మరికా స్త మందు వేసుకున్నాడు. అది అమోనియా సరుకు కావడంతో గొంతు మండింది. అతనిక్కావల్సిన 'కిక్' అందుకుంది.

తీరా ఇంటికెళ్ళేసరికి మ త్తంతా దిగి పోయింది. మోహన్ మెలకువగా ఉండి తండ్రి కోసం ఎదురు చూస్తున్నాడు.

"నువ్వు రాకపోతే కంగారు పడుతు న్నాము. ఎక్కడికెళ్ళావ్ నాన్నా" అనడి గాడు. నాటకాని కెళ్ళానని వెంకటరత్నం సమాధానమిచ్చాడు. తండ్రి మాటలో తేడా మోహన్‌కి స్పష్టంగా తెలిసింది. అంత వరకు తండ్రి మీద అతను చూపించిన ఆదుర్దా, ఆప్యాయతా అన్నీ తుడుచుకు పోయాయి.

"మనిషన్నాక ఓ సారి చెప్తే తెలి యాలి. నీ ఆరోగ్యం కోసం మేమంతా బెంగపడి ఛస్తున్నాం. నువ్వెళ్ళి హాయిగా తాగొచ్చావ్. ఏదైనా అయితే బాధపడా ల్సింది మేం.''

కొడుక్కి ఎదురు చెప్పబోయాడు. సమర్థించుకోబోయాడు. మోహన్ ఏమీ వినదల్చుకోలేదు. తను అనదల్చుకున్నవి అనేసి వెళ్ళి మంచం మీద పడుకున్నాడు.

అన్నం తినడానికి రమ్మని పిల్చిన భార్యతో ''అన్నం తిన్నా-పో అవతలకి'' అన్నాడు వెంకటరత్నం. అది విన్న మోహన్ తండ్రిని బతిమాలకూడదను కున్నాడు.

సత్యంతో తను మాట్లాడిన విషయాలు మననం చేసుకుంటూ ఆశల్ని పెంచు కుంటూ హాయిగా నిద్రపోయాడు వెంకట రత్నం.

* * *

నాల్గురోజుల పాటు తండ్రీకొడుకులు ముభావంగా మసిలారు. అన్ని రోజులు వెంకటరత్నం జాగ్రత్తగా మసలు కొన్నాడు. తాగలేదు. బ్రాకెట్ ఆడలేదు.

ఆ రోజు సాయంత్రం మోహన్ తండ్రిని రిక్షాలో డాక్టర్ దగ్గరికి తీసు కెళ్ళి పరీక్ష చేయించాడు. మందులు కొన్నాడు. పళ్ళు కొన్నాడు. తిరిగి వస్తు న్నప్పుడు "నా రోగంతో నిన్ను సాలా ఇబ్బందులెడుతున్నానురా పెద్దోడా" అన్నాడు వెంకటరత్నం.

మోహన్ మనసు ఆర్ద్రమైంది.

"తండ్రికిమాత్రం చెయ్యడం గొప్పేం కాదు. నువ్ కాస్త పత్యం చేసావంటే ఇంకా తొందరగా తగ్గిపోతుంది" అన్నాడు. పత్యం అని ఎందుకు కొడుకు వత్తి పలి కాడో వెంకటరత్నానికి అర్థమైంది.

ఆ రాత్రి భోజనాలు చేశాక వెంకట రత్నం ఇంటిముందు అరుబైట పడక్కు ర్చీలో కూర్చున్నాడు. కాస్త దూరంలో మోహన్ మంచం మీద పడుకుని చిన్న తమ్ముడితో కబుర్లు చెప్తున్నాడు. మిగతా వాళ్ళు ఇంటిలో అన్నం తింటున్నారు.

వెంకటరత్నానికి కొడుకుతో మాట్లా డానికి మంచి సమయంలా తోచింది.

'నేనోసారి ఆరివిల్లి ఎళ్ళొద్దామను కుంటున్నాను."

తండ్రి మాటలు విన్న మోహన్ రెండు క్షణాలు ఏమీ మాట్లాడలేదు.

''ఎందుకిప్పుడు?" చాలా మామూలుగా అడిగాడు.

వెంకటరత్నానికి ఉత్సాహమొచ్చింది.

''ఏంలేదు. మీ అత్తనోసారి చూడా లని వుంది-"

మోహన్ ఏమీ మాటాడలేదు. కొడు కుని ఒప్పించడానికి అదే మంచి సమ

యంగా తోచింది వెంకటరత్నానికి.

''నేను జబ్బుపడ్డప్పుడు త్తరంరాయిస్తే తను మంచాన పడ్డానని జవాబు రాయించింది. అప్పట్నించి దాన్ని చూడాలని ఉంది. మా అమ్మ సంతానంలో దానికి నేను, నాకది మిగిలాం" బాధగాఅన్నాడు వెంకటరత్నం.

వెంకటరత్నం తరఫున మిగిలింది అతని చెల్లెలు సుభద్ర మాత్రమే.ఆమెకు అన్నగారన్నా, అన్నగారి కుటుంబమన్నా వల్లమాలిన అభిమానం. పూర్వం వీలైనప్పుడల్లా వచ్చి అన్నగార్ని, పిల్లల్ని చూసి వెడుతుండేవి.

ఒక్కొక్క తరం వెనక్కి వెళ్ళి మరో తరం ముందుకి రావడంతో చుట్టరికాలు, బంధుత్వాలు మెల్లగా సన్నగిల్లుతాయి.

మోహన్‌కి తన చిన్నప్పట్నించి సుభద్ర త్తయ్య తన కుటుంబం మీద చూపిన ప్రేమ,ఆప్యాయత గుర్తుకొచ్చాయి. తను సంపాదనాపరుడయ్యాక ఒకసారి ఆరవిల్లి వెళ్ళి ఆమెను చూసి ఆమెకు కొత్త బట్టలు ఇచ్చి వద్దామనుకున్నాడు. కాని సాగలేదు.

''నాల్గురోజులాగితే నేనూ వస్తాను. నిన్ను అక్కడదించేసి నేను వచ్చేస్తాను'' అన్నాడు మోహన్.

వెంకటరత్నం ఇరకాటంలో పడ్డాడు.

"నీతో పెట్టుకుంటే అయినట్టే! పిల్లను తీసుకుని ఎల్తాను'' అన్నాడు.

"సరే అయితే వెళ్ళిరండి" అన్నాడు మోహన్.

వెంకటరత్నానికి విజయం సాధించినట్టుగా ఆనందంగా వుంది. భర్త ప్రయాణము విషయం తెల్సిన వెంకటరత్నం భార్య"ఇంకాసరిగా నడవలేకపోతున్నారు. ఇప్పుడెందుకురా!" అంది మోహన్‌తో.

"అత్తయ్యను చూడాలని వుందట. పోనీ వెళ్ళిరానీ. ఏ లోటు రాకుండా అత్తయ్య చూసుకుంటుంది. కూడా చిట్టి ఉంటుంది" అన్నాడు.

తల్లి మరేం మాట్లాడలేదు.

* * *

ఉదయమే ఫస్టు బస్‌కి ఆరవిల్లి ప్రయాణం.

మోహన్ తండ్రికి ముప్పై రూపాయలిచ్చాడు. అతనికి తెలియకుండా చెల్లెలికి పది రూపాయలిచ్చాడు.

''నాన్న తాగకుండాచూడు.అత్తయ్య వుంటుంది కాబట్టి జాగ్రత్తగానేఉంటాడు. అవసరమైతే అత్తయ్యకు చెప్పు. మందలిస్తుంది. వారంరోజులుండి వచ్చెయ్యండి'' అన్నాడు చెల్లెలితో.

చాలా రోజుల తర్వాత ఊరెడుతున్నందుకు రాధికకు ఆనందంగావున్నా తండ్రి ఏం ఇబ్బందులు పెడతాడోనని ఓ మూల, తల్లిని ముఖ్యంగా అన్నయ్యను వదిలి వెడుతున్నందుకు మరో మూల బాధగా వుంది.

సెంటర్‌దాకా వెళ్లి రిక్షా తీసుకొచ్చి వాళ్లిద్దరూ ఎక్కి వెళ్లేదాకా అక్కడే నిలబడ్డాడు మోహన్.

రిక్షా కదిలి వెళ్లిపోయేక 'నాన్నరోజూ ఇలా ఉంటే ఎంత బాగుండును' అనుకున్నాడు.

* * *

బస్సు కిటికీలోంచి కిళ్ళీకొట్టుకివేలాడుతున్న పత్రిక ముఖచిత్రంగా ఉన్న సినీ తారను చూస్తున్న రాధిక తండ్రి భుజం తట్టడంతో లోకంలో కొచ్చింది.

''దిగు'' అన్నాడు వెంకటరత్నం.

రాధికకు ఏమీ అర్థం కాలేదు. ''ఇది అత్తిలి నాన్నా – ఇక్కడెందుకు దిగడం"




అంది రాధిక. "టికెట్ ఇక్కడికేకొన్నాను ఇక్కడ పనుంది దిగు" అన్నాడు వెంకట రత్నం.

ఆమె మళ్ళీ ఏదో అడగబోయింది.

కాని అప్పటికే తండ్రి బస్సు దిగేసి కింద నిలబడ్డాడు. కండక్టర్ రైట్ చెప్పాడు. డ్రైవర్ బస్సు స్టార్ట్ చేసాడు.

తండ్రి ఎందుకు ఆ తిలిలో దింపుతున్నాడో అర్థంకాని స్థితిలోనే ఆమె హడావుడిగా బస్ దిగిపోయింది.

ఆ తిలిలో దిగడానికి గల కారణమేమిటో ఎన్నిసార్లడిగినా చెప్పలేదు వెంకటరత్నం.

"ఇక్కడ చిన్న పని ఉంది" అని తప్పించుకుంటున్నాడు. రాధిక మనసు పరిపరి విధాల పోయింది. తండ్రి తన అన్నకు తెలియకుండా తాగెయ్యడానికి ఆ తిలి వచ్చాడేమోనన్న అనుమానం కలిగింది. అలాంటప్పుడు తననెందుకు తీసుకొచ్చాడో అర్థం కాలేదు.

వెంకటరత్నం రిక్షా మాట్లాడాడు. ఇద్దరూ రిక్షా ఎక్కారు. "ఇక్కడ పని అయిపోగానే ఆరివిల్లి వెడదామా" రాధిక రిక్షా ఎక్కాక తండ్రినడిగింది. అతనేమీ మాట్లాడలేదు. ఎటో చూస్తున్నాడు. ఆమెకేమీ అర్థంగావడంలేదు. భయంగాకూడా వుంది. మరీ రెట్టించి అడిగితే తండ్రి తిడతాడు.

రిక్షా ఓ పెంకుటింటి ముందు ఆగింది.

వెంకటరత్నం అరుగుమీద కెళ్లి "సత్యంగారున్నారాండి" అనడిగాడు. రాధిక అతని వెనకాలే వెళ్ళి అరుగు మీద నిలబడింది.

ఆ యింటి ఇల్లాలు బైటికొచ్చి "ఆయన పనివుండి బైటకు వెళ్లారు. మీరెవరూ?" అనడిగింది.

"నాపేరు వెంకటరత్నం. మాది తాడేపల్లిగూడెం."

"మీరొస్తే కూర్చోమన్నారు. ఆ గదిలో కూర్చోండి" అరుగుకి చేర్చిఉన్న గది చూపిందామె.

ఆ గది విశాలంగా ఉంది. గోడలకి పూర్వపు పౌరాణిక నటుల ఫొటోలున్నాయి. ఓ గోడకి ఆదిభట్ల నారాయణ దాసుగారి పెద్ద ఫొటో ఉంది.

గది పరిశుభ్రంగా ఉంది. నేలమీద పెద్ద ఈతాకు చాపలు పరచివున్నాయి. ఓ మూల హార్మోనియంలు, తబలాలు ఉన్నాయి. రాధిక గదంతా పరికించి చూసింది. ఆఇంటతను సంస్కారవంతుడి లాగే అనిపించాడు. తండ్రికి అతనితో పనేమిటో ఆమెకు అర్థం కాలేదు.

ఇంటావిడ రెండుగ్లాసులలో కాఫీ తీసకొచ్చి ఇచ్చింది:

"సత్యంగారు రావడానికి ఆలీసమౌతుందామ్మా!" ఆమెను వెంకటరత్నం అడిగాడు.

"లేదు వచ్చేస్తారు. మిమ్మల్ని ఉండమని చెప్పారు" అందామె.

"మేం సుబ్బారాయుడి గుడిదాకా ఎల్తాం. సత్యంగారితో మళ్లీవస్తామని చెప్పండి. మా సంచీ కూడా ఇక్కడే పెడుతున్నాం" అన్నాడు వెంకటరత్నం కాఫీలు ముగించాక.

ఆమె సరేనంది.

రాధిక మౌనంగా తండ్రిననుసరించింది.

అక్కడికి రెండు ఫర్లాంగుల దూరములో ఉంది సుబ్రహ్మణ్యేశ్వర స్వామి గుడి.

గుడి దగ్గరకెళ్ళాక వెంకటరత్నం కటకటాల్లోంచే దేవుడికి దణ్ణం పెట్టుకు

న్నాడు. డిబ్బీలో చిల్లర డబ్బులువేసాడు. రాధికకు చిల్లర యిచ్చి డిబ్బీలో వెయ్య మన్నాడు.

అతను గుడి అరుగుమీద ఓ మూలగా జానింపీట వేసుకుని కూర్చున్నాడు. రాధిక కూడా ఆ మూల కూర్చుంది.

తను చెప్పదల్చుకున్నది ఎలా చెప్పాలో తెలియక తండ్రి, తనని అక్కడికి ఎందుకు తీసుకొచ్చాడో, ఏం చెయ్య దల్చుకున్నాడో తెలియక కూతురు మౌనముగా ఉండిపోయారు.

ఇద్దరి మధ్య భయంకరమైన నిశ్శబ్దం.

అడగాలని ఆమె...చెప్పాలని అతను.

అడగలేక... చెప్పలేక... అదొక విచిత్ర పరిస్థితి.

"మనం ఇందాక వెళ్ళాం. ఆయన తెల్సా?" తన ప్రశ్నకు అర్థంలేదని వెంకటరత్నానికే తెలుసు.



తండ్రి అసలు విషయానికి వస్తున్నాడని ఆమె గ్రహించింది.

తెలియదన్నట్టుగా తల ఊపింది.

"సత్యంగారని గొప్ప నాటకాల మనిషి. ఆయనకో సొంత ట్రూపు కూడా వుంది. చాలాబాగా వేస్తారు"

వెంకటరత్నం తర్వాత మాటలకి వెతుక్కుంటున్నాడు.

"ఆయన ఇంతకుముందు నీకుతెల్సా?" ఆమె అమాయకంగా అడిగింది.

"తెల్సు. సాలామంచాయన. నేనంటే అభిమానం కూడా."

రాధికకు ఏమీ అర్థం కాకుండా వుంది.

"ఆయనతో మాట్లాడాక ఆరివిల్లి వెళ్ళిపోదామా?"

ఆమె మాటలు విననట్టుగా వెంకటరత్నం ఎటో చూస్తున్నాడు.

ఆమెకు అయోమయంగా,అసహనంగా వుంది-ఏదీ అర్థం కాకుండా వుంది.

అతనూ అయోమయంగానే ఉన్నాడు.

అతని మనసునిండా ఆలోచనలు, పథకాలు...




"సత్యంగారు నీతో నాటకం ఏయించమని నన్ను కోరారు."

వెంకటరత్నం మౌనాన్ని బద్దలు కొట్టాడు. రాధిక చటుక్కున తండ్రి ముఖంలోకి చూసింది. తను తండ్రినుంచి ఆ మాటలు విన్న క్షణం బద్ధలయినట్టనిపించింది. బద్దలయినక్షణంలోంచి వెలుగు, చీకటి బైటికొచ్చినట్టు ఫీలయ్యింది.

తను నాటకం వెయ్యడమేమిటి?తనకేం వచ్చని? తండ్రి మతి ఉండే మాట్లాడుతున్నాడా? సత్యంగారు తండ్రికి ఎప్పుడీ విషయం చెప్పారు?మరి తండ్రి ముందుగా తన కెందుకు చెప్పలేదు? ఎందుకు రహస్యంగా ఉంచాల్సివచ్చింది? తనసలు నాటకం వెయ్యొచ్చా? తండ్రికి అభ్యంతరం లేదా? ఈ విషయం అన్నయ్యతో నాన్న ఎందుకు చెప్పలేదు? ఆరివిల్లి వెడుతున్నామని అన్నయ్యతోచెప్పి అత్తిలి ఎందుకు తీసుకొచ్చాడు? ఈ విషయాలన్నీ అన్నయ్యకు తెలిస్తే?

రాధిక మనసులో లక్ష ప్రశ్నలు మొలకెత్తాయి.

తండ్రిని ఏమడగాలో, ఏంచెప్పాలో ఆమెకు అర్థంకావడంలేదు. వెంకటరత్నం పరిస్థితి అలాలేదు. అతనెప్పుడో ఓ నిర్ణయానికి వచ్చేసాడు. దాన్ని అమలు చెయ్యడమే మిగిలి ఉంది. దానికి కూతురి సహకారం, తోడ్పాటు కావాలి. ఆమె అంగీకరిస్తే కొడుకుతో సమస్య...ఫరవాలేదు. కూతుర్ని తనవైపు తిప్పుకుని తన అభిప్రాయం అంగీకరింపచేస్తే కొడుక్కి నచ్చచెప్పవచ్చు. మరీ కాకపోతే ఖాతరు చెయ్యక్కర్లేదు. కూతుర్ని ఒప్పించడం కూడా కష్టమని అతనికి తెలుసు. ముఖ్యంగా ఆమె అన్నగారి అనుమతి లేకుండా ఏమీ చెయ్యదు. ఆమె కతని మీద నమ్మకం, అభిమానం ఎక్కువ.

ఇలాఆలోచించుకుంటూ కూర్చోకుండా కూతుర్ని ఒప్పించడానికి గట్టిప్రయత్నం చెయ్యాలనుకున్నాడు వెంకటరత్నం. ఈ విషయంలో రెండో ప్రయత్నం కుదర




దని అతనికి బాగా తెలుసు.

ఒకే ఒక్క ప్రయత్నం - అటో ఇటో తేలిపోవాలి. కూతురి మౌనం అతనికి గొప్ప రిలీఫ్ నిచ్చింది. ఆమె తన ప్రతిపాదన తోసిపడెయ్యకుండా ఆలో చిస్తోందని అతను అభిప్రాయపడ్డాడు. ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవా లనుకున్నాడు.

"పద్నాలుగో తేదీన భీమవరంలో సత్యంగారి ట్రూప్ నాటకం వుంది. అందులో ఏసే అమ్మాయి రానంది. నీ చేత ఏయించమని నన్ను కోరారు. కాదనలేక సరేనన్నాను."

రాధికకు ఏం చెప్పాలో తెలియలేదు.

"పైగా నువ్వు ఊరికే వెయ్యటంలేదు. నీకు నాటకానికి నూటపాతిక రూపాయ లిస్తారు. ఇలాంటి చాలా ప్రోగ్రాము లొస్తాయి. పెతిసారి డబ్బిస్తారు. ఇంటికి సాయంగా కూడా ఉంటుంది.

"పెద్దాడొక్కడు సంసారం కోసం యాతన పడతన్నాడు. అణ్ని సూస్తే నాకు జాలేస్తోంది. అవిటోణ్నయి ఆడికి ఏ రకంగాను సాయపళ్ళేకపోతున్నాను."

చివరి మాటలంటున్నప్పుడు నిజంగానే వెంకటరత్నం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. రాధిక జాలిపడింది. అయినా ఏంమాట్లాడ లేదు.

నాటకం వెయ్యడం తనకేం చేతనవు తుంది? అసలు తను నాటకం వెయ్యొచ్చా?

తన మనసులో మెదిలే ఏ ప్రశ్నకు ఆమెకు సమాధానం దొరకడంలేదు.

"నాటకం ఎయ్యలేనేమోనని అను మానమెద్దు. అది గొప్పేంకాదు. సత్యం గారు కన్నకూతురికి సెప్పినట్టు అన్నీ సెప్తారు. నేర్చుకో. ఈనాడు పెద్ద పెద్ద సినిమా ఈరోయిన్లయినాళ్ళంతా అలా నేర్చుకున్నవాళ్ళే."

రాధిక కళ్ళల్లో ఓ మెరుపు మెరిసి చటుక్కున మాయమైంది. అది వెంకట రత్నం కనిపెట్టాడు.

"నువ్ శ్రద్ధ చెయ్యాలేకాని చిన్ననాటి కాలమ్మాయిలా వుండిపోవు. పెద్ద ఈరో యిన్ అయిపోతావ్. తర్వాత నెమ్మదిగా సినిమాల్లో వేయొచ్చు. డబ్బు, పేరు, కార్లు, నౌకర్లు, పేపర్లో ఫొటోలు ... పెపంచమంతా నీ కాళ్ళముందుంటుంది. నీకంత బాగ్యం పట్టాలనే నా యాత నంతా..."

రాధిక మూగదానిలా వింటోంది. తండ్రి వివరిస్తున్న భవిష్యత్తును తల్చు కుంటే ఆమెకెంతో హాయిగా, ఉల్లాసంగా ఉంది. కాని అంతలోనే తను నిజంగా అంతపైకి వెళ్ళగలదా అన్న సందేహం ఆమెను వాస్తవప్రపంచంలో పడవేస్తోంది.

ఆమె ఊహలకి, నిజానికి మధ్యనున్న తీగమీద నడుస్తున్న దానిలా ఫీలవు తోంది.

రెండు నిముషాలపాటు ఇద్దరి మధ్య మౌనం. ఇద్దరిలో ఎవరు ముందు మాట్లాడ తారో ఇద్దరికీ తెలియదు.

"అన్నయ్య ఒప్పుకోడేమో నాన్నా! అయినా ముందుగా అన్నయ్యకి చెప్పక పోయావా?''

రాధిక అలా అడగడం వెంకటరత్నా నికి సంతోషం కలగజేసింది. ఆమెకర్థం తరం లేదన్నట్టుగా అతనర్థం చేసు కున్నాడు.

''నిజమే-పెద్దోడికి సెప్పలేదు. ఆడికి ఆలోచన తక్కువ. ఆవేశం ఎక్కువ. చెప్పగానే ఒద్దంటాడు. తర్వాత చెబ్దాం. ఆడు నిన్నేమీ అనకుండా చూసే పూచీ

నాది. పైగా ఆడికి సాయపడతా మంటున్నాం..."

వెంకటరత్నాన్ని మధ్యలోనే ఆపే సింది రాధిక.

"మన ఇంటా వంటా లేదు. అందరూ చెడ్డగా చెప్పుకుంటారేమో?" ఆమె సందేహా లన్నిటినీ శ్రద్ధగా విని సమాధానం చెప్పడానికే నిర్ణయించుకున్నాడతను.

"తప్పేటే ఎర్రిదానా?-నీ కూడా నే ఉంటాను. ఆ అనే వోళ్ళేవళ్ళూ మనకి కాస్తంతకూడా ఉపయోగపడరు తెల్సా?"

రాధికకు ఓ పక్క నాటకం వెయ్యా లని ఉన్నా మరోపక్క వెయ్యలేనేమో నన్న భయం. అధైర్యం.

"నేను నాటకం వెయ్యలేను నాన్నా! ఆరివిల్లి వెళ్ళిపోదాం" ఆమె మొండి ధైర్యంతో అంది.

వెంకటరత్నం రెండు నిమిషాలు ఆలో చించాడు.

"ఇకముందు మానేద్దువుగానిలే- ఈ సాగికి ఎయ్యి. ఆయనకి మాటిచ్చాను. పెద్ద మనిషి. బాగుండదు."

ఆమెను ఈ ఒక్కసారికి ఒప్పిస్తే తర్వాత సంగతి చూసుకోవచ్చు-అన్నది అతని ఆలోచన.

"నేను సరిగా చెయ్యలేకపోతే నన్ను తిట్టొద్దు"

ఆమె ప్రాధేయపడుతున్నట్టుగా అంది.

"నువ్వు బయపడాల్సిందేమీ లేదు. సత్యంగారు నీకన్నీ జాగ్రత్తగా సెప్తా రన్నా కదా!"

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఆమెమౌనం అంగీకార సూచకంగా అతని కనిపించింది.

అతని కళ్ళముందు రూపాయి కాయి తాలు రెపరెపలాడాయి. గుళ్ళో దేవుడికి మళ్ళీ దణ్ణం పెట్టుకున్నాడు.

"ఇక వెడదాం. ఆయనీపాటికి వచ్చే సుంటాడు."

రాధిక తండ్రిని మౌనంగా అనుసరిం చింది.

* * *

సత్యం గురించి వెంకటరత్నం చెప్పిన మాటల్లో రాధికకు ఏమీ అబద్ధం కనబడ లేదు. ఆయన పెద్దమనిషిలా కనిపిస్తాడు. అలాగే ప్రవర్తిస్తాడు. నాటకాలు వేసే వాళ్ళు అలా వుంటారని రాధిక అనుకో లేదు. ఆమెకు అతని మీద గౌరవం కలి గింది.

రాధికను చూసిన సత్యానికి చాలా ఆనందం కలిగింది. తన నాటకంలో సీత పాత్రకి ఆమె చక్కగా నప్పుతుందని పించింది. ఆమెలో ఉన్న లేతదనం, పొడుగు, వెడల్పైన కళ్ళు-సీతను ముగ్ధలా చూపించడానికి ఎంతో సహాయపడతాయని పించింది.

అవేళే రిహార్సల్ మొదలైంది. సమయం ఎక్కువ లేదు. ఆమెకు నాట కంలో వున్న డైలాగులు తక్కువైనా నాటకాలకు కొత్తది కావడంవల్ల ఎక్కువ టైం పడుతుందని అతని ఆలోచన.

సత్యం రిహార్సల్లో రాధికకు జాగ్ర త్తగా, శ్రద్ధగా, విసుక్కోకుండా నటన నేర్పడం మొదలెట్టాడు. ఆమెలో ధైర్యం నూరిపోస్తున్నాడు. ఆమె చేస్తున్న తప్పులు మెల్లిగా చెప్పి, ఎలా చెయ్యాలో వివరించి చెప్తున్నాడు. ఆమె బాగా చేసినప్పుడు మెచ్చుకుంటున్నాడు.

రాధికకు మెల్లిగా ధైర్యం చిక్కు తోంది. రిహార్సల్ జరుగుతున్నన్నాళ్ళు వెంకటరత్నాన్ని, రాధికను తన ఇంట్లోనే పెట్టుకుని అన్ని సదుపాయాలు ఏర్పాటు చేశాడు. నాటకంలోని మిగతా నటులు




కూడా ఆమెతో జాగ్రత్తగా, మర్యాదగా ప్రవర్తించారు. 'జలపాల రామేశం' మాత్రం ఆమెతో కాస్త వెకిలిగా ప్రవర్తించేవాడు. అతని చేష్టలు, చూపులు, మాటలు నచ్చకపోయినా ఆమె ఏం చెయ్యలేక వూరుకుంది. సత్యమంటే అతనికున్న భయం రాధికకు తెలుసు. అందుకే ఆమె ధైర్యంగా వుంది. ఓసారి రిహార్సల్ జరుగుతున్నప్పుడు అవసరం లేకుండా ఆమె చెయ్యి పట్టుకున్నాడని అతన్ని మందలించాడు సత్యం. అప్పటినుంచి అతను జాగ్రత్తగా ప్రవర్తించటం మొదలెట్టాడు.

రాధికకు రిహార్సల్ చెయ్యడం, అంత మందిలో ఫ్రీగా మసలడం, అందరితో నవ్వుతూ కబుర్లు చెప్పడం కొత్తగా, థ్రిల్లింగ్‌గా వుంది. అంతవరకు సాంప్రదాయం అనే ఖైదులో బంధింపబడిన ఆమె మనసు ఎంతో స్వేచ్ఛననుభవిస్తోంది. ఆమెకెంతో హాయిగా ఉంది. రిహార్సల్ ఎంతో శ్రద్ధగా చేస్తోంది. సత్యం పొగిడినప్పుడల్లా ఆమెకు ఆనందం కలుగుతోంది.

అంత ఆనందంలోను అప్పుడప్పుడు "నాన్న చెప్పినట్టు విని నేను తప్పు చేసానా?" అన్న అనుమానం కలుగుతోందామెకు. ముఖ్యంగా తన నిర్ణయానికి అన్నగారి ఆమోదం లభించదనిపించినప్పుడల్లా ఆమెకు మరీ బెంగగా భయంగా అనిపిస్తోంది.

తండ్రితో "నాటకం వేస్తున్నట్టు అన్నయ్యకి ఉత్తరం రాసేద్దాం" అంది రాధిక రెండు మూడు సార్లు.

"ఎందుకు? ఇంటికి వెళ్ళాక ఆడితో జరిగిందంతా సెప్తాగా" అని అతను తప్పించుకున్నాడు.

అన్నయ్యమీద ఆమెకున్న అభిమానం, అతనితో తనకున్న చనువు... ఇవన్నీ ఆమె భయపడటానికి కారణాలయ్యాయి.

ఎంత భయపడ్డా, ఎంత బాధపడ్డా... రిహార్సల్ మొదలయ్యేసరికి ఆమెలో మళ్ళీ కొత్త ఉత్సాహం, కొత్త సరదా, ఉల్లాసం.

విరుద్ధమైన రెండు అభిప్రాయాలు త్రాసులా ఆమెను రెండువైపులకి లాగుతున్నాయి.

నాటకం వెయ్యాల్సిన రోజు దగ్గరవుతున్న కొద్దీ తన మీద తనకే నమ్మకం పెరిగింది. ఆమె బాగా చేస్తుందన్న అభిప్రాయం సత్యానికి, మిగతా సభ్యులకి కలిగింది.

ఇన్నాళ్ళలోనూ రాధికను బాధపెట్టిన విషయం తండ్రి తాగుడు. రోజూ రిహార్సల్ జరుగుతున్నపుడు వెంకటరత్నం పిల్లిలా బైటికి వెళ్ళి తాగివస్తాడు.

రాధిక ఏమీ చెయ్యలేని పరిస్థితిలో పడింది. చెప్పినా అతను మానడన్న విషయం ఆమెకు తెలుసు. పైగా అందరి ముందు తిడతాడు. తండ్రి తాగకుండా చూడమని అన్నగారు మరీమరీ చెప్పారు. తను నాటకంలో వెయ్యడానికి ఒప్పుకున్నందువల్లే ఇదంతా జరుగుతోంది. అన్నయ్య తన మీద ఉంచిన నమ్మకం వమ్ము అయిపోతోందనిపించినప్పుడల్లా ఆమెకు గుండెల్లోంచి వణుకు పుట్టుకొస్తోంది.

'అరివిల్లి వెళ్ళిపోతే ఎంత బాగుండేది!' అని చాలాసార్లనుకుంది.

'ఇహముందు నాటకంలో నటించడానికి ఛస్తే ఒప్పుకోకూడదు' అనుకుని మనసుని సంతృప్తి పరుస్తోంది.

'అన్నయ్య ముఖం ఎలా చూడాలి' అని ప్రతి క్షణం ఆవేదన పడుతున్నా...

త్వరలో మొదటిసారిగా తను నటించ బోయే సమయం వస్తోందన్న థ్రిల్‌తో, ఆశతో, ఓ రకమైన అనుభూతితో ఆమె మనసు ఉల్లాసంగా హాయిగా ఉంది.

* * *

రాధిక ఎదురుచూసిన రోజు...

ఆమె భయంతో, ఆత్రుతతో, గిల్టీతో, ఆనందంతో, తృప్తితో..రకరకాల అనుభూతులతో ఎదుర్చూసిన రోజు వచ్చింది.

ఆ రోజు మధ్యాహ్నానికల్లా డ్రామా ట్రూపంతా భీమవరం చేరుకున్నారు. దారిలో కబుర్లు చెప్పేవాళ్ళు, జోకులు చెప్పేవాళ్ళు,పద్యాలు పాడేవాళ్ళు, పాటలు పాడేవాళ్ళు, డైలాగులు నెమరేసుకునే వాళ్ళు...ప్రయాణం ఎంతో హాయిగా జరిగింది.

ఓ స్కూల్లో డ్రామా ట్రూపు దిగడానికి ఏర్పాట్లు చేసారు. రాధికకు అక్కడ దిగినప్పట్నుంచి బెంగగా, భయంగా వుంది. నాటకం గురించి తలచుకున్నప్పుడల్లా ఆమెకు గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. నాటకం ఎలా చెయ్యాలా అన్న ఆత్రుత ఆమెను నిలవనియ్యటంలేదు. గదంతా పచార్లు చేయడం మొదలెట్టింది. ఆమెకే తెలియని భయ విహ్వాలత ఆమె ముఖంలో స్పష్టంగా తెలుస్తోంది. అది కనిపెట్టిన సత్యం—

''ఏమీ కంగారుపడకమ్మా! చక్కగా చేస్తావ్'' అని ధైర్యం చెప్తున్నాడు.

''ఎందుకలా నీరుకారిపోతావ్. కన్నాంబ, అంజలి లాంటోళ్ళు కూడా మొదట్లో బయపడ్డవోళ్ళే. ఇది కాస్తా బాగా ఏసావంటే నీ కోసం ఎన్ని ట్రూపులొస్తాయో'' అన్నాడు వెంకటరత్నం.

మేకప్ వేసుకోడం, చెమ్కీలున్న బట్టలు కట్టుకోడం రాధికకు థ్రిల్లింగ్‌గా వుంది. మనసులోనే మురిసిపోతోంది. అద్దంలో చూసుకుని 'నేనింత అందంగా వుంటానా' అనుకుంది. ఆ గదినిండా జనం. అందరూ ఆమెకేసే చూస్తున్నారు. ఆమె అందం అందరి కళ్ళను తనవైపు తిప్పుకుంటోంది. అంతమంది తనవైపు చూస్తున్నారనిపించి ఆమెకు సిగ్గు ముంచుకొచ్చింది.

ఒకతను అక్కడ పోగైన జనాన్ని బయటకు పంపేసి తలుపులు మూసేశాడు. జనమంతా కిటికీలు ఎక్కి చూడటం మొదలెట్టారు. ఆమెకు ఎంతో గర్వంగా అనిపించింది.

''నిజంగా ఆమె అందంగా వుంటుంది'' ఆమెకు వినిపించి కొందరు, వినిపించకుండా కొందరు అనుకున్న మాటలివి.

రాధిక భగవంతుణ్ని తల్చుకుని స్టేజి ఎక్కింది. మొదట కళ్ళముందు ఏదో శూన్యం... అయోమయం. మెల్లగా తన కళ్ళ మీద పడుతున్న స్టేజి లైట్ల కాంతిని తప్పించుకుని ఆమె చూపులు స్టేజి ముందు కూర్చున్న వేలాదిమంది జనాన్ని చూసాయి. అందులో ఎవరి ముఖమూ ఆమెకు స్పష్టంగా తెలియడం లేదు. కాని అందరి కళ్లు తనమీద ముళ్ళ వర్షం కురిపిస్తున్నాయనిపించి వణుకుపుట్టుకొచ్చింది. మెల్లగా నిభాయించుకుంది. నాల్గయిదు డైలాగులయ్యేసరికి ఆమెలో బెరుకు తగ్గింది. ధైర్యం కలిగింది. ఇహ...ఆమె ఆగలేదు.

చప్పట్లు, ఈలలు, వన్స్‌మోర్లు...

నాటకం పూర్తయేసరికి ఆమె చుట్టూ జనం, ఎన్ని వందలమంది మనుషులో... ఎన్ని అభినందనలో!

'కొత్త అమ్మాయి.'




'బాగానే చేసింది. గొప్ప అందకత్తె.'

'సినిమా హీరోయిన్లా వుంది'.

ఇలా ఎన్నో కామెంట్లు.

''బాగా చేసేవమ్మా! మా సమాజానికి వున్న పేరు ఇంకాస్త పెంచావ్''

సత్యం అభినందన.

ఆమెలో ఏదో చేసానన్న సంతృప్తి ఏదో సాధించానన్న ఫీలింగ్..తనకెంత విలువ వుందన్న భావన...

వెంకటరత్నం కళ్ళల్లో వింత వెలుగు.

'అన్నయ్య చూస్తే ఎంత సంతోషించే వాడు' అలా అనుకోడంతోనే ఆమె కాళ్ళల్లో ఏదో వణుకు. అతను ఒప్పు కుంటాడా అన్న ఆలోచన. చెల్లెలు ఇంత పేరు తెచ్చుకుందంటే సంతోషించడా?

ఆ రాత్రికే మొత్తమంతా తిరిగి అత్తిలి చేరుకున్నారు. మర్నాడుదయమే రాధిక, వెంకటరత్నం ప్రయాణంకట్టారు.

"ఆరివిల్లి వెళ్ళి నాల్గురోజులుండి ఇంటి కెళ్ళిపోదాం!"

రాధికకు తండ్రి ప్రతిపాదన బాగానే వుంది. ఆమెకు ఇంటికి వెళ్ళాలంటేనే ఏదో బెరుకుగా, భయంగా ఉంది. దాని క్కారణం నాటకం వేసిందని తెల్సి తన అన్నయ్య ఏమంటాడోనని. ఎప్పటి కేనా అతనికి తెలుస్తుందని ఆమెకుతెలుసు.

ఆరివిల్లి ప్రయాణమౌతున్న వెంకట రత్నం చేతిలో నూటపాతిక రూపాయ లుంచి "మీరు మమ్మల్ని సమయానికి ఆదుకున్నారు. కృతజ్ఞుణ్ని. పిల్ల చురు కైంది. తలివైనది. నాటకాలు మాన్పించ కండి. మంచి నటి అవుతుంది" అన్నాడు సత్యం.

"అన్నట్టు రాత్రి భీమవరంలో శృంగ వృక్షంవాళ్లు తమకో ప్రోగ్రాం ఇమ్మని అడిగారు. అది తేలితే మీకు ముందుగా ఉత్తరం రాస్తాను. మీ అమ్మాయిని తీసు కుని రండి. ఈసారి రెండురోజులు రిహా ర్సల్ సరిపోతుంది" అన్నాడు సత్యం.

మళ్ళీ నాటకం వుందంటే వెంకట రత్నంతోపాటు రాధిక కూడా సంతోష పడింది.

"ఎలాగోలా ఆ నాటకం కూడా వేద్దాం నాన్నా!" అంది రాధిక.

'ఈ ఒక్కసారి వెయ్యమని' తనడి గితే అతి కష్టంమీద ఒప్పుకున్న రాధిక ఆ మాటలనడం వెంకటరత్నాన్ని ఆశ్చర్య పరచింది. ఆమెలో అప్పటికే 'నాటకం వ్యసనం' పాతుకుపోయిందని గ్రహిం చాడు.

వెంకటరత్నం రాధికను బజారుకు తీసికెళ్ళి నలభై రూపాయలు పెట్టి చీర కొన్నాడు. తన చెల్లెలు సుభద్రమ్మకని మిఠాయి కొమ్ములు కొన్నాడు. అక్క ణ్నుంచి ఆరవిల్లి వెళ్ళడానికి బస్సె క్కారు.

తండ్రి ఆరివిల్లి వెళ్ళాక ఉత్తరం రాలే దని మోహన్ కంగారు పడ్డాడు. 'పోనీ చిట్టయినా రాయొచ్చుగా!' అని చాలా సార్లనుకొన్నాడు. ఇంతలో నాల్గురోజుల్లో వస్తున్నట్టు తండ్రినుంచి అతనికి ఉత్తరం వచ్చింది. అది ఆరివిల్లి చేరినరోజు వెంకట రత్నం రాసినది. దాంట్లో అత్తిలి ప్రయాణం ప్రసక్తే లేదు.

మేనత్త ఇంట్లో వున్న నాల్గు రోజులు రాధికకు హాయిగా గడిచింది మేనత్త ప్రేమాభిమానాలతో, కబుర్లతో రాధికకు మంచి కాలక్షేపమయింది. తను వేసిన నాటకం, చప్పట్లు. చుట్టూ మూగిన జనం, వాళ్ళ కామెంట్స్ గుర్తుకొచ్చి ఆమె మనసు థ్రిల్లింగ్గా వుంది.

'శృంగి వృక్షం ప్రోగ్రాం త్వరగా

పెడితే బాగుండును' అని ఆమె చాలా సార్లనుకుంది. అంతలోనే అన్నగారు గుర్తుకొచ్చి నీరు కారిపోతోంది. మరో నాల్గురోజులుండమని సుభద్రమ్మ ఎంత బతిమలాడినా వెంకటరత్నం వినిపించుకోలేదు. "మళ్ళీ వస్తాగా!" అన్నాడే తప్ప ఉండటానికి సుముఖత చూపలేదు. సత్యం చెప్పిన ప్రోగ్రాం అతని మనసులో మెదుల్తోంది. మరో సారి కూతురిచేత నాటకం వేయించేస్తే ఆమె మానదని



ఆతనికి మనసులో ఎక్కడో అనిపిస్తోంది. సత్యం నుంచి ఉత్తరం ఇంటి అడ్రస్‌కి వస్తుంది. తను లేకపోతే కొడుకు చూస్తాడు. వెంటనే వెళ్ళాలి. లేకపోతే ప్రోగ్రాం పోతుంది. అంటే నూటపాతిక రూపాయలు నష్టం.

రాధికకు మరికొన్నాళ్ళపాటు మేనత్త దగ్గర వుండాలని వున్నా నాటకం ప్రోగ్రాం పోతుందన్న భయం ఆమె కోర్కెను చంపేసింది.

ఇంటికెళ్ళడానికి బస్సెక్కారు.

"నాటకం వేసినట్టు పెద్దోడితో నువ్వేం సెప్పకు. నెమ్మదిమీద నేను మాట్టాడతాను" అన్నాడు వెంకటరత్నం.

రాధికకు ఆ విషయం నచ్చలేదు. త్వరగా చెప్పేస్తేనే మంచిదని ఆమె అభిప్రాయం.

"మరి చీర ఎక్కడిదని అడిగితే?"

"అత్తయ్య పెట్టిందని చెప్పు" తడుముకోకుండా సమాధానమిచ్చాడు వెంకటరత్నం.

అరివిల్లిలో ఉండగా తాగలేకపోయినందుకు, బ్రాకెట్ ఆడలేకపోయినందుకు చింతిస్తూ తన ఊరు వెళ్ళాక ఆ రెండు వ్యసనాలు ఎలా తీర్చుకోవాలీ అన్న ఆలోచనతో-బంగారు భవిష్యత్తును తల్చుకుంటూ కూర్చున్నాడు వెంకటరత్నం.

* * *

''అత్తయ్య ఎలా వుంది?''-బాగానే వుంది.

"వెళ్ళగానే ఉత్తరం రాయలేదేం?''-ఏం లేదు.

''అక్కడ బాగా గడిచిందా?''-బాగానే గడిచింది.

''అత్తయ్యను తీసుకరాకపోయారా?"-రానంది.

''నాన్న అక్కడ ఎలా వున్నాడు?'' బాగానే ఉన్నాడు.

''మళ్ళీ తాగాడా?''- లేదు అస్సలు తాగలేదు.

చివరి సమాధానం చెప్తున్నప్పుడు రాధికకు ఏడుపొచ్చింది. తండ్రి తాగకుండా చూడమని అన్నయ్య మరీమరీ చెప్పాడు. అత్తిలిలో ఉన్నన్నాళ్ళ వెంకటరత్నం తాగాడు. ఆ విషయం ఎలా చెప్పడం?

అత్తిల్లో ఎందుకున్నారని అతనడిగితే? సమాధానం.

'ఎంత ఇరకాటంలో పెట్టావు నాన్నా' అనుకుంది రాధిక మనసులో.

* * *

ఆ రోజు ఒంట్లో బాగుండక మోహన్ మధ్యాహ్నమే ఇంటికి వచ్చేసాడు. రోజూ అయితే పొద్దుటే షెడ్‌కి వెళ్ళిన వాడు రాత్రిగ్గాని ఇంటికి రాడు. అతను వచ్చిన సమయానికి తండ్రి ఇంట్లో లేడు. రాధిక పక్కింటావిడతో కబుర్లు చెప్తోంది.

పోస్టుమేన్ వచ్చి ఓ కార్డు ఇచ్చి సైకిలెక్కి వెళ్ళిపోయాడు. అది వెంకటరత్నానికి వచ్చింది.

''ఈ నెల ఇరవై ఎనిమిదిన మీకు చెప్పిన విధంగా శృంగవృక్షంలో డ్రామా ప్రోగ్రాం వుంది. మీరు రెండు రోజులు ముందుగా మీ అమ్మాయిని తీసుకుని ఆ తిలి వచ్చెయ్యండి. రెండు రోజులు రిహార్సెల్ చేసుకున్నాక అందరం కల్సి వెళదాం.

తప్పక వస్తారని ఆశిసాను- సత్యం.''

ఆ ఉత్తరం చదివిన మోహన్‌కి ఇంటి కప్పు నెత్తిమీద పడిపోతున్నట్టు, తను

నమ్ముకున్న భూమి పగిలి తనని లోపలికి లాగేసుకుంటున్నట్టు అనిపించింది.

రెండోసారి చదువుదామనుకుంటే అందులో అక్షరాలు నీళ్ళుపడి అలుక్కుపోయినట్టుగా కనిపించాయి. కళ్ళు నులుముకుని జాగ్రత్తగా చదవడానికి ప్రయత్నించాడు. ఉత్తరంలోని లైన్లు విరిగిపోయినట్టుగా అనిపించాయి.

ఏమిటిది? ఎవరీ సత్యం? డ్రామా ప్రోగ్రాం ఏమిటి? అత్తిలి వెళ్ళడం ఏమిటి? శృంగ వృక్షం ఏమిటి? ఎవర్ని తీసుకుని రమ్మంటాడు?

అసలీ ఉత్తరం ఎవరికి వచ్చింది? నాన్నకేనా! "అడ్రసు స్పష్టంగానే ఉంది" 'మీ అమ్మాయిని తీసుకు రండి' అంటాడేమిటి? అంటే రాధికనా? రాధిక నాటకం వెయ్యడమేమిటి?

అతని మనసులో ఎన్నో ప్రశ్నలు.

ఏదో జరిగింది. ఏంజరిగిందో ఇద్దరూ చెప్పడం లేదు. చెల్లెలైనా ఎందుకు చెప్ప లేదో మోహన్‌కి అర్థం కాలేదు. తనామెను అభిమానంగానే చూస్తున్నాడు కదా! చెల్లెలు ఊర్నుంచి తిరిగొచ్చినప్పట్నుంచి ఎందుకు ముభావంగా ఉంటోందో అతని కర్థమైంది.

అసలు చెల్లెలికి నాటకం వెయ్యాల్సిన ఖర్మ ఏం పట్టిందో అతనికర్థం కాలేదు. అసలీబుద్ధి ఎవరిదో అతనికి తెలియలేదు. తనకి చెప్పకుండా ఇదంతా ఎందుకు జరిపారో? చెల్లెలు నాటకాలేస్తుందంటే అతనికి నమ్మబుద్ధి కాలేదు.

ఎవర్నయితే ఎక్కువగా ప్రేమిస్తామో వాళ్ళని క్షమించడం కష్టం. చెల్లెలు తనకి తెలియకుండా ఏదైనా చేస్తుందని, తన దగ్గరే దాస్తుందని అతనెప్పుడూ అనుకోలేదు. అది నిజమైనప్పుడు మోహన్ మానసికంగా తట్టుకోలేకపోయాడు.

తన కర్తవ్యం ఏమిటో ఎంత ఆలోచించినా అతనికి బోధపడలేదు. చెల్లెల్ని పిల్చి సంగతేమిటో అడుగుదామను కున్నాడు. అడగబుద్ధి కాలేదు. విరమించు కున్నాడు.

ఆమె నమ్మకద్రోహం చేసినట్టనిపించింది. ఆమెమీద తనకే తెలియని ద్వేషం అతని మనసులో కదిలింది. మనసుని సంబాళించుకోడాని కతను ప్రయత్నిస్తున్నాడు. దీని కంతకూ తండ్రి కారణమై వుంటాడన్న విషయం అతనికి తెలుసు. ఏదైనా తిరిగి రాగానే చెల్లెలు తనకి చెప్పకపోవడం అతనికి కష్టం కలిగించింది.

మోహన్‌కి ఇంట్లో ఉండబుద్ధి కాలేదు. బట్టలేసుకుని బైటికి వెళ్ళడానికి సిద్ధమౌతున్నాడు. అంతలో వెంకటరత్నం ఇంటికి వచ్చాడు. ఆ సమయంలో కొడుకు ఇంట్లో వుండటం అతన్ని ఆశ్చర్యపరచింది. అయినా అతను కొడుకునేమీ అడగలేదు.

మోహన్ సైకిల్ అరుగుమీంచి కిందకు దింపి, స్టాండ్‌వేసి మళ్ళీ అరుగుమీద కొచ్చి "ఇదిగో ... అత్తిల్నుంచి సత్యంగారు నీకు ఉత్తరం రాశారు. ఇరవై ఎనిమిదిన ప్రోగ్రామంట" అని కార్డు పడకకుర్చీలో కూర్చున్న తండ్రి ఒళ్ళోపడేసి గబ గబ సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

అప్పుడే అరుగుమీదకొచ్చిన మోహన్ తల్లి "ఒంట్లో బాగాలేదని ఇంటికొచ్చాడు. మళ్ళీ వెళ్ళిపోయాడేమిటి ?" అని భర్త నడిగింది.

"ఏమో ఎవడికి తెలుసు?" వెంకటరత్నం చిరాకుగా అన్నాడు. భర్త చిరాకుకి కారణం తెలియని ఆమె లోపలికెళ్ళి





పోయింది. ఉత్తరం చదివిన వెంకట రత్నం ముఖం విప్పారింది. మనసులో ఆనందం, కళ్ళముందు కరెన్సీ నోట్లు కదిలాయి.

అసలు విషయం కొడుక్కి తెల్సిపోయినందుకు ముందతనికి భయంగా అనిపించినా ఆలోచించగా ఆనందంగానే ఉంది. ఎలా చెప్పాలా అని మధనపడుతున్న సమస్య తీరిపోయింది. కాని కొడుకు అంతలో ఆ విషయం వదిలెయ్యడని



వెంకటరత్నానికి తెలుసు. కార్డు తన ఒళ్ళోకి విసిరిన విధానమే అతని అయిష్టతను తెలుపుతోంది.

కొడుకుతో గొడవకి అతను సిద్ధపడటం ప్రారంభించాడు. రాధికచేత నాటకాలు వేయించడంవల్ల లాభమేకాని, నష్టమేమీ లేదని అతను కొడుక్కి నచ్చజెప్పదల్చుకున్నాడు. వయసొచ్చిన ఆడపిల్ల కాబట్టి నాటకాలు వేయించడం మంచిది కాదని కొడుకు వాదిస్తాడని వెంకటరత్నానికి అనిపించింది.

వెంకటరత్నం ఎంత ఆలోచించినా అలా భయపడాల్సిన అవసరం కన బళ్ళేదు. తను ఆమెకూడా ఎలాగూ ఉంటాడు. కూతురి మంచి చెడులు చూడాల్సిన బాధ్యత తనదేకదా! తనకే ఆ భయం లేనప్పుడు మిగతావాళ్ళకెందుకు ?

వెంకటరత్నానికి వెంటనే కూతురితో మాట్లాడాలనిపించింది.

తండ్రి పిలుపు విని రాధిక పక్కింటి లోంచి వచ్చింది. ఆమె రాగానే సత్యం రాసిన ఉత్తరం అందించాడు వెంకటరత్నం. ఆమెకు ఉత్తరం చూడగానే మళ్ళీ నాటకం వెయ్యబోతున్నందుకు ఉత్సాహంగాను, ఇంట్లో తనవల్ల సమస్య ఉత్పన్నం కాబోతున్నందుకు బెంగగాను అనిపించింది.

"మరి అన్నయ్య......"

"ముందు ఆయనగారే ఈ ఉత్తరం చూశాడు.నా మీద పడేసి వెళ్ళిపోయాడు"

తండ్రి మాటలకు ఆమె గుండె దడదడలాడింది.

ఇద్దరూ నిశ్శబ్దంగా ఉన్నారు.

రాధిక భరించలేకపోతోంది. ఆ నిశ్శబ్దం మనసుకి హాయినిచ్చేదిగా గాక, అగ్ని పర్వతం పేలేముందు నిశ్శబ్దంలా భయంకరంగా వుంది.

నాటకం వెయ్యాలన్న కోరిక ఆమెలో ప్రబలంగా ఉంది. మేకప్, చెమ్కీబట్టలు, అద్దంలో అలా చూసుకోడం, అందరితో చనువుగా మాట్లాడటం, ప్రజలకామెంట్లు, అభినందనలు, చప్పట్లు... ఆమె కళ్ళ ముందు రంగుల చక్రంలా తిరుగుతున్నాయి. ఆ ఊహ తాలూకు మత్తు, ఆ మత్తు తాలూకు ఊహ ఆమెకు హాయిగా ఉంది. మరోమూల ఇంట్లో జరగబోయే రగడ ఆమెలో భయాన్ని, నిరుత్సాహాన్ని, పిరికితనాన్ని కలిగిస్తోంది.

అన్నగారు కార్డు విసిరికొట్టడమంటే అదే అర్థం... అనుకుంది. అంతా ఆమె ఊహించినట్టే జరుగుతోంది. అతని మనస్తత్వం ఆమెకు బాగా తెలుసు. ఎట్టి పరిస్థితుల్లోను అతను ఒప్పుకోడు. తను ఏం చెయ్యాలి ? సమస్య తన చుట్టూ అల్లుకునివుంది కాబట్టి ఇద్దరూ తననే అడుగుతారు.

నాన్న వెయ్యమన్నాడు కాబట్టి వేసానని చెప్తే...?

ఇకముందు మానెయ్యమంటాడు. అంతరాంతరాల్లో ఉన్న కోరిక ఆమె మనసును పూర్తిగా ఆక్రమించుకుంది.

నాటకం వెయ్యాలి. కాని ఎలా ?

తండ్రి ఆ సమస్యను ఎలా ఎదుర్కొంటాడో ఆమెకు తెలియదు.

"అన్నయ్యకు ఇష్టం వుండదని నాకు ముందే తెలుసు. ఇప్పుడు ఏం చేద్దామంటావ్ ?" ఆమె ప్రశ్నకివ్వాల్సిన జవాబు కోసం వెంకరత్నం వెతుక్కోలేదు.

"నచ్చజెప్తాను ..ఇనకపోతే..."

"ఆ వినకపోతే...?" ఆమె ప్రశ్నలో ఆత్రత.

"ఆడిగురించి పట్టించుకోనక్కర్లేదు"




తండ్రి అలా అంటాడని ఆమె ముందే ఊహించింది. అన్నయ్యకు నచ్చజెప్పడమే ఆమెకు మంచిదిగా తోచింది. వినకపోతే పట్టించుకోనక్కర్లేదన్నది ఆమెకు నచ్చలేదు. తన అన్న మొండి మనిషని ఆమెకు తెలుసు. అందులో కుటుంబ బాధ్యతలు నిర్వర్తిస్తున్నాడు కాబట్టి తన మాట నెగ్గాలన్న పంతం వుంటుంది. సహజం. అతన్ని కాదని ఎన్నాళ్ళు నాటకం వెయ్యగలదు.

ఆమెకేమీ తోచకుండా వుంది.

జరిగిన విషయమంతా తల్లికి చెప్పింది రాధిక. చెప్పేటప్పుడు నాటకం వెయ్యడం తప్పుకాదని, దానివల్ల వచ్చిన డబ్బుని ఇంటికి ఖర్చు చెయ్యవచ్చని తనకు తెలియకుండానే నచ్చజెప్పింది.

ఆమె తల్లి తత్త్వం వేరు. ఆమెకు కుటుంబానికి ఏది మంచో, ఏది చెడో నిర్ణయించేంతటి తెలివితేటలులేవు. భార్యగా వెంకటరత్నానికి, తల్లిగా పిల్లలకి ఇంత వండిపెట్టి, వాళ్ళ అవసరాలు చూడటం వరకే ఆమె ప్రమేయం. ఇంట్లో అంతా గొడవలుపడకుండా ప్రశాంతంగాహాయిగా ఉండాలన్నది ఆమె అభిలాష.

ఎప్పుడేనా భర్త, కొడుకు గొడవపడి ఇంట్లో రగడజరిగితే ఆమెకు మనశ్శాంతి వుండదు. మధ్యలో జోక్యం కలుగజేసుకోడానికి ఆమెకేదో భయం పీకుతుంది.

* * *

ఇంట్లోంచి మోహన్ సరాసరి షెడ్‌కి వెళ్ళాడు. అతనికి నీరసంగా, నిస్త్రాణగా వుంది. మస్తిష్కం నిండా ఆలోచనలు. అంత అభిమానంగా చూసుకున్న చెల్లెలు ఎందుకలా మారిపోయిందో అతనికి అర్థం కాలేదు. ఏ కారణంవల్ల ఆమె నాటకం వేసినా ఇంటికి వచ్చాక తనతో చెప్పకపోవడం అతనికి ఎక్కువ కోపం తెప్పించింది. అతని దృష్టిలో ఆమె క్షమించరాని తప్పుచేసింది. తనకు తెలియకుండానే అతను చెల్లెలిమీద కక్ష పెంచుకుంటున్నాడు.

షెడ్‌లో పనిచేసే ఓపిక, మూడ్ రెండూ లేవు. ఓ మూల కుర్చీలో కూర్చున్నాడు. మరో మెకానిక్ "గురూ! ఒంట్లో బాగాలేదన్నావ్. ఇంటికెళ్ళి పడుకోకపోయావా?" అన్నాడు.

"ఆ నరకం కన్నా ఇక్కడే బాగుంది"

మోహన్ మాటలు అతని కర్థం కాలేదు. మోహన్ ఓడిపోయినట్టు ఫీలవుతున్నాడు.

మోసగింపబడి సహించడం చాలా కష్టం... అందులోను ఆత్మీయులనుకున్న వాళ్ళ చేతిలో అయితే మరీ కష్టం.

సినిమాకి వెడితే కాస్త తెరిపిగా వుంటుందనిపించి వెళ్ళాడు. సినిమా చూస్తున్నాడన్నమాటేకాని మనసు దాని మీద లేదు. దానిలో పాత్రలేమిటో, వాటి స్వభావాలేమిటో అతనికి తెలియలేదు. హీరోకి చెల్లెలు ఎవరో, ప్రేయసి ఎవరో అతని కర్థంకాలేదు.

తండ్రి, చెల్లెలు... ఆమె నాటకం వెయ్యడం, తనకి చెప్పకపోవడం, కాష్ రావడం... అతని మనసులో వేరే రీళ్ళు తిరుగుతున్నాయి.

ఎంతో ఆలోచించగా అతనికి ఏదో ఉపాయం తట్టింది. దాన్ని గురించి, ఎదురయ్యే సమస్యల గురించి తనలో తనే చర్చించుకున్నాడు. ఓ నిర్ణయానికొచ్చాక అతని మనసు ప్రశాంతంగా వుంది. అప్పుడిహ సినిమా హాల్లో కూర్చోవడం అతనికి కష్టమైంది.

వెంటనే రిక్షాలో ఇంటికెళ్ళాడు.

రిక్షాలోంచి దిగుతున్న మోహన్ని చూసి రాధిక వంటింట్లోకి వెళ్ళిపోయింది. ఇంట్లోకెళ్లి బట్టలు మార్చుకున్నాడు.

"ఒంట్లో బాగోలేదని మళ్ళీ వెళ్ళిపోయావు. పని ఎక్కువగా ఉందా?" తల్లి ప్రశ్నకు అతనేం సమాధానం చెప్పలేదు. తల్లి ఇచ్చిన కాఫీ తాగాడు. ఆ సమయానికి తండ్రి ఇంట్లో లేకపోవడం అతనికి ఆనందాన్నిచ్చింది.

చెల్లెల్ని పిలిచాడు. ఆమె భయం



భయంగా వచ్చి అతనికి దూరంగా నిల బడింది. ఆమె గిల్టీగా వుంది. అది మోహన్ గ్రహించాడు. మనసులో ఆమె మీద ఎంత కోపం వున్నా ఆమెనలా చూస్తే అతనికి బాధకలిగింది. తనకున్న ఒక్కగా నొక్క చెల్లెలు తనకి భయపడటం అతనికిష్టంలేదు. అందుకే ఆమెతో చను వుగా, అభిమానంగా మాట్లాడతాడు.

"ఆ కుర్చీ తెచ్చుకుని కూర్చో" అతని కంఠంలో తెచ్చిపెట్టుకున్నదయినా ఆప్యాయత వుంది. రాధిక ముఖంలో ఏ రకమైన భావాల్లేవు.

సంభాషణ ఎలా మొదలెట్టాలో అతనికి అర్థంకాకుండా వుంది.

"నువ్ మొన్న చూపించిన చీర అత్తయ్య పెట్టిందా ?"

ఆమె తల వంచుకుంది.

"నువ్వు, నాన్న ముందు ఇక్క ణ్నించి అత్తిలి వెళ్ళారా?"

అవునన్నట్టు ఆమె తల ఊపింది.

"ఎవరా సత్యం ?"

"నాన్నకు తెలున్నాయన. ఆయనకో నాటక సమాజం వుంది."

"అత్తిలిలో ఎన్నాళ్ళున్నారు ?"

''పధ్నాలుగో తేదీ దాకా. ఆ వేళ భీమవరంలో నాటకం జరిగింది. మర్నాడు ఆరివిల్లి వెళ్ళాం.''

"రాగానే జరిగిన విషయమంతా నాకు ఎందుకు చెప్పలేదు ?"

"నాన్న తనే చెప్తానన్నాడు."

"అయినా నువ్వు చెప్పొచ్చుకదా !"

"చెప్తే-చెప్పినందుకు నాన్న, నాటకం వేసినందుకు నువ్వూ తిడతారని."

"నిన్ను ముందెప్పుడైనా తిట్టానా ?"

లేదన్నట్టు ఆమె తల ఊపింది.

మోహన్ చెల్లెలికి అనునయంగా చెప్పా లని, అలా చెప్తే ఆమె వింటుందని ఆను కున్నాడు.

"నాటకం వేసినందుకు నీకు ఎంతి చ్చారు ?"

''నూటపాతిక రూపాయలు.''

"చీర కొనగా మిగిలిన డబ్బు ఏమైంది ?"

''నాన్నదగ్గరే వుంది.''

''నాన్న దాంతో రోజూ బ్రాకెట్ ఆడేస్తున్నాడు, రెండుసార్లు తాగి కూడా వచ్చాడు తెల్సా !''

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"ఇంటిని నేను నడుపుతున్నాను కదా! నాటకాలు వెయ్యాల్సిన అవసరం నీకేం వచ్చింది.?''

"నువ్వు కష్టపడుతున్నావ్. నీకు సాయపడొచ్చని."

"అలాగని నీకు నాన్న చెప్పాడు అవునా? అది నిజం కాదు. నువ్వు సంపా యించే డబ్బుతో తన వ్యసనాలు గడు పుకోవచ్చని ఆయన ఉద్దేశం. ఆయ నింక బాగుపడనంతగా చెడిపోయాడు. ఆయన వ్యసనాలకు నేను డబ్బివ్వను. అందుకని నిన్ను నాటకాల్లోకి దింపాడు. నాకు సాయపడాలన్న నీ ఉద్దేశం మంచిదే కాని, నాటకాలు వెయ్యొద్దు. అది మనకి చెడ్డపేరు తెస్తుంది.''

"నాకు తప్పుగా అనిపించడం లేదు."

ఆమె మాటలకి మోహన్ కర్రతో కొట్టినట్టు నిటారుగా నిలబడ్డాడు. సమస్య అతననుకున్నంత చిన్నది కాదు. తండ్రి బాధపళ్ళేక ఆమె నాటకం వేసి ఉంటుం దన్న ఉద్దేశంతో ఉన్నాడు తను. లేదు తండ్రి ఆమెను గొప్పగా ఇన్‌ఫ్లుయన్స్ చేశాడు. తండ్రి మీద కోపం వచ్చినా

అతనాడిన రాజకీయానికి ఆశ్చర్యం వేసింది.

"ఎందుకు తప్పులేదు. నాటకాలాడే అమ్మాయిని లోకంలో అంతా చులకనగా చూస్తారు. అంతేకాదు రేపు నీకు పెళ్ళి కాదు. పెళ్ళి కెదిగిన ఆడపిల్ల ఇంట్లో ఉంటేనే అందం. చదువు మానేసావు కాబట్టి నీకు తోచకపోతే కుట్టుపనిచేస్కో. నీకో మిషన్ కొనిస్తాను. నువ్వు నాటకం వెయ్యడం నాకిష్టం లేదు. నువ్వు నాటకం వెయ్యడానికి వీల్లేదు. నలుగురిలో నేను తలెత్తుకు తిరగలేను."

"రిహార్సల్‌కి వెళ్ళినప్పుడల్లా నాన్న నా కూడా వుంటున్నాడు."

మోహన్ వచ్చే కోపాన్ని నిగ్రహించు కుంటున్నాడు. ఆమెకు నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని ఆమె వింటుం దన్న ఆశ సన్నగిల్లిపోయింది.

అయిపోయింది. అంతాఅయిపోయింది. ఇంటి బాధ్యత స్వీకరించినప్పట్నుంచి తను పడ్డ కష్టం, అందరిమీద తను చూపిం చిన శ్రద్ధ, పెంచుకున్న మమకారం, పెట్టుకున్న ఆశ... మెల్లగా బీటలు తీస్తు న్నాయనిపించి మోహన్‌కి గుండెలది రాయి. అతనికిప్పుడు ఎదురైన సమస్య గొడ్డలి పెట్టులాంటిదనిపించింది.

ఆమె ఎలా చెప్తే వింటుందో అతని కర్థం కాలేదు. ఆమెను వెంటనే ఒప్పించి నాటకాలు మానిపించవచ్చన్న అతని ఊహ తలకిందులైంది.

"నాటకాలు వేసి నువ్వు, వేయించి ఆయనా నన్ను ఏం ఉద్ధరిద్దామనుకుంటు న్నారో నా కర్థం కావడం లేదు."

మోహన్ కంఠంలో కోపం వినబడింది.

"మొదటి నాటకం డబ్బుతోనే నాన్న నాకు చీర కొన్నాడు". రాధిక మాటల కతను అవమానపడ్డాడు. ఇన్నాళ్ళు తను చేసిందానికన్నా నాటకం డబ్బుతో తండ్రి కొన్న ఒక్క చీర ఎక్కువయిందా అనిపించింది.

"చీరలు నేనూ కొంటాను. కాని నువ్వు నాటకం వెయ్యడానికి వీల్లేదు"

మోహన్ నిక్కచ్చిగా, నిష్కర్షగా చెప్పాడు.

రాధిక లేచి విసురుగా లోపలికెళ్ళి పోయింది. ఆమె ఎదిరించి సమాధానం చెప్పినా అతను బాధపడకపోయేవాడు. ఆమె నీరసనగా విసురుగా వెళ్ళిపోదంతో అతను అవమానపడ్డాడు.

ఆడపిల్ల కాబట్టి తమాయించుకున్నాడు లేకపోతే వెనక్కి పిల్చి ఛెళ్ళున లెంపకాయ కొట్టేవాడు.

కోపంతో అతను ఊగిపోతున్నాడు.

* * *

ఎవర్నయితే సులభంగా మన ఆలో చనల వైపు తిప్పుకోగలమనుకుంటామో వాళ్ళే ఎదురు తిరిగితే భరించటం కష్టం.

మోహన్ పరిస్థితి అదే అయింది.

ఆ రాత్రి ఇంట్లో అంతా ముభావంగా ఉన్నారు. రాధిక అన్నను తప్పించుకు తిరిగింది. అతను వంటింట్లో భోంచేస్తుంటే ఆమె అరుగుమీద కూర్చుంది. అతను అరుగు మీదకి వచ్చేసరికి ఆమె వంటింట్లో కెళ్ళింది.

దాగుడు మూతలు.........

తండ్రి భోంచేసి అరుగుమీదకి వచ్చాక మోహన్ విషయం కదిపాడు.

"అవున్రా! పది రూపాయలొస్తాయి. తప్పేముంది. నీకు ఇంట్లో సాయంగా కూడా వుంటుంది. అదేమీ తప్పుపనికాదు. దానదురుష్టం బాగుండి ఏ సినిమా వేష మైనా వచ్చిందంటే బంగారంపండుతుంది"





అన్నాడు వెంకటరత్నం.

తండ్రి మూర్ఖత్వానికి అతనికి నవ్వొచ్చింది. తండ్రి నిజంగా ఆశపడుతున్నాడో, తనకు ఆశచూపించి మభ్యపెడుతున్నాడో అతనికర్థం కాలేదు. తండ్రితో ఎక్కువసేపు వాదించడం అతని కిష్టం లేదు. చెల్లెలిచేత నాటకాలు వేయించడం తనకిష్టం లేదని, వీల్లేదని మాటలు నాన్చకుండా చెప్పాడు.

"నీకు పెతీదీ తప్పుగానే కనబడుతుంది. దాని మంచి చెడ్డలు నీకెంత అవసరమో నాకు అంతే! ఈ రోజున నువ్వు నాకు చెప్పేటంతటి వాడివయ్యావ్."

"దాని మంచి చెడ్డలు తెల్సున్నవాడివైతే ఇలా చెయ్యవ్. అంత రహస్యంగా దాన్ని అత్తిలి తీసికెళ్ళి నాటకం వేయించాల్సిన పనేం వచ్చింది. చివరికి దాన్ని ఎవడూ పెళ్ళి చేసుకోకుండా చేసావ్. మీరెవరూ నాకు సాయం చెయ్యక్కర్లేదు. ఇన్నాళ్ళు కష్టపడలేదా కాని-ఇంట్లో పడుండండి చాలు. అదే పది వేలు.''

మోహన్ చెప్పినదానికి వెంకటరత్నం మౌనంగా ఊరుకున్నాడు.

మోహన్‌కి చిరాకెత్తింది.

అక్కణ్నుంచి లేచి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత ఏరోజూ అతను తండ్రితో కాని, చెల్లెలితోకాని మాట్లాడలేదు. అసలు అతనికి ఆ ఉత్సాహంలేదు. చెల్లెలు ఊళ్ళో లేనన్నాళ్ళు ఆమె రాకకు ఎదుర్చూసిన అతను ప్రస్తుతం ఆమె ఉనికినే మర్చిపోయాడు.

మోహన్‌కి 'నేను' మొండిగా, మూర్ఖంగా ప్రవర్తిస్తున్నానా అన్న అనుమానం కలిగింది. ఎంత ఆలోచించినా అతనికి తన తప్పేం కనబడలేదు. చెల్లెలి శ్రేయస్సు, కుటుంబ గౌరవం కోరి చెప్తున్నాడు.

రాధిక అలా ఆలోచించలేదు. నాటకాలు వెయ్యాలని ఆమెకు పూర్తిగా ఉంది. అన్నయ్యతో గొడవని తండ్రి పరిష్కరించుకుంటాడని ఒకపక్క, అన్నయ్య ఎప్పటికేనా ఒప్పుకుంటాడని ఒకపక్క వుంది.

మోహన్ మాట్లాడకపోడం, అతన్ని తప్పించుకు తిరగడం ఆమెకు బాధగా వున్నా-ఆమెతన మనసులోశృంగవృక్షం ప్రోగాం గురించి ఎక్కువ ఆలోచించి తృప్తిపడుతోంది.

ఆ రోజు రానే వచ్చింది.

వెంకటరత్నానికి ఆరోజు ఆనందంగా, హాయిగా ఉంది.

మోహన్‌కి చిరాకుగా, ఆందోళనగా వుంది.

రాధిక థ్రిల్లింగ్‌గా, ఉత్సాహంగా ఫీలవుతోంది.

అది-వెంకటరత్నం, రాధిక అత్తిలి వెళ్ళాల్సినరోజు.

మోహన్ పొద్దుటే షెడ్‌కి వెళ్ళిపోయాడు. వెంకటరత్నంపక్కవీధిలోఉన్న పోస్టుమన్ పుణ్యమూర్తి ఇంటికి అప్పుకోసం వెళ్ళాడు. రాధిక బట్టలు సర్దుకునే ప్రయత్నంలో వుంది.

మోహన్ ఇంటికి తిరిగి వచ్చాడు. అతని చేతిలో ఓ తెల్లపేకెట్ వుంది. హాల్లోకి వచ్చిన అతన్ని చూసి రాధిక తెల్లబోయింది.

ఆమె తలంటు పోసుకుంది. జుట్టు ముఖంమీద పడి అందంగా అమరింది. తయ్య కొందని చెప్పిన చీరకట్టుకుంది ఆమె మొహంలో వింత కళ మెరుస్తోంది. కళ్ళకి పెట్టిన సన్నటి కాటుక ఆకాశంలో మెరుపులా ఉంది. ఎర్రటి తిలకం బొట్టు ఉదయిస్తున్న సూర్యుడిలా వుంది.

మోహన్‌ని చూసేసరికి ఆమె కళ్ళలో కాంతి మాయమైంది.

ఆమెను చూసిన మోహన్ 'మల్లె పువ్వులాంటి నా చెల్లెల్ని పశువుల మధ్య పడేస్తున్నావ్ నాన్నా!' అనుకున్నాడు మనసులో.

రాధిక అతని వంక ఓసారి చూసి లోపలికి వెళ్ళిపోయింది. చెల్లెలు తనను చూసి అసహ్యించుకుంటోందో, భయపడుతోందో మోహన్‌కి అర్థంకాలేదు.

"చిట్టీ ఇలారా!" అతని పిలుపుకి ఆమె ఆగిపోయింది.

"ఇలా కూర్చో" మోహన్ మంచం మీద కూర్చుని ఆమెనూ కూర్చోమన్నాడు. ఆమె ఓ మూల ఒదిగి కూర్చుంది.

"మీరు అత్తిలి వెళ్ళాల్సింది ఇవాళే కదూ!"

ఔనన్నట్టు ఆమె తల ఊపింది.

"వెడుతున్నారా?"

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"చెప్పు" అతని మాటల్లో ఆర్ద్రత.

"నాన్న వెడదాం అన్నాడు" అతనికి తెలుసు తన ఆశ ఫలించదని. అదే జరిగింది.

"ఇవిగో ఈ చీరలు నీ కోసం కొన్నాను. నీ కింకా ఏం కావాలన్నా అడుగు. కొంటాను. కాని నాటకాలు వద్దు. త్వరలోనే నీకు పెళ్ళిచేసి పంపిస్తాను. చెడ్డ పేరు తెచ్చుకుని జీవితం నాశనం చేసుకోకు"

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"నేను సాయంత్రం ఇంటికివచ్చేసరికి ఇందులో ఎర్ర పూలున్న చీర కట్టుకుని రెడీగా వుండు. మనం సినిమాకి వెడదాం. ఇన్నాళ్లు నీ మీద అభిమానం పెంచుకున్నాను. నా చిట్టి నన్ను బాధ పెట్టదు."

చివరి మాటలంటూ అతను మంచం మీంచి లేచాడు. అతని కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. రాధిక పాకెట్ ఒళ్ళో పెట్టుకుని నేలకేసి చూస్తోంది.

అతనికింకా ఏదో మాట్లాడాలనిపిస్తోంది. మాటలు గొంతు పెగిలి బైటికి రావడం లేదు. ఏదో బెంగ, భయం...

'నాలో ఎంత పిరికితనం' అనుకున్నప్పుడు అతని మీద అతనికే జాలివేసింది. అతను అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

రాధిక కొయ్యబొమ్మలా అలా కూర్చునే ఉంది. మధ్యలో తల ఎత్తి అతనికేసి చూస్తోంది. అతను ఆమెవైపు చూసినప్పుడు తల దించుకుంటోంది.

ఒకేఒక్కసారి వాళ్ళిద్దరి చూపులు కల్సుకున్నాయి.

ఒక్క క్షణం పాటు... రెండు నక్షత్రాలు కల్సుకుని విరిగి అమావాస్య చీకట్లో కల్సిపోయినట్టు...

ఒకరి ముఖంలో ఒకరికి భయం తాలూకు నీడలు కనిపిస్తున్నాయి. "నీ అన్నయ్య బతికే వున్నాడనుకొంటే నువ్వు అత్తిలి వెళ్ళొద్దు"

మోహన్ చరచర ఇంట్లోంచి బైటికి వెళ్ళిపోయాడు.

రాధిక ఏదో చెబ్దామనుకుంది. కాని చెప్పలేదు. అసహనంగా మొహం మాడ్చుకుంది. ముఖం నిండా చెమటలు. మనసు నిండా వుక్కబోత. భరించరాని ఉక్కబోత. మోహన్ చివర్న అన్నమాటలకు ఆమె గుండె లోతుల్లో కలుక్కుమంది.

ఆమెకు తండ్రిమీద, అన్నమీద, నాటకాల మీద, చీరల మీద, ఉక్కబోత మీద... చివరికి తనమీద తనకే అసహ్యం వేసింది.

'ఇదంతా నా ఖర్మ' మనసులో అను





కుని పైకి అనేసింది. నుదుటిమీద అర

తండ్రి వచ్చి "బట్టలన్నీ సర్దేవా?" అన్నాడు.

"అన్నయ్యావెళ్ళొద్దన్నాడు. అన్నయ్య!

బాధపడుతున్నాడు నాన్నా" అంది.

దీనతం ఉన్నాయి. ఏదీ నిర్ణయించుకో

"సత్యంగారికి మనం వస్తున్నట్టు కబు



రంపాను; నువ్వు మళ్ళీ మొదటికొచ్చావేటి?" విసుగ్గా అన్నాడు వెంకటరత్నం. ఆమె ఏమీ మాట్లాడలేదు.

"ఆడికి తెలవదు. సెప్తే అర్థంకాదు. నువ్వు పిచ్చి ఆలోచనలు మానేసి బయల్దేరు" అన్నాడు.

ఆమెకా విషయం తండ్రి నిర్ణయించడం బాగుంది. తండ్రి మాటమీద వెడుతున్నాననుకుంటే ఆమెకు హాయిగా, తృప్తిగా వుంది.




వరహాలరావు తలిదండ్రులు అతనికా పేరు ఏ వేళా విశేషంలో పెట్టారోగాని ఆంధ్ర దేశంలో ముఖ్యంగా పల్లెటూళ్ళ వైపు ఆ పేరు మార్మోగుతోంది. అతను నాటకరంగంలో అందరికీ తెల్సున్నవాడు. అతను నాటకం వేస్తే రూపాయలు గలగల రాలాయి.

అతను భయంకరంగా ఉంటాడు. ఆరడుగుల ఎత్తు, విశాలమైన ఫాలభాగం, నిగనిగలాడే నల్లని శరీరం, కండలు తిరిగిన చేతులు, ఎత్తుగా వుండే బుగ్గలు...

రామాయణంలో రావణాసురుడిలా ఉంటాడు. ఆ విషయం అతనికి తెలుసు. అందుకే అతను పౌరాణిక నాటకాల్లో రావణుడులాంటి పాత్రలువేసి డబ్బు, పేరు సంపాయించాడు. రావణుడొక్కడే కాదు, మైరావణుడు దుర్యోధనుడు, కంసుడు లాంటి దుష్టపాత్రలు పోషించడంలో అతను ఘనత సంపాయించాడు.

అతను మొదట్లో కిళ్ళీకొట్టు నడిపేవాడు. అతని కొట్టు సందులో నాటకం రిహార్సల్ జరుగుతుండేది. అందులో వేషాలు వేసేవాళ్ళంతా అతని కొట్టుకి సోడాల కోసం, కిళ్ళీల కోసం, సిగరెట్ల కోసం వచ్చేవారు. కొందరికి అతని దగ్గర కాతాలుండేవి. ఆ డబ్బులు వసూలు చేసుకునేందుకు అతను రిహార్సల్ జరుగుతున్న ప్రదేశానికి వెడుతుండేవాడు. రిహార్సల్ చూస్తుండేవాడు.

కాని అతను నటుడౌదామని ఎప్పుడూ ఆశపళ్ళేదు.

కొంతమంది కొన్ని ఆశలు పెంచుకోరు. దానిక్కారణాలు అనేకంవుంటాయి. వరహాలరావు విషయంలో ఇన్ఫీరియారిటీ దానిక్కారణం. పెద్ద పెద్ద సమాసాలు, పొడుగు పద్యాలు, దీర్ఘ రాగాలు - ఇవన్నీ అతనికిష్టం. అవి వింటుంటే అతను మిగతా ప్రపంచాన్ని మర్చిపోయేవాడు. ఇవన్నీ తనవల్ల కావని అతనికో గొప్ప నమ్మకం.

అంచేత వరహాలరావు మనసులో అప్పుడప్పుడు నాటకం వెయ్యాలన్న కోరిక పుట్టినా, దాన్ని నీళ్ళుపోసి పెంచకుండా చంపేసేవాడు. ఒక్కోసారి మరీ కోరిక ఎక్కువైతే ఇంట్లో ఒక్కడూ కూర్చుని అద్దం ముందు నిలబడి రిహార్సల్లో తను చూసిన వాళ్ళని అనుకరిస్తూ అభినయించేవాడు. కూనిరాగాలు తీసి సంతోషపడేవాడు.

రానురాను అతనికి నాటకంలో పాల్గొనే వాళ్ళమీద గౌరవం, అభిమానం పెరిగాయి. రోజూ కొట్టు మూసెయ్యగానే వెళ్ళి రిహార్సల్ దగ్గర కూర్చునేవాడు.

వాళ్ళకి కాస్తోకూస్తో సాయంచేసిసంతృప్తి పడేవాడు.

ఓసారి ఆ సమాజంవాళ్ళు మరో వూళ్ళో నాటకం వేస్తుంటే వరహాలరావు కొట్టు కట్టేసి కూడా వెళ్ళాడు. కర్టెన్లు కట్టడం, సెట్లు వేయడం, సీన్లు మార్చడం లాంటి పనులు చేసి పెట్టాడు. ఆ రోజునుంచి ఆ ట్రూప్ మేనేజరు రామ్మూర్తిగారికి అతనిమీద అభిమానం పెరిగింది.

"నువ్వు నాటకంలో వెయ్యకూడదూ!" అన్నాడాయన యధాలాపంగా

"నా కా పద్యాలూ అవీ రావండి" అన్నాడేగాని అతనికి తెలీకుండా అతనిలో పెరిగి పెద్దదవుతున్న కోరిక విసురించింది. అతనిలోని నటుడు ఉత్సాహ పడ్డాడు.

"పద్యాలు రావడం బ్రహ్మవిద్యేంకాదు. నీకు శ్రద్ధ ఉండాలేకాని అది కష్టంకాదు. నేను నేర్పుతాను" అన్నాడాయన.

అతనిలోని నటుడుమరికాస్త సంతృప్తి పడ్డాడు.

"నేను పనికొస్తానంటారా?" అని అడిగినప్పుడు వరహాలరావు ముఖంలో భయం, ఆత్రుత కనిపించాయి.

"తప్పకుండా! నీకు చక్కని విగ్రహం ఉంది. కాకపోతే రాముడులాంటి సాత్విక పాత్రలకు నప్పదు. దుష్ట పాత్రలకి నీ విగ్రహం, కంఠం చక్కగా అమరుతాయి" అన్నారు రామ్మూర్తిగారు.

వరహాలరావు ఆనందంతో ఉక్కిరి బిక్కిరయిపోయాడు. అలా మొదలైంది అతని నట జీవితం.

అతను ఒక్కో మెట్టు ఎక్కుతూ రావణబ్రహ్మ వేషంతో మంచి పేరు తెచ్చుకున్నాడు.

ఇక తర్వాత అతను వెనక్కి తిరిగి చూడలేదు. వెనక్కి తిరిగి కిళ్ళీ కొట్టుకి వెళ్ళలేదు.

రామ్మూర్తిగారిమీద తనకి ఎంత భక్తి, గౌరవం ఉన్నా అవి తను జీవితంలో ముందుకి పోడానికి అడ్డం రాకూడదను కున్నాడు. ఒకళ్ళ చేతికింద బతకడం కార్యవాదుల లక్షణం కాదనుకున్నాడు. మర్రిచెట్టు కింద మొక్కలు మొలవ్వనీ, మొలిచినా బతకవనీ అతనికి నమ్మకం ఏర్పడింది.

వరహాలరావు త్వరలోనే వేరే నాటక సమాజం స్థాపించాడు. రామ్మూర్తిగారి సమాజంలోంచి వెళ్ళిపోతూ మరి కొంత మందిని కూడా తీసికెళ్ళిపోయాడు.

అతనికి సమాజం నడపడం, చక్కగా నటించడం, కొత్తవాళ్ళకి నటనలో శిక్షణ ఇవ్వడమే కాకుండా ప్రాపంచికమైన చాలా విషయాలు తెలుసు. రామ్మూర్తిగారు ఎక్కడ ఫెయిల్ అయ్యారో తనక్కడ కాకూడదని నిర్ణయించుకున్నాడు.

మంచి సమాజం నడుపుతూ, మంచి నాటకం తయారు చెయ్యడమే కాకుండా వీలైనన్ని ఎక్కువ ప్రోగ్రాములు సంపా యించుకోవాలి. ఎన్ని ఎక్కువ ప్రదర్శన లిస్తే అంతెక్కువ పేరు, డబ్బు వస్తాయి. తన దగ్గర శిక్షణపొందిన నటులు అటూ ఇటూ చెదిరిపోకుండా చూసుకోవాలి.

ఇలా అన్ని విషయాల్లోను శ్రద్ధ తీసు కుని వరహాలరావు తిరుగులేని నటుడిగా, సమాజ నిర్వాహకుడిగా స్థిరపడాలను కున్నాడు.

ఆంధ్రదేశంలో ప్రతి గ్రామంలో గుళ్ళు వుంటాయి. ప్రతిగుడికి పూర్వీకులురాసిన ఆస్తులుంటాయి. వాటి నిర్వహణకు ఓ ట్రస్టీ బోర్డు, ఓ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఉంటారు. గుడిలో పంచేసియున్న



స్వామినిబట్టి సంవత్సరంలో ఏదో ఒక రోజున కళ్యాణమో, బ్రహ్మోత్సవమో జరుపుతారు.

వరహాలరావు కొన్నిచోట్ల ట్రస్టీలను పట్టుకుని, కొన్నిచోట్ల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను పట్టుకుని, అవసరమైన చోట ఇంకాస్త పెద్ద అధికార్లనుపట్టుకుని గుళ్లల్లో జరిగే ఉత్సవాలకు తన నాటక ప్రోగ్రాం

ఏర్పాటు చేసుకోడం మొదలెట్టాడు.

కొన్నాళ్ళయ్యాక హైదరాబాద్‌నుంచి ఓ తాఖీదు వచ్చింది. అన్ని గుళ్ళల్లోను ఉత్సవాలప్పుడు ఓ రోజు వరహాలరావు నాటకంకూడా పెట్టాలని దాని సారాంశం. అలాంటి తాఖీదు పుట్టించడానికి ఏం చేసాడో, ఎంత ఖర్చుపెట్టాడో ఎవరికీ తెలియదు. అవసరానికి అతను ఎంత డబ్బైనా ఖర్చు చెయ్యగలడు.

హైదరాబాద్‌లో పుట్టిన ఆ కాయితం గ్రామాలకు చేరాక అతని ప్రోగ్రాం దొరకడమే కష్టమైపోయింది. మొదట్లో బతిమాలి ఐదువందలకి నాటకంవేసిన అతను మూడు వేలు ఇస్తేకాని కాలు కదపని స్థితికి ఎదిగిపోయాడు.

టైం కల్సివస్తుందని ఓవేన్ కొన్నాడు. దాని ముందుభాగం పైన అతని నాటక సమాజం పేరు వుంటుంది. కింద ఫోన్ నంబరుంటుంది. వేన్‌కి రెండువైపుల వరహాలరావు రావణ, మైరావణ, దుర్యోధన, కంస పాత్రల్లోని బొమ్మలు పెయింట్ చేసి ఉంటాయి. అతని సమాజంవేసే నాటకాల పేర్లు రెండువైపుల పెద్ద పెద్ద అక్షరాల్లో రాసి వుంటాయి.

ప్రతి సంవత్సరం అతను ఓ కొత్త స్క్రిప్టు రాయించి ప్రాక్టీసుచేస్తాడు. దాని వల్ల ఒక ఊళ్లో ఓసారి వేసిన నాటకం మరుసటి సంవత్సరం వెయ్యాల్సిన అవసరం ఉండదు.

వరహాలరావు ఎప్పుడూ నుదుట విభూతి రేఖలతో, పెద్దకుంకుమబొట్టుతో, చేతికి బంగారపు కడియాలతో, ఎడంచేతి నాలుగు వేళ్ళకు, కుడిచేతి మూడు వేళ్ళకు పెద్ద ఉంగరాలతో, మెడలో పులిగోరు పతకం వున్న గొలుసుతో, తెల్లటిగ్లాస్కో పంచె, లాల్చీలతో, గిరజాల జుట్టుతో హుందాగా దర్జాగా వుంటాడు.

అతనికి ఊరూరా అభిమానులున్నారు. అతనంటే కిట్టనివాళ్ళు ఉన్నారు. నాటక కళని మరీ వ్యాపార పద్ధతిలోకి యీడ్చేసాడన్న విమర్శ కూడా వుంది.

"కార్యవాదులు ఇలాంటివిలెఖ్ఖచెయ్యరు" అన్నది అతని అభిప్రాయం. అతని నడకలో, మాటలో దర్పం, కొంచెం అహంకారం ఉట్టిపడుతూ వుంటాయి.

ఆ రాత్రి శృంగవృక్షంలో వరహాలరావుకి పెద్ద ఎత్తున సన్మానం జరిగింది. ఊరిపెద్ద ఒకాయన అధ్యక్షతవహించారు. వరహాలరావుని పూలమాలలలో, పొగడ్తలలో ముంచెత్తారు.

తర్వాత అత్తిలి సత్యంగారి సమాజంచే సీతా కళ్యాణం నాటిక ప్రదర్శన.

మొదట వరహాలరావుకి సన్మానం చేసి అతనిదే నాటకం పెట్టాలని కార్యకర్తలు అనుకున్నారు. అందుకు అతను ఇష్టపడలేదు.

"వేరే ఏదైనా నాటకం పెట్టుకోండి. నేను తర్వాతెప్పుడైనా నా ప్రదర్శన ఇస్తాను. నా సన్మానం రోజునే నాటకం వేస్తే అంత బాగుండదు" అన్నాడు.

"బాగా సెయ్యి. వరహాలరావు నీ నాటకం చూడబోతున్నాడు" మేకప్‌రూంలోకి వెళ్ళి రాధికతో చెప్పాడు వెంకటరత్నం.

"ఎవరతను?" రాధిక తెల్లమొహం వేసింది.

"ఈ ప్రాంతంలో మంచి పేరుంది. అతనికో డ్రామాట్రూపుంది. ప్రోగ్రాంకి మూడు వేలు తీసుకుంటాడు."

రాధిక విని ఊరుకుంది.

నాటక ప్రదర్శన మొదలైంది.

నాటకం బాగా రక్తికడుతోంది.









జనంలో ఉత్సాహం పెరిగింది. రాధిక నటన ఆంపర్నీ ఆకట్టుకుంది. ఓ అర గంట నాటకంచూసి వెళ్ళిపోదామనుకున్న వరహాలరావు పూర్తయ్యేదాకా వుండి పోయాడు. అంతే కాకుండా నాటకం పూర్తయ్యాక స్టేజిమీదకెళ్ళి "ఈ నాటకంలో సీత గా నటించినామె గొప్ప నటి. నా నట జీవితంలో ఇలాంటి నటిని చూళ్ళేదు. ఈమెకు గొప్ప భవిష్యత్తుంది. ఆమెకు బహుమతిగా వంద రూపాయలు చదివిస్తున్నాను'' అన్నాడు.

జనం చప్పట్లు కొట్టారు.

వెంకటరత్నానికి ఆనందంతో, కంగారులో కాళ్ళు, చేతులు ఆడలేదు.

"ఆ డబ్బు తెచ్చుకో.''అని కూతుర్ని తొందర పెట్టాడు. అనుకోని ఈ సంఘటనకి తట్టుకోలేకపోయింది రాధిక. వేళ్ళల్లోంచి వణుకు పుట్టుకొచ్చింది. తడబడుతూ స్టేజిమీదకెళ్ళి వరహాలరావు చేతి నుంచి డబ్బు తీసుకుంది.

తర్వాత వెంకటరత్నం వెళ్ళి వరహాలరావుని కల్సుకుని తనని తానే పరిచయం చేసుకున్నాడు.

"మీ అమ్మాయి మహానటి అవుతుంది. అదృష్టవంతులు మీరు. ఓ నెలపోయాక మేం కొత్త నాటకం మొదలెడతాం. మీరు వచ్చి కనబడండి. మీ అమ్మాయిని మా సమాజంలోకి తీసుకుంటాం. డబ్బు వీళ్ళ కన్నా ఎక్కువే ఇవ్వగల్ను. పైగా చాలా ప్రోగ్రాములుంటాయి. వేరేచోట వెయ్యాల్సిన అవసరమే ఉండదు.''

వరహాలరావు మాటలకి వెంకటరత్నం, ఉక్కిరి బిక్కిరయిపోయాడు.

''చిత్తం. మీలాటివారు దయవలిస్తే మేం బాగుపడతాం'' అన్నాడు.

వరహాలరావుకి సీతగా రాధిక నచ్చింది. ఆమెలోని సుకుమారం, ముగ్ధత్వం, లేతదనం నచ్చాయి. స్త్రీ పాత్రలు వేసే వాళ్ళలో కాస్త అందంగా ఉన్నవాళ్లు తక్కువ. ఎన్నిసార్లు ప్రయత్నించినా అతని సమాజానికి మంచి అమ్మాయి దొరకలేదు. తప్పక, వేరే దారి లేక, దొరికిన వాళ్ళతోనే వేయించుకుంటున్నాడు. వరహాలరావుకి తన సమాజంలో సీతగా వేసే ఆవిడ జ్ఞాపకం వచ్చింది. ఆమె అతనంత లావు వుంటుంది. నలభై ఏళ్ళ వయసుది.

రాధికలోని లక్షణాలన్నీ అతనికి నచ్చాయి.ఆమెను తన సమాజంలో చేర్చుకుంటే......వరహాలరావు చాలాదూరం ఆలోచించాడు.

టాక్సీ ఎక్కి అందరికీ దణ్ణంపెట్టాడు వరహాలరావు. "త్వరలోనే తమ దర్శనం చేసుకుంటాను'' అన్నాడు వెంకటరత్నం. ''సరే" నన్నాడు వరహాలరావు.

అంతవరకు సీత పాత్రలో, కళ్యాణం సీనులో పట్టుచీరతో కళ్ళముందు నిల్చిన రాధిక – బట్టల్లేకుండా, కొంటె నవ్వుతో తన దగ్గరికి వస్తున్నట్టనిపించింది వరహాలరావుకి.

అతని కళ్ళల్లో కోరిక ఎర్రగా జీరాడింది.

టాక్సీ కదిలింది.

రాధిక రెండో ప్రదర్శనలోనే వరహాలరావు పరిచయంకావడం వెంకటరత్నానికి శుభసూచకంగా అనిపించింది. తన కూతురు మంచి నటిగా స్థిరపడుతుందనీ, ఆమె బంగారు భవిష్యత్తు అందుకునే సమయం త్వరలోనే ఉందనీ అనిపించిందతనికి.

ఆ ఆనందం అతని కెక్కువ కాలం నిలవలేదు.




ప్రోగ్రాంపూర్తి చేసుకుని తిరిగివచ్చిన రోజున మధ్యాహ్నం ఇంటికిచేరుకున్నారు. ఆ రాత్రి మోహన్ ఇంటికి తిరిగి వచ్చేసరికి బాగా పొద్దుబోయింది. అప్పటికి తండ్రి కూతురు నిద్రపోయారు.

''నాటకాల కంపెనీ ఇంటికి వచ్చేసిందా?'' అన్నాడు మోహన్ తల్లితో. ఆమె ఏమీ మాట్లాడలేదు.

చెల్లెలు నాటకాల్లో చేరని క్రితం, అతనెప్పుడూ చెల్లెలితో కబుర్లు చెపూ్త భోం చేసేవాడు. అలాంటిది చెల్లెలు ఇంట్లో వుందంటేనే అన్నం తినబుద్ధి కావడం లేదు. ఆమె విషయమై ఆలోచించకూడదని ఎంతనుకున్నా, తనకు తెలియకుండానే ఆమెపట్ల అతనికి ఎలర్జీ లాంటిది కలుగుతోంది. మానసికంగా శతృత్వం పెరుగుతోంది.

భోజనం చేసాక గదిలోకొచ్చి లైటు వేస్తే రాధిక ఆదమరచి నిద్రపోతూ కనిపించింది. ఎప్పుడూ అమాయకత్వం కనిపించే ఆమె ముఖంలో అప్పుడు క్రూరత్వం, రాక్షసత్వం కనిపించాయతనికి. ఆమె పడుకున్న గదిలో పడుకోడంకూడా అతనికిష్టంలేదు. తల్లి చలిగాఉందని ఎంత చెప్పినా వినిపించుకోకుండా మంచం, పక్కబట్టలు తీసుకుని అరుగుమీద పడుకోడానికెళ్ళిపోయాడు.

మర్నాటి నుంచి ఇంట్లో అదోరకమైన వాతావరణం.

అన్నను తప్పించుకుని చెల్లెలు, కొడుకుని తప్పించుకుని తండ్రి, వీళ్ళిద్దర్నీ తప్పించుకుని మోహన్ తిరుగుతున్నారు. మోహన్ సాధ్యమైనంతవరకు ఇంట్లో ఉండా బైటే గడుపుతున్నాడు. తండ్రి ఆరోగ్యం గురించి, వైద్యం గురించి పట్టించుకోవడం మానేశాడు. ఆ విషయాల్లో తన అవసరం ఏమీ లేదనిపించింది.

వెంకటరత్నానికి ఇది బాగానే ఉంది. తననింక ఏ విషయంలోను అడిగేవారుండరు. తన ఇష్టమొచ్చినప్పుడల్లా బైటికెళ్ళి, తన ఇష్టమొచ్చినప్పుడల్లా ఇంటికి రావచ్చు.

బ్రాకెట్ ఓపెనింగ్‌లు, క్లోజింగ్‌లు జోరుగా సాగిపోతున్నాయి. వెంకటరత్నానికి తన పూర్వ వైభవం తిరిగి వస్తున్నట్టనిపించింది. తన నడిగేవాళ్ళు లేరు.

ఎంత తప్పించుకు తిరుగుతున్నా మోహన్ తండ్రి చేసే పనులు గ్రహిస్తూనే ఉన్నాడు. ఓ మనిషిమీద కోప్పడ్డానిక్కూడా ఆ మనిషిమీద ఇష్టం, శ్రద్ధ ఉండాలి. మోహన్‌కి ఇప్పుడవేం లేవు. అలాగని అతను తండ్రిని, చెల్లెల్ని తన మనసులోంచి పూర్తిగా తుడిచివెయ్యలేకపోతున్నాడు. వాళ్ళ చేతిలో తనకుకలిగిన ఓటమి, అవమానం మాటి మాటికి గుర్తొచ్చి మనసు కలుక్కుమంటోంది.

రాధికచేత నాటకాలు మాన్పించే ప్రయత్నం కొత్తగా చెయ్యదల్చుకోలేదు. ఇంకామె తన మాట వినదని అతనికి నమ్మకం ఏర్పడిపోయింది. నాటకం మీద మోజో, అందులో వచ్చే డబ్బో, తండ్రి మాటల ప్రభావమో-ఏదో ఒకటి ఆమెను లొంగదీసుకుంది.

ఆమె ఏం చేసినా ఇక తన మాట వినదు.

ఎన్నాళ్ళిలా ఒకరికొకరు భయపడుతూ, దాక్కుంటూ, ఒకరినొకరు అసహ్యించుకుంటూ బతకడం?

ఎన్నోసార్లు ఈ ప్రశ్న అతని మనసులో మెదిలింది. కడుపులోంచి పొంగుకొచ్చే బాధను ఆపుకోలేకపోతున్నాడు.

మోహన్‌కి శర్మగారి దగ్గరకెళ్ళి తన

బాధంతా చెప్పుకోవాలనిపించింది. ఆయ నొక్కరే అతనికి పెద్దదిక్కుగా తోచారు. శర్మగారు తారీకంపెనీ వ్యవహారాలు కొడుక్కి అప్పజెప్పేసి కృష్ణా రామా అనుకుంటూ కూర్చుంటున్నారు.

మోహన్ని చూసిన శర్మగారికి ఆనందం కలిగింది. తను చూపించిన దారిలో నిలదొక్కుకుని ప్రయోజకుడ య్యాడని ఆయనకి అతనంటే ప్రత్యేకా భిమానం. మోహన్ చెప్పినది పూర్తిగా విన్న శర్మగారు ఏం మాట్లాడలేదు. మౌనంగా ఉన్నారు. అతని కళ్ళ తడి ఆయనకి అర్థమైంది.

"సమస్య పెళ్ళి కెదిగిన పిల్లచుట్టూ అల్లుకుంది. నువ్వు మరీ మొండిగా వ్యవ హరిస్తే సమస్య మరికాస్త బిగుస్తుంది. పెళుసు మనుషులతో వ్యవహారం...... ఆడపిల్ల గుమ్మందాటి బైటికెళ్ళే పరిస్థితి రాకూడదు. కూడా మీ నాన్న ఉన్నా ఆమె క్షేమం చూస్తాడని, చూడగలడని నాకు నమ్మికలేదు. తన వ్యసనాలు తీర్చుకుంటే చాలనుకుంటాడు. ఏం చేసినా ఆలోచించి చెయ్యి" అన్నారు శర్మగారు.

శర్మగారితో మాట్లాడి ఇంటికి వచ్చేక మోహన్కి ఏదో బరువు దిగిపోయినట్టని పించింది.

* * *

రాధిక నాటకాలు వేస్తుందని అందరికీ తెల్సింది. తమ నాటకంలో వెయ్యమని కోరడానికి ఎవరెవరో రావడం మొదలె ట్టారు. అలా వచ్చేవారికి ఓ సమయం అంటూ ఉండదు. కొందరు ఎవరూ నిద్ర లేవకుండావస్తే-కొందరు అంతా నిద్ర పోయాక వస్తారు. వచ్చేవాళ్ళల్లో,లాల్చీల వాళ్ళు, జులపాల జుట్టువాళ్ళు,ఓరచూపుల వాళ్ళు, కోరమీసంవాళ్ళు, ముఖంలో వినయం ఉట్టిపడేవాళ్ళు, కళ్ళల్లో కోరిక చిందించేవాళ్ళు...రకరకాల మనుషులు, రకరకాల ప్రవర్తనలు ... మోహన్కి బాధగా, భయంగా,కోపంగా,అసహ్యంగా వుంది.

పక్కింటి వాళ్ళు, ఎదురింటివాళ్ళు తెల్సున్నవాళ్ళు ఎన్నోచూపులు, ఏమిటో గుసగుసలు. ఏదో చెవులు కొరుక్కో డాలు......

మోహన్ అవమానపడుతున్నాడు.

చివరికి ఓ రోజున తండ్రి, చెల్లెలు ఉండగా ఎవర్నీ ఉద్దేశించకుండా ఇంటి కప్పుకేసి చూస్తూ చెప్పాడు-

"సానుల ఇంటికి వచ్చినట్టు ఇలా జనం మనింటికి రావడం నాకిష్టం లేదు. మీకంతగా నాటకాలే కావాలనుకుంటే మీరిద్దరూ వేరే ఎక్కడైనా ఉండండి. అమ్మ, తమ్ముళ్ళు నాతో వుంటారు. మీరు ఎంత త్వరగా ఇల్లు మారితే అంత మంచిది."

చెప్పడం పూర్తిచేసిన మరుక్షణం అతనక్కడ లేడు.

వెంకటరత్నం, రాధిక ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. వెంకటరత్నం ఆలోచిస్తున్నాడు. అతనేమి ఆలోచిస్తు న్నాడా అని రాధిక ఆలోచిస్తోంది. వాళ్ళి ద్దరు ఏం చెయ్యబోతున్నారాని వెంకట రత్నం భార్య ఆలోచిస్తోంది.

తను, కూతురు నాటకాలమీద బతి కెయ్యగలమని వెంకటరత్నానికి నమ్మక ముంది. నాలుగైదు సమాజాల వాళ్లువచ్చి వెళ్ళారు. వరహాలరావు ఎలాగూ త నాటకంలోకి తీసుకుంటానన్నాడు. ఆప కెలాగూ చాలా ప్రోగ్రాములుంటాయి

వెంకటరత్నం నమ్మకాన్ని గట్టిపరచు కుంటున్నాడు. అతనికి నిత్యం కొడుకుతో

గొడవ పడటం, అతనికి జడిసి తన స్వాతంత్ర్యాన్ని చంపుకోడం ఇష్టం లేదు.

చొక్కా వేసుకుని పక్క వీధిలో పుణ్యమూర్తి ఇంటికెళ్ళాడు. అతనిఇంట్లో తనకో గది అద్దెకిమ్మని అడిగాడు.

విషయమంతా విన్న పుణ్యమూర్తి వెంకటరత్నాన్ని తన ప్రయత్నం విరమించుకోవల్సిందిగా నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. వెంకటరత్నం అతని సలహా పట్టించుకోలేదు.



"గది అద్దెకు కావాలి. ఇస్తావా? ఇవ్వవా??" అన్నాడు.

చాలా కాలంగా తెలుసున్న వెంకట రత్నం అంత నిర్మొహమాటంగా అడిగితే ఇవ్వనని చెప్పలేక పోయాడు పుణ్య మూర్తి. సరేనన్నాడు.

ఆ రాత్రి ఇంటికి తిరిగి వచ్చిన మోహన్‌కి తండ్రి, చెల్లెలు- వాళ్ళ తాలూకు వస్తువులు ఏవీ కనబళ్ళేదు. అతను తల్లినేమీ అడగలేదు. వాళ్లిద్దరూ ఇంట్లోంచి వెళ్ళిపోయారన్న విషయం తెలుస్తూనే వుంది.

భోజనం పెడుతున్న తల్లి ముఖంలో భావాలు చదవడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. భోంచేసాక ఆరుబైట మంచం వేసుకుని వెల్లకిలా పడుకుని ఆకాశంకేసి చూస్తూ ఉండిపోయాడు.

ఆకాశం చీకటిలా నల్లగా, శూన్యంగా ఉంది.

* * *

రాధికను తీసుకుని బయటకొచ్చిన మర్నాడే వెంకటరత్నం వరహాలరావుని కలవాలనుకున్నాడు. తన కూతురి నటనా జీవితపు భవిష్యత్తు, తన ఆర్థిక భవిష్యత్తు వరహాలరావు మీద ఎక్కువ ఆధారపడ్డా యన్న నమ్మకం అతనికిగట్టిగాఏర్పడింది.

వాళ్ళు ఎంత ఇద్దరేఅయినా ఓ సంసా రానికి కావల్సిన కనీసావసరాలు సమ కూర్చుకోవాలి. చాలా ఏళ్లుగా ఈ రకమైన బాధ్యతల్ని నిర్వర్తించడం మానుకున్న వెంకటరత్నానికి యిదో కొత్త సమస్యగా అనిపించింది.

వెంకటరత్నం కొడుకు నించి వేరుపడి నందుకు బాధపళ్ళేదు. ముందున్న బాధ్య తలు తల్చుకున్నప్పుడు మాత్రం అతనికి చిరాకు కలిగింది.

అందుకే వెంటనే భీమవరం వెళ్ళాడు. కాని వరహాలరావు వూళ్ళోలేడు. ఖర్గ పూర్ మొదలైన చోట్ల ప్రవాసాంధ్రులు వరుసగా పదిరోజుల పాటు అతని నాటకం ప్రోగ్రాంలు ఏర్పాటుచేస్తే తన సమాజాన్ని తీసుకుని వెళ్ళాడు. తిరిగి రావడానికి మరో పదిహేను రోజులు పడుతుందని చెప్పారు. వీలైతే వరహాలరావు దగ్గిర అడ్వాన్స్ తీసుకుందామని వెళ్లిన వెంకట రత్నం నిరాశపడ్డాడు. తిరిగి బస్సులో ఇంటికి ప్రయాణమయ్యాడు.

అప్పటికతను కొడుకు ఇంట్లోంచి వచ్చేసి వారం రోజులయింది. జేబులో డబ్బు చాలా మటుకు అయిపోయింది. వారం రోజుల్లోను అనేకమైన అవసరాలొ చ్చాయి. అన్నీ డబ్బుకి సంబంధించినవే!

ఈ వారం రోజుల్లోను అతనికి మూడు సార్లు కొడుకు బజార్లో ఎదురుపడ్డాడు. కనీసం తండ్రికేసి చూడకుండా ఎటో చూస్తూ వెళ్ళిపోయాడు మోహన్. పక్క వీధిలోనే ఉండటం వల్ల రోజూ వెళ్ళి పెళ్ళాన్ని, పిల్లల్ని చూసి వస్తూనే వున్నాడు. ఓసారి మధ్యాహ్నం యింటి కెడితే కొడుకు యింట్లోనే వున్నాడు. తండ్రి కొడుకు లిద్దరూ అసలు పలకరించు కోలేదు.

ఎందుకొచ్చావని తండ్రిని మోహన్ అడుగుతాడేమోనని అతని తల్లి భయ పడింది. కాని అతనేం అనలేదు.

తండ్రితో బయటికొచ్చేసిన రెండు రోజులవరకూ రాధిక యింట్లోంచి బైటకు కదల్లేదు. ఆమెకు బెంగగా అనిపించింది. రెండో రోజున తల్లే ఆమెను చూడ్డానికి వచ్చింది! రాధిక తల్లిని అడిగిన మొదటి ప్రశ్న—

"అన్నయ్యెలా వున్నాడు ?"




అన్నయ్య తనతో ఆదరంగా, అభిమానంగా వున్న రోజులు గుర్తుకొచ్చి ఆమె గుండెల్నిండా ఆర్ద్రత, బాధ చోటు చేసుకున్నాయి.

ఆమెకు యింటికి వెళ్ళి ఓసారి అన్నను చూసిరావాలనిపించింది. కానీ, ఏదో భయం ఆమె మనసును ఆవరించింది. "నా గుమ్మం ఎక్కకు పో" అంటాడని ఆమెకు భయంగా వుంది. తర్వాత రోజు నుంచి రోజూ అన్నగారు యింట్లోలేని సమయం చూసి యింటికి వెళ్ళి తల్లికి పనుల్లో సాయపడి వచ్చేది.

అలా నాలుగు రోజులు యింటికి వెళ్ళి వచ్చింది. అన్నగార్ని చూడాలన్న కోరిక ఆమెలో పెరిగిపోయింది. నాటకాల విషయంలో అభిప్రాయ భేదాలు వచ్చినా, మనస్పర్థలు పెరిగి అతను తనతో మాట్లాడకపోయినా- ఇంట్లో అతను కనిపిస్తుండేవాడు కాబట్టి ఆమెకు అంతగా బాధతెలియ లేదు.

ఇప్పటి పరిస్థితి అలాకాదు. అన్నయ్య కనబడడు. అతన్ని చూడ్డానికి వెళ్ళడం భయం.

ఓ రోజుమధ్యాహ్నం రాధిక మామూలుగా తల్లినిచూడ్డానికి వెళ్ళింది. వంటింట్లో వెళ్ళి భోంచేస్తున్న మోహన్నిచూసి నిలబడిపోయింది. అతను తలఎత్తి ఆమె మొఖంలోకి ఓసారి చూసి అన్నం వున్న కంచంలో చెయ్యికడిగేసుకుని లేచి గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆమె అచేతనంగా ఉండిపోయింది.

మరుక్షణంలో ఆమె తలలో వెయ్యి పిడుగులు పడ్డట్టు,ఆమెపెదడుకి నిప్పంటుకున్నట్టు, ఆమె నరాల్ని ఎవరో మెలిపెట్టినట్టు అనిపించి ఆమె కళ్ళల్లో సముద్రాలు పొంగాయి.

ఊహించని పరిణామానికి ఆమె తట్టుకోలేకపోయింది. అవమానంతో, బాధతో, భయంతో ఆమె నిలువెల్లా కుంగిపోయింది. తల్లి ఏంమాట్లాడకుండా ఉండిపోయింది.

స్పృహలోకి వచ్చి, పొంగుకొస్తున్న ఏడుపుని ఆపుకుంటూ పరుగు పరుగున బైటికొచ్చేసి తన యింటికి వెళ్ళిపోయింది.

కూతురు ఏడుపుముఖంతో వెళ్ళిపోయినందుకు, పొద్దుననగా పనిమీద వెళ్ళి తిరిగొచ్చిన కొడుకు భోజనం మధ్యలో లేచిపోయినందుకు రెండింటికీ తల్లి బాధపడింది. కొడుకుతో ఏదో చెప్దామనుకుని, మాట గొంతులోంచి పైకిరాక ఆమె అలాగే ఉండిపోయింది.

"అమ్మా! నిన్నూ, దాన్నీ విడదీయటం నాకిష్టం కాదుగాని - నేనింట్లో ఉండగా దాన్ని ఇక్కడకి రావద్దని చెప్పమ్మా!'' అన్నాడు మోహన్.

తల్లి మౌనంగా ఉండిపోయింది.

అతను బట్టలేసుకుని షెడ్‌కి వెళ్ళిపోయాక తల్లి యిల్లు తాళంవేసి కూతురు దగ్గరకి వెళ్ళింది. రాధిక చాపమీద బోర్లా పడుకుని తలగడలో తలదాచుకునివెక్కి వెక్కి ఏడుస్తోంది. తల్లి చెయ్యి వీపుమీద పడగానే ఆమెలో దుఃఖం కట్టలు తెంచుకుంది. ఆమెలో ఏ బాధ సుడిగుండంలా తిరిగిందో, ఏ మనసు మూల గాయం తగిలిందో అడ్డు అదుపులేకుండా ఉక్కిరిబిక్కిరయ్యేంతగా ఏడ్చింది. తల్లి లాలించి, ఓదార్చి బుజ్జగించింది.

రాధిక చాలా సేపటికి తెప్పరిల్లింది.

"అమ్మా! నేను చచ్చిపోతే అన్నయ్య అసలు ఏడవడు కదూ!'' అంది రాధిక.

ఆమెమాటలకు దుఃఖపు తెరఅడ్డువచ్చింది.

''అలాంటి మాటలుఅనకమ్మా!''అంది

తల్లి.

ఆమెకు కళ్లలో నీళ్ళు తిరిగాయి.

ఇంటికొచ్చిన వెంకటరత్నం భార్యని, కూతుర్ని ఆ స్థితిలోచూసి 'ఏం జరిగించని' అడిగాడు. ఇద్దరూ ఏమీ చెప్పలేదు.

అతను బీడీ అంటించుకుని అరుగు మీదకి వెళ్ళిపోయి కూర్చున్నాడు.

* * *

రానురాను వెంకటరత్నం ఆర్థిక పరిస్థితి మరి దిగజారింది. అప్పు పుట్టడం



లేదు. ఇల్లు గడవడమే కష్టంగా వుంది. ఇహ తన వ్యసనాలకు ఎక్కణ్నించి తెస్తాడు!

ఓ రోజు సాయంత్రం యింటికి వచ్చే సరికి అతని కోసం యింటి దగ్గిర ఒకాయన వెయిట్ చేస్తున్నాడు.

ఆయనకు సలభై ఐదేళ్ళ వయస్సుంటుంది. బట్టతల, కళ్ళజోడు, వేషధారణను బట్టి చదువుకున్నవాడిలావున్నాడు.

ఆయన చేతిలో సిగరెట్ పొగలు కక్కుతోంది.

వెంకటరత్నం రాకతో ఆయన కుర్చీలోంచి లేచి నుంచుని "నా పేరు రామరాజు. మాది పిప్పర. మీతో పనుండి వచ్చాను" అన్నాడు.

"తమరు కూర్చోండి.ఇప్పుడేవస్తాను" అని వెంకటరత్నం లోపలికెళ్ళి కూతురందించిన మంచినీరు తాగాడు.

పిప్పర సంస్కృతీ వికాసానికి,కళలకు ఎప్పట్నుంచో పేరుపొందింది.ఆగ్రామంలో ఆరువేల మంది జనం ఉన్నారు. స్వాతంత్ర్యంరాకపూర్వం నుంచి ఆవూరు దేశభక్తికి, స్వాతంత్ర్య పోరాటానికి, రచనా వ్యాసంగానికి, నాటక కళలకి పేరు పొందింది. ఎంతో మంది స్వాతంత్ర్య సముపార్జనం కోసం జైలుకి వెళ్ళారు. ఆస్థిపరులు చాలామంది ఉన్న కారణంగా ఏ రకమైన కళకయినా చక్కని పోషణ వుంది.

రామరాజు పిప్పరలో ఉన్న నాటక సమాజానికి కార్యదర్శి, దర్శకుడు. ఆ ఊళ్ళోవున్న కొంతమంది టీచర్లు, ఉత్సాహమున్న యువకులు, కాలేజి చదువు ముగించి ఉద్యోగ ప్రయత్నాల్లో ఖాళీగా ఉన్నవాళ్లు ఆ సమాజంలోని సభ్యులు. సమాజం నడపడానికి డబ్బు వాళ్లకి సమస్య కాదు.

కొత్తనాటకం మొదలెట్టాలని నిర్ణయించినా, అందులో స్త్రీ పాత్రకి సరిపడే అమ్మాయి దొరక్క వాయిదా వేస్తూ వచ్చారు ఆ సమాజం వారు.

కొత్త అమ్మాయెవరో నాటకాలువేస్తోందని ఎవరో చెప్పగా విని ఆమె అడ్రసు వాకబుచేసి రామరాజు వెంకటరత్నాన్ని కలవడానికి వచ్చాడు.

వెంకటరత్నం అరుగుమీద ఓ స్టూలు వేసుకుని కూర్చున్నాడు.

"మంచినీరు తాగుతారా?" అని సాదరంగా రాజుని అడిగాడు వెంకటరత్నం.

"మీరు ఇంట్లో లేకపోయినా మర్యాదలన్నీ బాగాచేసింది మీ అమ్మాయి" అన్నాడు రాజు.

వెంకటరత్నం నవ్వాడు.

అతనికి కూడా మనసులో ఓమూల ఈయన నాటకాల పనిమీద వచ్చివుంటాడనిపిస్తోంది. రామరాజు సిగరెట్ అంటించి మరోటి వెంకటరత్నానికి అందించాడు.

"మా వూళ్ళో మాకో నాటక సమాజం వుంది. మా సభ్యులంతా బాగా చదువుకున్నవాళ్ళు. ఉద్యోగాల్లో వున్నవాళ్ళు. మేం ఓ కొత్త నాటకం తయారుచేసే ప్రయత్నంలో వున్నాం. అందులో హీరోయిన్‌గా మీ అమ్మాయిని తీసుకుందామనుకుంటున్నాం..." రాజు చెప్పడం ఆపాడు.

వెంకటరత్నం చాలా ఆతురతతో వింటున్నాడు. తలుపు దగ్గరే నిలబడ్డ రాధిక కూడా ఆ మాటలన్నీ వింది.

"మీ అమ్మాయి ఇంతవరకు పౌరా

ణికమే తప్ప సాంఘిక నాటకాలు వెయ్యలేదని చెప్పింది. అవి కూడా పెద్ద కష్టమేమీ కాదు. పైగా ఈ రోజుల్లో నాటక పోటీలు ఎక్కువగా జరుగుతున్నాయి. కాబట్టి ప్రతి ఊళ్ళో ఓ నాటక సమాజం తయారవుతోంది. మీఅమ్మాయికి ఎక్కువ ఛాన్సులు కూడా వస్తాయి. ఏమంటారు ?"

"అబ్బే సాంఘికం వెయ్యకూడదని నియమం లేదు. కాకపోతే రిహార్సల్ ఎక్కడ పెడతారు ?''

"మా ఊళ్ళోనే పెడతాం. భోజనం వగైరా ఏర్పాటు చెయ్యడం సమస్యకాదు"

"నిజమేననుకోండి – కానీ రిహార్సల్ కి ఆడపిల్ల నొక్కదాన్ని పంపడం నా కిష్టం లేదు. అది మామూలుగా నాటకాలేసే పిల్ల కాదు. మేం పరువుగా బతికేవాళ్ళమే. కాకపోతే నాకు ఇష్టం వుండి నాటకాల్లో పెట్టడం జరిగింది. కూడా రిహార్సల్ కి నేనూ వస్తాను" వెంకటరత్నం రాజు మొఖంలోకి చూశాడు.

రాజు కళ్ళజోడు తీసి తుడుచుకుని "మీరు వస్తానంటే మరీ మంచిది. రిహార్సల్ మాకు రాత్రిళ్ళే కుదురుతుంది. మీరిద్దరూ సాయంత్రం పిప్పర వచ్చి పొద్దున్నే తిరిగి వచ్చెయ్యొచ్చు. రిహార్సల్ కి రానుపోను ఖర్చులిచ్చి ఎంతిమ్మంటారు ?"

"నూట పాతిక రూపాయలు" వెంకటరత్నం తడుముకోకుండా టక్కున చెప్పేడు.

రాజు జేబులోంచి పాతిక రూపాయలు తీసిచ్చి "ఇది ఎడ్వాన్స్. వచ్చే ఆదివారంనాడు పూజచేసి నాటకం మొదలెడతాం. ఆ రోజు పొద్దున్నే తొమ్మిది గంటలకల్లా వచ్చెయ్యండి" అన్నాడు.

తను చెప్పిన రేటుకి వెంటనే ఒప్పుకునే సరికి ఇంకా ఎక్కువ అడిగి వుండాల్సిందేమోననిపించింది వెంకటరత్నానికి. తర్వాత ప్రోగ్రాంకి పెంచుదామని మనసులో అనుకున్నాడు.

"పిప్పరలో ఎక్కడికి రమ్మంటారు?'' వెంకటరత్నం అడిగాడు.

''వంతెన దగ్గర బస్సు దిగి హైస్కూలంటే ఎవరేనా చెప్తారు. అక్కడే మా రిహార్సల్ జరుగుతుంది. అక్కడికొచ్చెయ్యండి" రాజు వెళ్ళడానికి లేచాడు.

"రామరాజుగారెళ్తున్నారు'' అన్నాడు వెంకటరత్నం.

రాధిక బైటికొచ్చి "నాటకం పుస్తకం వుంటే ఇవ్వండి. ఈ లోగా డైలాగులు చదువుతాను'' అంది.

రాజుకి తన మరుపుకి నవ్వొచ్చింది. బేగ్ లోంచి స్క్రిప్టు తీసి యిచ్చి— "మంచి నాటకం. నీది చాలా చక్కటి పాత్ర. బాగా చేసావంటే నీకూ, నాకూ కూడా పేరొస్తుంది. మేమా నాటకం కనీసం పది సార్లయినా వేస్తాం'' అన్నాడు రాజు.

వెంకటరత్నం కళ్ళల్లో ఆశ మెరిసి మాయమైంది. వెంకటరత్నం చాలా హుషారుగా, ఉల్లాసంగా ఉన్నాడు. రాజు ఇచ్చిన రూపాయలు జేబులో వున్నాయి.

అతనికి ప్రపంచంలో ఆనందాన్నిచ్చేది ఒక్కటే— డబ్బు. భార్య, కొడుకు, కూతురు... ఇంకెవరూ అంత ఆనందాన్ని సమకూర్చలేరతనికి. అతని ఆలోచనలు, ఊహలు గుర్రాల్లా పరిగెడుతున్నాయి.

రాధిక ఇంట్లోకి కావల్సిన వస్తువుల జాబితా రాసి యిచ్చింది. అది చూసిన వెంకటరత్నం కొంచెం చిరాకుపడ్డాడు. చివరకి పది రూపాయలు తీసియిచ్చి బజారుకెళ్ళి సరుకులు తెచ్చుకోమన్నాడు.




ఆమె సంచీ తీసుకుని బజారుకి బైల్దేరింది. "నువ్ తొరగా వచ్చెయ్. నువ్వొచ్చాక నేను బైటికెళ్ళాలి" అన్నాడు వెంకటరత్నం. అతనెక్కడికి వెడతాడో ఆమెకు తెలుసు.

ఆమె మనసు బాధతో మూలిగింది... అన్నగార్నించి వేరుపడ్డాక తండ్రి తాగని రోజులకన్న తాగిన రోజులే ఎక్కువ. తండ్రికి ఎవరి భయంలేదు. అదుపు, ఆజ్ఞ లేదు. డబ్బులుండాలేగాని పొద్దు గూకేసరికి తాగుడికి వెళ్ళిపోయి అర్ధరాత్రి దాటిన తర్వాత గాని రాడు. పత్యం చెయ్యడం అసలే మానేసాడు.

ఆమె నడుస్తోంది.

ఆలోచిస్తూ, పరాకుగా నడుస్తోంది. ఆమెకు అన్నగారు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. తండ్రి వ్యసనాల కోసమే తనని నాటకాల్లో దింపుతున్నాడని ఖచ్చితంగా చెప్పాడు. అన్నయ్య చెప్పిన మాటలు ఎంత నిజం?

మరి తెల్సిండీ, పరిణామాలు ఊహించీ తను ఎందుకు అన్నగారి సలహా వినలేదు? అన్నయ్య తనని నాటకాల్నుండి తప్పించడానికి ఎంత ప్రయత్నించాడు? మరి ఎందువల్ల అలా మతులో ఉండిపోయింది? ఈ వ్యసనాల వల్ల తండ్రికి మళ్ళీ రోగం తిరగబడితే — దానికెవరు బాధ్యులు? తండ్రికి ఏదైనా అయితే అమ్మకు, అన్నయ్యకు ఎలా మొహం చూపించడం?

రాధిక ఊహించలేకపోయింది. తను తీసుకున్న నిర్ణయం తప్పేమో అనిపించి తనకే తెలియని గిల్ట్ ఆమెనుబాధిస్తోంది.

మరొకవైపు ఆలోచిస్తే ఆమెకు బంగారు భవిష్యత్తు కనబడి ఆశ పెడుతోంది. తనకొక్క సినిమా ఛాన్సు తగిలితే చాలు ... అలా ... అలా ... అంచెలంచెలుగా... ప్రపంచంలోని పెద్దదైన శిఖరం మీద నిలబడినట్టు... చుట్టూ జనం.

తన మాటకోసం,చిర్నవ్వుకోసం,ఒక్క చూపుకోసం పడిగాపులు పడిన జనం... నోకర్లు, చాకర్లు, కార్లు, ......

రాధికకు నాణానికి చెరోవైపు — చెరో రకంగా కనిపిస్తోంది. ఆలోచిస్తూ నడుస్తున్న రాధికకి...

అల్లంత దూరంలో సైకిలో మీద వస్తున్న మోహన్ కనిపించాడు. ఆమె అతన్ని చూసింది. అతనామెను చూళ్లేదు.

ఆమె గుండెలు భయంతో కొట్టుకున్నాయి. ఒక్క ఉదుటున పక్కనే వున్న ఇంటి అరుగు ఎక్కింది అదృష్టవశాత్తు ఆ ఇల్లు తెల్సున్నవాళ్ళదే. వాళ్ళింటి కెళ్ళింది. ఆ ఇంటావిడ రాధికను పలకరించింది.

ఆ ఇంటి హాల్లో తలుపు వెనకాల నుంచుని కిటికీలోంచి రోడ్డు మీద వెడుతున్న అన్నగార్ని చూసింది రాధిక.

అతను ఎటూ చూడకుండా సైకిల్ మీద వెళ్ళిపోయాడు. ఆ ఇంటావిడతో రెండు నిమిషాలు మాట్లాడి రాధిక మళ్ళీ రోడ్డు ఎక్కింది. ఆమెకు చాలా సేపటికి గాని గుండె దడ తగ్గలేదు.

ఆమె తన పరిస్థితికి తానే జాలి పడింది.

ఆమె జీవితంలో ఎప్పుడూ అన్నగారికి భయపడలేదు. అతనంటే ఆమెకు ప్రేమ, అభిమానం, గౌరవం. అంతే! నాటకాల గురించి ఇద్దరూ తీవ్రంగా విభేదించినప్పుడు కూడా ఆమె అతనికి భయపడలేదు.

ఆ రోజు తాను వెళ్ళగానే భోజనం మానేసి లేచిపోయిన సంఘటన గుర్తొచ్చి



ఆమె గుండెల్లో అవమానం, బాధ, ఏడుపూ అన్నీ ఒక్కసారే కలిగాయి. ఆమె కళ్ళు చెమర్చాయి. అన్నయ్య ఎంత ఆదరించేవాడు అనుకున్నప్పుడు ఆమె మనసు అభిమానంతో పరవళ్ళు తొక్కింది. మళ్ళీ ఎప్పటికో ఆ రోజులు! అసలు మళ్ళీ ఆ రోజులు వస్తాయా!




పుణ్యమూర్తి రాకతో వెంకటరత్నం ముందున్న పెద్ద అంకెల ఛార్టులోంచి తల బైట పెట్టాడు – ఆ సమయంలో ఎవరొచ్చినా అతను చిరాకుపడేవాడు. పుణ్యమూర్తి తప్ప. అతనికి పుణ్యమూర్తి పూర్వకాలం నుంచి తెలియడమే కాకుండా ఇల్లు కావల్సి వచ్చినప్పుడు సమయానికి ఆదుకున్నాడు. పైగా అతను వెంకటరత్నం దగ్గర తీసుకునే అద్దె కూడా చాలా తక్కువ.

పుణ్యమూర్తి ముందు మాట్లాడలేక పోయాడు. ఎంత చనువున్నా కొంతమంది ముందు కొన్ని విషయాలు కదపడానికి యిబ్బందికరంగా వుంటుంది.

ఆ మాటా, ఈ మాటా మాట్లాడాక చివర్న తను వచ్చిన అసలు కారణం చెప్పాడు పుణ్యమూర్తి.

వెంకటరత్నం ముందు ఏమీ మాట్లాడ లేదు.

"పెద్దవాడివి-నువ్వే ఆలోచించి ఓ నిర్ణయం చేస్తే బాగుంటుంది. పిల్ల భవిష్యత్తు పాడవుతుందని ఆలోచిస్తున్నాడు మీ పెద్దోడు" అన్నాడు పుణ్యమూర్తి.

"అదే నాకు నచ్చలేదు. చెల్లెలి మంచి ఆడికెంత కావాలో, కూతురి మంచి నాకూ అంత కావాలన్న విషయం ఆడు మర్చి పోతున్నాడు. కూడా నే వుంటాను. దాన్ని ఒంటరిగా ఎక్కడికీ పంపను. అది సెడిపోతుందని భయం ఎందుకు?" వెంకటరత్నం ఎదురు ప్రశ్నించాడు.

పుణ్యమూర్తి దగ్గిర ఆ ప్రశ్నకు సమాధానం లేదు.

"మీ పెద్దాడి ఆలోచన బాగుంది. పిల్లకి పెళ్ళి చేసి పంపేద్దామను కుంటున్నాడు. ఉన్నదా ఒక్క పిల్ల. ఆ ఒక్కదాన్ని సంపాదన కోసం నాటకాల్లో పెట్టాల్సిన అవసరమేం వుంది. నువ్వూ ఆ రకంగా ఆలోచించకూడదూ!" అన్నాడు పుణ్యమూర్తి.

వెంకటరత్నం చిరాకుపడ్డాడు. కొడుకు మీద ఏవేవో ఆరోపణలు చేశాడు. తనని సరిగా చూడటంలేదన్నాడు. సరిగా వైద్యం చేయించలేదన్నాడు. దిక్కులేని వాళ్ళల్లా చూస్తున్నాడన్నాడు. చివర్న

"నుంచున్న పళంగా నన్ను, దాన్ని యింట్లోంచి పొమ్మన్నాడు. ఆ దేం కొడుకు. ఇప్పుడీ రాయబారాలెందుకు?- నాలుగు రోజులు పోయి అది పది రూపాయలు సంపాయించింపంటే ఆడే మళ్ళీ దాని సీడకిందికొస్తాడు" అన్నాడు.

తనని మోహన్ రాయబారానికి పంప




లేదని, ఆ కుటుంబం నలుగురిలో నవ్వుల పాలు కావడం యిష్టంలేక తానే సలహా చెప్పడానికి వచ్చానని పుణ్యమూర్తి స్పష్టంగా చెప్పాడు.

"మా బతుకు మేం బతుకుతున్నప్పుడు ఆడి సలహాలు అనవసరం. ఇంకెప్పుడూ మా ఇసయం పట్టించుకోవద్దని చెప్పు" అన్నాడు వెంకటరత్నం.

తన ప్రయత్నం ఫలించనందుకు



పుణ్యమూర్తి బాధపళ్ళేదు. వెంకటరత్నం మనస్తత్వం అతనికి బాగా తెలుసు. పైగా వెంకటరత్నం చేతిలో డబ్బులాడు తున్నాయి. వ్యసనాలు సాగుతున్నాయి. కూతుర్ని నాటకాల్లో ప్రవేశపెట్టడంలో అతని ఉద్దేశం అదే.

రాధిక బజార్నుంచి వచ్చింది. ఆలస్యంగా వచ్చిందని వెంకటరత్నం ఆమె మీద చిరాకుపడ్డాడు. అసలే బాగుండని ఆమె మనసు ఇంకా అస్తవ్యస్తమైంది.

చీకటి పడుతోంది.

వెంకటరత్నానికి రోజు మొదలైంది. అతను తెల్లటి లుంగీ కట్టుకుని, తెల్లటి చొక్కా వేసుకుని జేబులో రూపాయలు ఉన్నాయన్న ధైర్యంతో ముందుకి సాగి పోతున్నాడు.

రాధికకు అన్నగారు కనబడిన సంఘటన మొదలుకొని, తండ్రి తనమీద చిరాకు పడటంవరకూ అన్నీ జ్ఞాపకం వస్తున్నాయి. మళ్ళీ అర్ధరాత్రి తర్వాత తండ్రి ఇంటికి వస్తాడన్న విషయం జ్ఞాపకం వచ్చింది.

ఆమెకు అన్నగారు గుర్తుకొచ్చాడు. తల్లి గుర్తుకొచ్చింది. తండ్రి గుర్తు కొచ్చాడు. నాటకాలు గుర్తుకొచ్చాయి. నౌకర్లు, చాకర్లు, కార్లు, షికార్లు ... ఎన్నో, ఎన్నో...

రాధికకు ఏడుపు ముంచుకొచ్చింది.

చాపమీద బోర్లా పడుకుని తలగడలో ముఖం దాచుకుని ఆమె ఏడుస్తోంది.

* * *

ప్రసాద్‌కి ఇరవై మూడేళ్ళ వయస్సు ఉంటుంది. ఆ వయసుకి తగ్గట్టు అతను దృఢంగా, పొడవుగా వుంటాడు. బి. ఏ. ఫస్ట్‌క్లాసులో పాసయ్యాడు. చూడ్డానికి చదువుకున్నవాడిలా, సంస్కారవంతు డిలా ఉంటాడు.

మూతిమీద సన్నటి మీసం అతని ముఖానికి అందంగా అమరింది. చూసిన వాళ్ళెవరైనా అతని కళ్ళను మెచ్చు కుంటారు. అతని కళ్ళలో మెరుపుంది. మాటల్లో దృఢత్వం వుంది. చూపులో, మాటలో, చేతల్లో గొప్ప విశ్వాసం కనబడుతుంది. ప్రసాద్ గంభీరంగా కని పిస్తాడు. అతన్ని చూసినవాళ్లు అతను రిజర్వ్‌డ్ మనిషనుకుంటారు. అతనితో పరిచయం వున్నవాళ్లు అలా అనుకోరు.

పరిచయమైన కొద్దిసేపట్లోనే అతను చాలా చనువైపోతాడు. చనువు తీసు కుంటాడు, ఇస్తాడు. అతను చక్కగా, అనర్గళంగా మాట్లాడగలడు. చక్కగా నవ్వగలడు, నవ్వించగలడు. తనకిష్టం లేని విషయాన్ని ఖచ్చితంగా చెప్పగలడు. తన ఉద్దేశాన్ని సమర్థించుకుంటూ వాదించగలడు. ఎదుటివారి అభిప్రాయా లని అర్థం చేసుకోవానికి ప్రయత్నిస్తాడు. తను ఏకీభవించలేకపోయినా గౌర విస్తాడు.

పిప్పరలో ఉన్న నాటక సమాజంలో ఏమాత్రం పరిచయమున్న వ్యక్తయినా ప్రసాదంటే ఇష్టపడతారు. అతనా సమా జానికి వెన్నుపూసలాంటివాడని అభి ప్రాయపడతారు.

* * *

బజారుకెడుతున్న రోజు అన్నగారు కనిపించినప్పట్నుంచి రాధిక మనసు తేరుకోలేదు. అన్నగారికి దూరమైనందుకు బెంగ – తండ్రి తాగుడుకి బానిసైపోయి ఆరోగ్యం పాడుచేసుకుంటున్నాడని బెంగ– తల్లి దగ్గర లేకపోయానని బెంగ. ఇంట్లో

 

ప్రతి వస్తువు కోసం తడుముకోవాల్సిన పరిస్థితి వల్ల బెంగ ... అన్నీ కలిసి ఆమెకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నాయి.

రాజుగారువచ్చి నాటకానికి ఎడ్వాన్స్ యిచ్చి వెళ్ళిన మర్నాడు తండ్రితో, "పోనీ నాటకాలు మానేసి అన్నయ్య దగ్గిర కెళ్ళిపోదాం నాన్నా!" అంది.

వెంకటరత్నం కస్సుమని లేచాడు.

ఏవేవో తిట్టాడు. తననెవరూ లెఖ్ఖ చెయ్యడం లేదన్నాడు. ఎన్నో అన్నాడు. రాధిక ఎదురు మాట్లాడలేదు. ఆమెకు చాలా బాధగా అనిపించింది.

అసలు తండ్రితో చెప్పకుండా అన్న గారి దగ్గిర కెళ్ళిపోయి-

"నేను నాటకాలు మానేస్తున్నాను. జరిగిందేదో జరిగిపోయింది. నన్ను మన్నించన్నయ్యా!" అని కాళ్ళ మీద పడిపోదామనిపించిందామెకు. కాని ధైర్యం చాలలేదు.

అన్నగారు ఒప్పుకోరనీ, తిరిగిరానివ్వ రనీ ఆమెకు గొప్ప నమ్మకం ఏర్పడి పోయింది. పుణ్యమూర్తి తండ్రి దగ్గర కొచ్చి మాట్లాడి వెళ్ళిన విషయం ఆమెకు తెలియదు. తండ్రి మాట విని బైటకు వచ్చినందుకు ఆమె మొదటిసారి బాధ పడింది. పశ్చాత్తాప పడింది.

కాని అంతకుమించి చేసేదేమీ కన బడ్డంలేదు. అందుకని ఆమె ఆరోజునుంచే రాజుగారిచ్చిన స్క్రిప్టులో తనడైలాగులు బట్టీ పట్టడం మొదలెట్టింది.

మొట్టమొదట నాటకం మొత్తం చది వింది. ఆమెకది బాగా నచ్చింది. ముఖ్యంగా నాటకంలో తనపాత్ర, రమేష్ బాబు పాత్ర ఆమెకు బాగా నచ్చాయి. తన పాత్ర పేరు రుక్మిణి. నాటకంలో రమేష్, రుక్మిణి అన్నా చెల్లెళ్ళు. అందులో రమేష్ చెల్లెల్ని ఎంతో అపురూపంగా, ప్రాణానికి ప్రాణంలా చూసుకుంటాడు. రెండోసారి చదివినప్పుడు ఆమెకు తన పాత్రకన్నా రమేష్ పాత్ర ఎక్కువ నచ్చింది. ఆమెకు ఎంతో ఆనందమని పించింది.

ఆమెకు తనఅన్న జ్ఞాపకానికొచ్చాడు. ఆమె మనసు ఆర్ద్రంగా అయిపోయింది. క్షణకాలం పాటు ఆమెకు రమేష్ నుంచి అంత అభిమానం, ఆప్యాయత, పొందబోతున్నందుకు చాలా హాయిగా, ఉల్లాసంగా అనిపించింది. అంతలోనే అది నాటకమన్న విషయం జ్ఞాపకమొచ్చి మనసు శూన్యంగా, వెలితిగా అయి పోయింది. నిరాశ ఆమె మనసునిండా నిండిపోయింది.

ఆమెకంతలో నవ్వూ వచ్చింది. ఏడుపూ వచ్చింది.

రాధిక తన డైలాగులు చదువుకుంటూ ఉండిపోయింది.

* * *

వెంకటరత్నం, రాధిక అక్కడికి వెళ్ళేసరికి పూజా కార్యక్రమం మొద లైంది. ఆ వూరి పెద్ద ఒకాయన కొబ్బరి కాయ కొట్టారు. తర్వాత వరుసగా ఒక్కొక్కరే...

జనం చాలామంది ఉన్నారు.

అక్కడి వాతావరణం చాలా ఉత్సాహంగా, సందడిగా వుంది. ప్రసాద్ దగ్గ రుండి కార్యక్రమం అంతా నడిపిస్తు న్నాడు.

రాధిక అతని వంక చూసింది. అతను హడావుడిగా వున్నాడు.

మొదటి చూపులోనే ఆమెకతనిలో ఏదో ఆకర్షణ కనిపించింది. దాన్ని

ఆమె నిర్వచించుకోలేకపోయింది. ఆమె చూపులు అటూ ఇటూ మారుస్తూ మధ్యలో అతనికేసి చూస్తూనే వుంది- అతను హడావుడిగా ఉండి ఆమెను పట్టించుకోలేదు. మిగతావారంతా తనకేసి అన్ని సార్లు చూస్తుంటే ప్రసాద్ ఒక్కసారైనా తనకేసి చూడకపోడం ఆమెకు ఉడుకుమోతనమనిపించింది. "పెద్ద పోజు" అనుకుంది మనసులో.

అంతలో తన ఊహకి తనకే నవ్వు



వచ్చింది.

తనలో ఏం గొప్పతనముందని అతను తనకేసి చూడాలి? అతను చదువుకున్న వాడిలా, సంస్కారవంతుడిలా ఉన్నాడు. నీట్‌గా మల్లెపువ్వులా ఉన్నాడు.

అంతలో ప్రసాద్ రాధికకేసి చూసి "మీరు ఇలా రండి!" అన్నాడు. అతని పిలుపులో చనువుతో కూడిన అధికారం వుంది. అతను అధికారంగా పిలవడం ఆమెకు ఆశ్చర్యమనిపించింది. కాని అతని పిలుపులో ఆమెకే తెలియని ఏం మార్దవం వుందో అతనికి దగ్గరగా వెళ్ళింది. కొబ్బరికాయ చేతికిచ్చి "మీరు కొట్టండి- పూలు దేవుడిమీద వెయ్యండి" అన్నాడు.

అంతమందిలో ఆమెకు చిన్నతనంగా వుంది.

"నేను చిన్నదాన్ని. నేనెందుకు?" అంది భయంగా, బెరుకుగా.

"చిన్నో, పెద్దో మా నాటకంలో మీరు హీరోయిన్ వేషం వేస్తున్నారు. కానివ్వండి" అతని మాటకంతా నవ్వారు. ఆమె కూడా చిర్నవ్వు నవ్వింది.

అప్పుడే ఆమె అతనిచూపులకేదో భాష వున్నట్టు, అతని కళ్ళల్లో ఏదో మెరుపు ఉన్నట్టు ఆమెకనిపించింది.

'ఇతను నాటకంలో రమేష్ వేషం వేస్తే ఎంత బాగుండును' అనుకుందామె.

తన ఊహకి తనకే నవ్వు వచ్చింది.

పూజా కార్యక్రమం పూర్తయ్యాక రాజు అందరినీ వెంకటరత్నానికి, రాధికకు పరిచయం చేసాడు. నాటకంలో పాత్రలు పోషించే వాళ్ళంతా ఆ వూళ్ళో ఉద్యోగాలు చేసుకుంటున్నవాళ్ళే. ప్రసాద్‌ని పరిచయం చేసినప్పుడు వెంకటరత్నం కాస్త నిరసనగా చూడటం రాధిక గమనించకపోలేదు.

అంతలో అందరికీ టిఫిన్లు, కాఫీలు వచ్చాయి.

రాధిక, తండ్రి ఆ హాల్లో ఓ మూలగా చెరో కుర్చీలోనూ కూర్చున్నారు. ఎంత వద్దనుకున్నా ఆమె ప్రసాద్‌కేసి చూడకుండా ఉండలేకపోతోంది. ఆమెను తండ్రి గమనిస్తున్నాడన్న విషయం ఆమెకు తెలియదు.

"ఆ కుర్రాడికి కాస్త దూరంగా ఉండు. అతనంత మంచోడు కాదనుకుంటాను" అన్నాడు వెంకటరత్నం.

అతనా మాటలు ప్రసాద్ నుద్దేశించి అన్నాడని ఆమెకు అర్థమయింది. ఆమె మనసు విలవిల్లాడింది. క్షణకాలం తండ్రి ముఖంలోకి చూసింది. అతను ముఖం పక్కకు తిప్పుకున్నాడు. అతని మాటల వెనకాల ఉద్దేశాన్ని అర్థం చేసుకోలేకపోయిందామె. తండ్రి తనను అనుమానిస్తున్నాడో, జాగ్రత్త పడమని హెచ్చరిస్తున్నాడో అర్థం కాలేదు.

ప్రసాద్‌మీద తను అప్పుడే ఏర్పరచుకుంటున్న సున్నితమైన అభిప్రాయాన్ని ఎవరో తుడిచివేస్తున్నట్టు ఫీలయింది. ఆ మాటలంటున్నప్పుడు వెంకటరత్నం చెవిలో మోహన్ పుణ్యమూర్తి దగ్గర వెలిబుచ్చిన భయం తాలూకు మాటలు మార్మోగుతున్నాయని ఆమెకు తెలియదు.

రాధిక అవమానపడింది. బాధపడింది.

చివరికి అతనా వయసులో వున్నాడు. నాన్న చెప్పింది నిజమే. మిగతావాళ్ళంతా నడివయస్కులు. ఉద్యోగాలు చేసుకుంటూ సంసారాలు గడుపుతున్నవాళ్ళు. ఫరవాలేదు. ప్రసాద్ విషయంలో కాస్త జాగ్రత్తగా ఉండటమే మంచిదనిపించిందామెకు.

ఆ రోజే రిహార్సల్ మొదలైంది.

ప్రసాద్ నిజంగానే రమేష్ వేషం

వేస్తున్నాడు.

అందులో అంతా బాగా . అనుభవం వున్న నటులు. రామరాజు నాటకానికి దర్శకుడు. ఆమె అంతక్రితం వేసిన పౌరాణిక నాటకాలకి, దీనికి ఆమెకు చాలా తేడా కనిపించింది.

పౌరాణిక నాటకాల్లో దర్శకుడు నియంత. అతను చెప్పింది చెయ్యడమే నటీనటుల కర్తవ్యం. ఇక్కడలా కాదు, సమిష్టి కృషికి ఎక్కువ అవకాశం.

ఆరోజు మధ్యాహ్నం వెంకటరత్నానికి, రాధికకు భోజనాలు ప్రసాద్ ఇంట్లో ఏర్పాటు చేశారు. ఓ గంట విశ్రాంతి. చాలామంది ఇళ్ళకు వెళ్ళి తిరిగి రాలేదు. ప్రసాద్, రాధిక, వెంకటరత్నం మాత్రం హైస్కూల్లో ఉన్నారు. వెంకటరత్నం ఓ మూల గురకపెట్టి నిద్రపోతున్నాడు.

రాధికకు ప్రసాద్‌తో మాట్లాడాలని పిస్తోంది. తండ్రి చేసిన హెచ్చరిక జ్ఞాపకం వచ్చింది. ఆ హెచ్చరిక వల్ల ఆమె ప్రసాద్‌కి భయపడటం లేదు. తండ్రికి భయపడుతోంది. నిద్రపోతున్న తండ్రికేసి చూస్తూ ప్రసాద్‌కి దగ్గర కుర్చీలో కూర్చుంది.

''నేను ఎలా చేస్తున్నానంటారు ?'' అతని ముఖంలోకి చూడకుండా అడిగింది.

''మీరు......''

ప్రసాద్ మాటలకి మధ్యలోనే అడ్డు పడిందామె.

"నన్ను మన్నించవద్దు. నువ్వు అనండి చాలు"

"అలాగైతే నన్ను కూడా ఏక వచనంలో పిలు"

ఆమె నవ్వింది.

"మీరు పెద్దవారు. పైగా చదువు కున్నవారు''

"మనిద్దరం ఓ నాటకంలో పాత్రలు వేస్తున్నాం. ఇక్కడ చదువు, వయసు.. వాటి ప్రసక్తి రాదు. అంతా సమానమే''

అతని మాటల కామె హృదయ పూర్వకంగా నవ్వింది.

"ఇంతకీ నా మొదటి ప్రశ్న అలాగే ఉండిపోయింది ?"

"ఓ అదా! నీ నటనలో పౌరాణిక ఛాయలెక్కువున్నాయి. సాంఘిక నాటకం వెయ్యడం ఇదే మొదటిసారి కాబట్టి మార్పు రావడానికి మరి కొంచెం టైం పడుతుంది''

"అంటే...?" ఆమె కుతూహలంగా అడిగింది.

"పౌరాణికంలో అయితే పక్క పాత్రతో మాట్లాడుతున్నా ప్రేక్షకులకు ఎదురుగా నిలబడతారు నటీనటులు.

"కాని మనం నిజజీవితంలో ఏం చేస్తాం ? మనం ఏ మనిషితో మాట్లాడ దల్చుకుంటే ఆ మనిషివైపు తిరిగి మాట్లాడతాం. సాంఘిక నాటకంలో చెయ్యాల్సిందదే. అలాగని పక్కనున్న పాత్రవైపు పూర్తిగా తిరిగితే మన ముఖాలు ప్రేక్షకులకు కనబడవ్. అందుకని నలభై ఐదు డిగ్రీల్లో సగం ప్రేక్షకులవైపు, సగం పక్క పాత్రవైపు తిరిగి నిలబడితే మనక్కావల్సిన ఎఫెక్ట్ వస్తుంది.''

ప్రసాద్ ఎలా నిలబడాలో చూపించాడు. ఇంకా ఎన్నో విషయాలు చెప్పాడు. ఏ డైలాగ్ ఆమె ఎలా చెప్తోందో, ఎలా చెప్తే అది రక్తి కడుతుందో వివరించి చెప్పాడు.

అతనికి నటన మీద వున్న శ్రద్ధకి, వివరించే శక్తికి ఆమె ఆశ్చర్యపడింది.




రిహార్సెల్ మొదలయ్యాక ఆశ్చర్య పోవడం ప్రసాద్ వంతైంది. అతను చెప్పిన సలహాలు తూ.చ. తప్పకుండా పాటించింది.

వరుసగా మూడు రోజులపాటు రిహార్సెల్ జరిగింది. మధ్యలో నాలుగు రోజులు రిహార్సెల్ వుండదని వెంకటరత్నం, రాధిక ఇంటికి ప్రయాణమయ్యారు.

ఇంటికి వెళ్ళాక రాధికకు అనుక్షణం ప్రసాద్ జ్ఞాపకం వస్తున్నాడు. అన్నగారి నుంచి పోగొట్టుకున్న ఆప్యాయత, అభిమానం తనకు ప్రసాద్ నుంచి లభిస్తున్నాయన్న తృప్తి ఆమె మనసుకెంతో హాయిగా వుంది.

ఆ రాత్రి తను చచ్చిపోయినట్టు, తన చావుకి కొందరు సంతోషిస్తుండగా, కొందరు ఏమీ పట్టనట్టుగా వెళ్ళిపోతున్నట్టు రాధికకు కల వచ్చింది.

అంతలో ఆమెకు మెలకువ వచ్చింది. ఆమెకు భయం వెయ్యలేదు. ఆమె పెదాలపై చిర్నవ్వు...

ఆమె హాయిగా నిద్రపోయింది.

* * *

తండ్రి తనను నాటకాల్లో ప్రవేశపెట్టినది తన వ్యసనాలు గడుపుకోడానికే నని మోహన్ చెప్పినదాంట్లో గల నిజం గ్రహించడానికి రాధికకు ఎక్కువ కాలం పట్టలేదు.

శృంగవృక్షం ప్రోగ్రాం తాలూకు డబ్బుకాని, రామరాజిచ్చిన ఎడ్వాన్స్, మధ్యలో అతనిదగ్గర తీసుకున్న డబ్బు.. తండ్రి ఏం చేసాడో ఆమెకు తెలియదు. ఎప్పుడూ ఇంట్లో సరుకుల కోసం తడుము కోడమే. నిలదీసి తండ్రినడిగే ధైర్యం ఆమెకు లేదు.

శృంగవృక్షం నాటకం పూర్తయి ఇంటికి వచ్చిన మొదటి నాలుగురోజుల్లో ఎన్నో సమాజాలవాళ్ళు ఇంటికి వచ్చారు. వాళ్ళందరి రాకపోకలకు చిరాకుపడిన మోహన్ "నాటకాలే కావాలంటే వేరే ఉండండి" అన్నాడు. విచిత్రం - ఒక్క సమాజం వాళ్ళు మళ్ళీరాలేదు. వాళ్ళంతా ఏ ఆశతో వచ్చారో, ఏ నిరాశతో తిరిగి వెళ్ళిపోయారో ఆమెకర్థం కాలేదు.

ఆమెకు నాటకం వెయ్యడం తప్ప వేరే దారిలేదు. తండ్రి ధోరణి చూస్తే అలా ఉంది. స్వయం కృతాపరాధం-అనిపిస్తోం దామెకు. ఆమెకు సరైన బట్టలు కూడా లేవు. చిరుగులు కుట్టుకున్న బట్టల్తో రిహార్సెల్‌కి వెళ్ళడం ఆమెకు బాధగా ఉంది. అలాగని తండ్రితో చెప్తే - ''సంసారం గడవడమే కష్టంగా వుంది'' అన్నాడు.

బట్టలేకాదు ఇంట్లో సరుకులు కావాలని చెప్పినా అతను విసుక్కుంటాడు. ఆమెకేమీ తోచకుండా వుంది. ఒకటి రెండుసార్లు తల్లి బియ్యం తీసుకొచ్చి ఇచ్చింది. ఆ విషయం మోహన్‌కి తెలుస్తుందేమోనన్న భయంతో, అవమానంతో కుంగిపోయింది రాధిక.

ఆరోజు ఏమైనా అన్నయ్యను చూడా లనిపించింది. అతనింటికి వెళ్ళే ధైర్యం లేదు. అతనుంటున్న వీధికి రెండోవైపు నుంచి పక్కింట్లోకి వెళ్ళి కిటికీలోంచి షెడ్‌కి వెడుతున్న మోహన్‌ని చూసింది. అతన్ని చూసినందుకు సంతృప్తిగా ఉన్నా-అలా దాక్కొని భయపడుతూ చూసిన తన పరిస్థితికి తనకే జాలికలిగి, ఏడుపు వచ్చింది. కళ్ళు తడిగా అయ్యాయి.

* * *

ఆరోజు టౌన్‌హాల్లో రామరాజు

సమాజంవారి 'అనుబంధాలు' నాటక ప్రదర్శనం. ఓ క్లబ్ వార్షికోత్సవం సందర్భంగా ఆ నాటక ప్రదర్శన ఏర్పాటు చేసారు. రాధిక తన పాత్రలో లీనమై నటించింది. ఆమె అన్న రమేష్‌గా ప్రసాద్ పోటీపడి నటించాడు. నాటకంలో అన్నతో ఘర్షణపడే సీన్లో రాధిక చక్కగా నటించింది.

ప్రేక్షకుల్లో మితిమీరిన ఉత్సాహం...

ఆమె డైలాగులకు ఎన్నోసార్లు చప్పట్లు కొట్టారు. ఆవేశంగా నటిస్తున్న రాధికకు మధ్యలో కళ్ళు తిరుగుతున్నట్టు, ఒళ్ళు గగుర్పొడుస్తున్నట్టు అనిపిస్తోంది. శక్తినంతా కూడదీసుకుని ఆమె తన పాత్రకు న్యాయం చేకూర్చడానికి ప్రయత్నిస్తోంది. సీనుకి, సీనుకి మధ్య తెర వెనుకకి వెళ్ళినప్పుడల్లా రామరాజు, మిగతానటులు ఆమెను ఉత్సాహపరుస్తున్నారు.

"మంచినీళ్లు కావాలా ?"

"టీ తాగుతావా?"

"చాలా చక్కగా చేస్తున్నావ్. నిలబెట్టు"

క్లైమాక్స్ సీన్‌కి ముందు తమ పోర్షన్ లేనప్పుడు రాధిక, ప్రసాద్ తెర వెనకాల కల్సుకున్నారు.

"బ్రహ్మాండంగా చేస్తున్నావ్. జోహార్లు."

అతని పిలుపుకి ఆమె కళ్ళ వెనకాల ఏదో చిన్న వెలుగు మెరక; ఆమెకి మిగతావాళ్ళందరి అభినందన ఒక ఎత్తు, ప్రసాద్ అభినందన ఒక ఎత్తు.

"ఆఖరి సీను కూడా బాగా చెయ్యి-"

ఆమెకు రమేష్‌లో ప్రసాద్, ప్రసాద్‌లో మోహన్ కనిపిస్తున్నారు. వినిపిస్తున్నారు. అన్నయ్యా పిలుపులో ఎంత మార్దవం?

రామరాజు హడావుడిగా వచ్చి "క్లైమాక్స్ సీన్‌కి రెడీకండి" అన్నాడు.

రాధిక ఆర్తంగా ప్రసాద్ ముఖంలోకి చూసింది.

అతని ముఖంలో నిశ్చలత, విశ్వాసం.

"గుడ్‌లక్! బాగా చెయ్యి" అన్నాడు ప్రసాద్.

ఆమె నవ్వింది.

క్లైమాక్స్ సీన్ కోసం స్టేజి మీద కెళ్ళిన రాధికకు ఎదురుగా నిలబడి నటిస్తున్న ప్రసాద్ ఆప్యాయత నిండిన మూర్తిలా, తనకెంతో ఆత్మీయుడిలా అనిపిస్తున్నాడు. పోగొట్టుకున్న మంచి క్షణాలు తిరిగి వచ్చినట్టనిపిస్తోంది.

రాధికలో కొత్త ఉత్సాహం...తనని అభిమానించే ఓ మనిషి ఉన్నాడన్న తలంపు.. తన చిర్నవ్వుకి, తన కన్నీటికి స్పందించే మనిషి ఉన్నాడన్న ఆలోచన.

హాల్లో గుండుసూది కిందపడితే వినిపించేంత నిశ్శబ్దం. తర్వాత ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠ. పోటీపడి నటిస్తున్న ప్రసాద్, రాధికల మీద అభిమానం.

చివర్న రాధిక ప్రసాద్ ఒళ్ళోపడి చనిపోయే దృశ్యం.

నాటకం పూర్తయిన కొన్ని క్షణాల వరకు ప్రేక్షకులు అచేతనంగా ఉండిపోయారు.

* * *

టిఫిన్ తినడం పూర్తి చేసిన రాధికకు ఫ్లాస్క్‌లో కాఫీ కప్‌లో పోసి ఇచ్చాడు ప్రసాద్. ఆమెకు తన గుండెలో ఎవరో అటునుంచి ఇటుగా నడిచి వెడుతున్నట్టనిపించింది.

సారాకొట్టు నుంచి వెంకటరత్నం





రిక్షాలో టౌన్‌హాల్‌కి వచ్చాడు. అతని అడుగులు తడబడుతున్నాయి.

"ఎల్లా వుంది ?" రాధికను పలకరించాడు.

"బాగానే వుంది" ముక్తసరిగా చెప్పింది.

అతను తూలుకుంటూ వెళ్ళి ఓ మూల పడుకున్నాడు. అప్పటికే నటుల్లో కొందరు స్టేజిమీద నిద్రపోతున్నారు. మరికొందరు బైటికెళ్ళారు.

"అన్నయ్యా!" రాధిక పిలుపుకి ప్రసాద్ ఉలిక్కిపడ్డాడు.

"అలా పిలవకూడదా?" అతను అడగని ప్రశ్నకు ఆమె వేసిన ప్రశ్న.

"పిలవకూడదని కాదు. కాని ఎందుకలా పిల్చావ్?"

"నాకు నిజజీవితంలో ఆ అదృష్టం లేదు కాబట్టి. కనీసం నాటకంలో అన్నయ్యనేనా.."

అతనామె వాక్యాన్ని పూర్తి చెయ్యనివ్వలేదు.

"అలాగే పిలు. నీకు అన్నయ్యల్లేరా?''

ఆ ప్రశ్నకు ఆమె గుండెల్లో కలుక్కుమంది. కళ్ళ వెనకాల అతనికి కనిపించని తడి... ఏదో పోగొట్టుకున్న బాధ రేగి ఆమె మనసు విలవిల్లాడింది.

ఎంత దాచుకున్నా ఆమె దుఃఖం ఆగలేదు. కళ్ళమ్మట నీళ్లు..

"ఇష్టం లేకపోతే చెప్పొద్దు - నువ్వు ఏడవకూడదు. నాటకంలో చక్కగా నటించి పేరు తెచ్చుకున్నావ్. ఆనందంగా ఉండాల్సిన సమయమిది" అతను బుజ్జగిస్తున్నట్టు చెప్పాడు.

అదే ఆమె కిష్టం.

ఆమె దుఃఖాన్ని ఆపుకుంది.

ఆమె బేలగా అతనికేసి చూసింది. ఆమెను ప్రశ్నలడిగి ఏడిపించినట్టు అతను గిల్టీగా ఫీలయ్యాడు.

"నిన్ను అనవసరంగా బాధ పెట్టాను కదూ!"

"అదేం లేదు. నాకీ క్షణంలో నువ్వు తప్ప ఆత్మీయులెవరూ లేరు."

అతనామె కేసి చూశాడు.

"నా మీద నీకు ఎంత అభిమానముందో, నీ మీద నాకూ అంత వుంది. నీకు చేతనైన సహాయం చెయ్యడానికి నేనెప్పుడూ సిద్ధమే"

ఆ మాటలు విన్న రాధికకు ఎంతో విశ్వాసం, ఆత్మస్థయిర్యం కలిగాయి. ఆమె ముఖంలో నిశ్చింత తొంగి చూసింది.

* * *

ప్రసాద్ జేబు రుమాలుతో మొహం తుడుచుకున్నాడు. ఫ్లాస్కు తీసి కప్పుల కోసం లేవబోయాడు. 'నేను తెస్తానుండు!' అని రాధిక రెండు కప్పులు తెచ్చి కాఫీ పోసి అతనికో కప్పు ఇచ్చి, తనోటి తీసుకుంది.

ప్రసాద్ ముఖంలో ఆమె పట్ల సానుభూతి వుంది. ఆమెకు సహాయం చెయ్యాలన్న కోరిక వుంది. రాధికకు ఏదో బరువు దిగిపోయినట్టు మనసు తేలికగాను, నిర్మలంగాను వుంది. ఆమె ముఖంలో ఆత్రత లేదు.

ఆమె ప్రసాద్ నుంచి సహాయం ఆశించటంలేదు. ఆమెక్కావల్సినదల్లా సానుభూతి. తన మీద తనకి కాన్ఫిడెన్సు కలిగించే మనిషి. ఓ మంచి మాట...ఓ చిర్నవ్వు. అంతే!

తను ఎవరికీ అక్కర్లేని మనిషినన్న

భావం ఆమెలో ఉంది. దాన్నుంచి తను ఏం కాదు. తనకు ఎవరూ లేరన్న ఆలోచనలోంచి విడుదల కావాలి. తన గురించి ఆలోచించే మనిషున్నాడన్న నమ్మిక కావాలి.

ప్రసాద్ కాఫీ తాగాక సిగరెట్ ముట్టించాడు ... అప్పటికది ఆ రో సిగరెట్.

"అన్ని సిగరెట్లు తాగుతావెందుకు; తగ్గించరాదూ!"

రాధిక మాటలకు అతను నవ్వాడు.

ఆప్యాయత, అభిమానం అన్నవి డబుల్‌వే ట్రాఫిక్ లాంటివి. ఆమె పట్ల తను శ్రద్ధ చూపించాడు కాబట్టి తన గురించి ఆమె ఆలోచిస్తోందనిపించింది.

లేకపోతే ఎవరికెవరు?

ఆమె ఓ నటి... అతనో నటుడు. అంతే!

మరే అనుబంధం లేదు.



"అయినా నేనెవర్ని చెప్పడానికి?"

"నా చెల్లెలువి" అని నవ్వాడు.

ఆమె ఆనందంగా చూసింది అతని వంక.

"నువ్వు మీ అన్నయ్యని కాదని నాటకాల్లో చేరడం మంచిదా కాదా అన్నది ఇప్పుడు చర్చించి ఉపయోగం లేదు. అది గతం...

"పోనీ నాటకాలు మానేసి తిరిగి వెడితే మీ అన్నయ్య రానివ్వడని నువ్వే అంటున్నావ్. పైగా ఎవరికైనా ఈ నాటకం ఓ మత్తులాంటిది. ఓ వ్యసనం. జనం, చప్పట్లు, అభినందనలు మనకిచ్చే ప్రత్యేకత...ఇవన్నీ మన బలహీనతలు. ఓ సారి వీటికి అలవాటుపడ్డాక ఈ సాలెగూడు లోంచి బైటపడటం కష్టం. మనసు అటు వైపు లాగుతూనే ఉంటుంది"

"నాటకాలు మానాలని నాకూ లేదు. అది పిచ్చను, ఏదైనా అను. మానినా అన్నయ్య రానివ్వడు. అటు నాన్నకి, కాకుండా ఇటు అన్నయ్యకీ కాకుండా అయిపోతాను.

"ఇహ నాన్న... తెచ్చిన డబ్బల్లా బ్రాకెట్‌కి, తాగుడికి అయిపోతోంది. అన్నిటికీ మించి నా మీద అనుమానం. నేనెవరితోనైనా లేచిపోతానని భయం పట్టుకున్నట్టుంది. పూర్వం ఇలా లేడు. అంత భయపడేవాడు నన్ను నాటకాల్లో ఎందుకు పెట్టాలి?"

తండ్రికి తన మీద అనుమానమని చెప్పినప్పుడు ఆమె తల దించుకుంది. ఆ మాటలు విన్న ప్రసాద్ బాధపడ్డాడు. అతను గుర్రుపెట్టి నిద్రపోతున్న వెంకటరత్నంకేసి చూశాడు. ఆ క్షణంలో అతనిమీద కోపం ముంచుకు వచ్చింది.

"ఆమె ఆర్థిక పరిస్థితి చెప్పినప్పుడు ప్రసాద్ నొచ్చుకున్నాడు.

"పదిహేను రోజుల తర్వాత నాటకం పోటీలున్నాయి. దానికి ఇదే నాటకం వేస్తాం. అది అయ్యాక వేరే చోట ఓ టికెట్ ప్రోగ్రాం పెడతాను. ఖర్చులు పోగా వచ్చిన డబ్బు మీకిస్తాను" అన్నాడు ప్రసాద్.

ఆమె తన కష్టం చెప్పుకుంది అతన్నుంచి ఆర్థిక సహాయం ఆశించికాదు అతను కష్టపడటమూ ఆమె కిష్టంలేదు.

"నువ్వెందుకు కష్టపడటం? ఈ బాధలు మా కెప్పుడూ ఉండేవే" అంది.

"ఇందులో కష్టం ఏమీ లేదు.పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది" అన్నాడు.

రాధిక ప్రసాద్‌కేసి కృతజ్ఞతా పూర్వకంగా చూసింది.

"మళ్ళీ ఎప్పుడు కనబడతావ్" రాధిక ప్రశ్నలో అతను మళ్ళీ కనబడడన్న బెంగ వుంది.

"నేను అటు వస్తూనే ఉంటాను. మరి మీ ఇంటికి వద్దామంటే మీ నాన్న అసలే..."

అతని అనుమానం ఆమె కర్థమైంది.

"సాయంత్రమప్పుడు మా నాన్న ఇంట్లో వుండడు. ఆ టైంలో రా! శ్రమ అయినా అప్పుడప్పుడు కనిపిస్తూండు. నిన్ను చూసి నీతో మాట్లాడితే నా బాధలన్నీ మర్చిపోతాను. నిన్ను చూస్తే నాకు... నాకు..."

ఆమె మాటల కోసం తడుముకుంటోంది.

ప్రసాద్‌కి అర్థమైంది.

"తప్పకుండా వస్తాను."

ఆమె ముఖంలో సూర్యకాంతి మెరి




సింది. ఆమె మనసులో ఏదో పులకింత..

మర్నాడు ఉదయమే ఎవరి ఇళ్ళకువాళ్లు ప్రయాణమయ్యారు. రామరాజు వెంకటరత్నానికి అంతవరకు ఇచ్చిన డబ్బు లెఖ్ఖ కట్టాడు. దారి ఖర్చులు ఎప్పటికప్పుడు ఇచ్చేస్తూనే ఉన్నారు.

అప్పటికే అతను వంద రూపాయల దాకా వాడేసుకున్నాడు.ఆ మాటవిని రాధిక ఆశ్చర్యపడింది. అందులో తండ్రి ఇంటికి ఖర్చుచేసినది చాలా తక్కువ. అంటే మిగతా డబ్బంతా అతను తాగుడికి, బ్రాకెట్టుకి ఖర్చుచేసేసాడు. వెంకటరత్నం రాజు ఇచ్చిన మిగతా డబ్బుతీసుకున్నాడు.

రాధికకు ఇంటికి వెళ్ళాలంటేనే బెంగగా వుంది. ఇంట్లో సరుకులేం లేవు. మళ్ళీ అన్నయ్య గురించిన ఆలోచనలు. ఒంటరితనం, శూన్యత. ప్రసాద్ రోజూ కనబడడన్న బెంగ. ఆమె మనసత్వం ఆమెకే ఆశ్చర్యంగా, విచిత్రంగా తోచింది. తను కలల్లో బతుకుతున్నానన్న ఆలోచన ఆమెకు నవ్వు తెప్పించింది.




వరహాలరావు నుంచి కబురందగానే వెంకటరత్నం భీమవరంవెళ్ళాడు.రాధికకి అతని సమాజంలో చోటు దొరికితే బంగారం పండినట్టేనని అతని ఆలోచన. వరహాలరావు ట్రూప్‌కి చాలా ప్రోగ్రాము లుంటాయి కాబట్టి చాలా డబ్బు వస్తుందని అతను ఆశపడుతున్నాడు.

వరహాలరావు కబురు విన్న రాధికలో ఉత్సాహం లేదు. మామూలుగా ఉంది. వరహాలరావు సమాజంలోనే కాదు ఎక్కడచేరినా ఇంటి పరిస్థితుల్లో మార్పు ఉండదని ఆమెనమ్మకం.తండ్రి వ్యసనాలు మానడు. అంతవరకు ఎంత డబ్బువచ్చినా ఒకటే.

వరహాలరావుతో నాటకం వేసినా, రామరాజు సమాజంలో నాటకాలు మానకూడదని ఆమె నిర్ణయించుకుంది. ఆమెకు వాళ్ళతో నాటకం వెయ్యడం ఓ చక్కని అనుభవం. మనసు ఉల్లాసంగా హాయిగా ఉంటుంది.

ప్రసాద్‌తో కాలక్షేపం,కబుర్లు ఆమెలో ఉత్సాహాన్ని నింపి జీవితం మీద అనురక్తిని, ఆశను పెంచుతాయి. రాజు సమాజంవిషయం తండ్రితో అంటే "మనకి ఎక్కువ డబ్బులు ఎక్కడవస్తే అక్కడ వెయ్యాలి" అన్నాడు.

తండ్రి మనుషుల్నిడబ్బుతో మాత్రమే కొలవగలడన్న విషయం ఆమెకు అర్థమైంది. అతని మాటలకు ఏమీ ఎదురు చెప్పలేదు ఆమె. విని ఊరుకుంది. వెంకటరత్నం ఆశగా భీమవరం వెళ్ళాడు.

అతను వెళ్ళిన కాస్సేపటికి రాధికను చూడ్డానికి ప్రసాద్ వచ్చాడు. అతని రాక ఆమెలో ఆనందం నింపింది.

వరహాలరావు విషయం విన్న ప్రసాద్ కాస్సేపు మౌనంగా ఉండిపోయాడు.అతని మనసులో ఆలోచనలు సుడిగుండంలా తిరుగుతున్నాయి.

"వరహాలరావు విషయం పూర్తిగా మీకు తెల్సా ?''

ప్రసాద్ ప్రశ్న ఆమెకర్థం కాలేదు.

"అతనికి వ్యక్తిగా మంచి పేరులేదు.

అంటే..." అతను మాటలకు తడుము కుంటున్నాడు. చెప్పాలా వద్దా అన్న ఆలోచనలో ఉన్నాడు.

"ఆగావేం చెప్పు. నాకు నీకన్నా శ్రేయోభిలాషులెవరున్నారు ?"

"అతని గుణం మంచిది కాదని చెప్పు కుంటారు. నాటకాల్లోకి తీసుకున్న ఆడ వాళ్ళని..."

అతని వాక్యం పూర్తి చెయ్యనివ్వలేదు.

"నేను జాగ్రత్తగా ఉంటాను" ఆమె మాటల్లో ధీమా.

"నీమీద నీకు నమ్మకం ఉండటం మంచిదే. కానీ కావాలని ప్రమాదస్థుల దగ్గర కెళ్ళడం ఎంతవరకు వివేకమో ఆలోచించు. నువ్వెంత జాగ్రత్తగా ఉన్నా, అతని నాటకంలో వేస్తే నువ్వూ అంద ర్లాటిదానవే ననుకుంటారు"

"నిజమే! కాని డబ్బులెక్కువ వస్తా యని నాన్న వదలడు. నే చెప్పినా వినడు" ఆమె తన అనుమానం వ్యక్త పరచింది.

"నీకు మంచి నటిగా పేరొచ్చింది. మా నాటకాలెలాగూ వుంటాయి. ఈ చుట్టుపక్కల చాలా సమాజాలున్నాయి. వాళ్ళంతా హీరోయిన్ దొరక్క నానా అవస్థలు పడుతున్నారు. కావాలంటే నేను మిగతా సమాజాల వాళ్ళకి చెప్తాను. ఆ మాత్రం డబ్బు రాకపోదు. పైగా చాలా నాటకాలు వేసానన్న తృప్తి, అనుభవం మిగులాయి. మీ నాన్నకి చెప్పిచూడు"

ప్రసాద్ అంతకు మించి ఏమీ చెప్ప లేకపోయాడు. ఓ మనిషి జాగ్రత్త కోసమైనా ఓ చెడ్డ విషయం చెప్పడానికి ఏదో అడ్డు వస్తుంది. ప్రసాద్ అదే పరి స్థితిలో పడ్డాడు.

రాధిక వరహాలరావుతో నాటకాలు వెయ్యడం అతనికేమాత్రం ఇష్టంలేదు. వరహాలరావు హీరోయిన్లను నాటకాలకు మాత్రమే ఉపయోగించుకోడని అతనికి ఖచ్చితంగా తెలుసు. వరహాలరావు ఏమైనా చెయ్యగలడు. అతని దగ్గర డబ్బుంది. పలుకుబడి ఉంది. తెలివితేటలున్నాయి. చెడ్డ ఆలోచనలున్నవాడి దగ్గర ఇవన్నీ ఉండటం ప్రమాదకరం. రాధికలోకాసు భవం లేని అమాయకురాలు. వెంకట రత్నం వ్యసనపరుడు.

ప్రసాద్ తన భయాన్ని, అయిష్టతను రాధికతో గట్టిగా చెప్పలేకపోయాడు. మరీ క్రూడ్‌గా చెప్తే ఆమె విశ్వాసాన్ని, ఆమె గుణాన్ని, ఎక్కువ అనుమానించి నట్టవుతుంది. అంతే కాకుండా వరహాల రావు సమాజంలో చేరడం, చేరకపోవడం ఆమె చేతిలో లేదు. ఆ విషయంలో వెంకటరత్నం నియంత.

వీలైతే వెంకటరత్నానికే మంచి చెడ్డలు వివరించి చెప్పాలనుకున్నాడు ప్రసాద్.

అతను తిరిగి వెళ్ళబోతుంటే "నీకు నేనిచ్చే చిన్న బహుమతి" అని నీలం రంగు పెన్ అందించింది రాధిక.

ఆమె కళ్ళల్లో ఏదో తృప్తి తాలూకు మెరుపు.

"ఎందుకిప్పుడిది ?"

"నా తాలూకు వస్తువొకటి నీ దగ్గర ఎప్పుడూ వుండాలి నన్ను గుర్తుచేస్తూ" ఆమె నవ్వుతూ చెప్పింది.

"అనవసరంగా డబ్బు ఖర్చు పెట్టావ్" అతను నవ్వుతూ అన్నాడు.

"రామరాజుగారు నాన్నకు తెలియ కుండా పది రూపాయలిచ్చారు ఆ వేళ నాటకం బాగా చేశానని. అది పెట్టి

కొన్నాను."

అతని మనసునిండా ఆమె చూపిన అభిమానం వెన్నెల్లా పాకింది. జేబులోంచి పాతిక రూపాయలు తీసి ఆమె కిస్తూ "ఏదైనా కొనుక్కో" అన్నాడు ప్రసాద్. ఆమె తీసుకుంది.

అతను వెళ్ళిపోయాక ఆ డబ్బు తన పెట్టెలో పెట్టుకుంటూ "వీటిని ఖర్చు పెట్టను. ఇలాగే ఉంచేస్తాను" అనుకుంది.

వెంకటరత్నం భీమవరం నుంచి బాగా చీకటి పడ్డాక తిరిగి వచ్చాడు. అతని కళ్ళల్లో ఆనందం, సారా మిళితమై ఉన్నాయి. అతను చెప్పేవన్నీ అయిష్టంగా వింది. ఆమె మెదడులో ప్రసాద్ చెప్పిన విషయాలు తిరుగుతున్నాయి. వరహాలరావు ఎంతో ప్రమాదస్థుడు కాకపోతే అతనలా చెప్పడు. తన మాట తండ్రి వినడని ఆమెకు తెలుసు. అయినా చెప్పడం తన విధి అనుకుంది.

"వరహాలరావు మంచివాడు కాదట. అతనితో నాటకం వేస్తే నాకు చెడ్డ పేరు వస్తుందని..."

"ఎవరు చెప్పారు?" కూతురి ముఖం లోకి చూస్తూ అడిగాడు.

"ప్రసాద్" అనేసి ఆమె నాలిక కరుచుకుంది.

"ఓహో! ప్రపంచంలో ఈయనొక్కడే గుణవంతుడా ? వరహాలరావు మంచోడే, మర్యాదస్తుడు. అయినా మనం జాగ్రత్తగా, మంచిగా ఉంటే ఎవరిచెడ్డ మన్నేం చెయ్యాడు. ఎడ్వాన్సు కూడా తీసుకున్నాను"

రాధిక ఏమీ మాట్లాడలేదు. తనేమీ చెయ్యలేననిపించినప్పుడు ఆమెకు బాధ వేసింది.

జరిగేది జరక్క మానదు. తను మరికాస్త జాగ్రత్తగా ఉండాలని నిర్ణయించుకుంది. భవిష్యత్తు మీద భారం వేసింది.

చెడు ఏమీ జరగదన్న ఆశతో...

జరగకూడదన్న కోరికతో...

* * *

వరహాలరావు కొత్త నాటకం ప్రారంభించాడు. అందులో రాధిక సీతగా నటిస్తుంది. వరహాలరావు రావణబ్రహ్మ వేషం వేస్తాడు. సీతారాములు వనవాసానికి వెళ్ళడంతో నాటకం మొదలై, రావణ సంహారంతో ముగుస్తుంది.

ఆ నాటకం మొదలవుతున్నందుకు ఎక్కువ సంతోష పడ్డవాడు వెంకటరత్నం. రాధికకు ఒక్క ప్రోగ్రాముకి రెండు వందలు. ఆమెకు ఇంతవరకు ఏ నాటకానికి అంత డబ్బు ఇవ్వలేదు. పైగా ఆ ప్రాంతంలో ఏ హీరోయిన్ కూడా అంత డబ్బు తీసుకోలేదు. వరహాలరావు చాలా ప్రోగ్రాములిస్తాడు కాబట్టి ఇంక డబ్బుకి లోటుండదనుకున్నాడు వెంకటరత్నం. పైగా మధ్యలో ఖాళీ ఉన్నపుడు ఆమె వేరే నాటకాలు వేసుకోవచ్చని చెప్పాడు వరహాలరావు.

ఆరోజు పూజ. రాధికకు బెరుకుగా, భయంగా, బలికోసం తీసికెళ్ళబడుతున్న మేకపిల్లలా ఉంది. ప్రసాద్ చెప్పిన మాటలు ఆమె చెవిలో తిరిగి తిరిగి విని పిస్తున్నాయి.

రాధిక ఆలోచిస్తోంది. "నాటకాలేస్తే నీకు చెడ్డ పేరొస్తుంది. నీకు పెళ్ళి కాదు" మోహన్ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. ప్రసాద్ గుర్తుకొచ్చాడు. "కావాలని ప్రమాదస్థుల దగ్గర కెళ్ళడం వివేకం అనిపించుకోదు."

వరహాలరావు ప్రమాదస్థుడు. నిజమే! కానీ తను ఏం చెయ్యగలదు ? అంతా తండ్రి నిర్ణయం. అతనికి డబ్బుకావాలి అలాగని అతను డబ్బుకోసం కూతురి చేత ఏమైనా చేయించే మనిషి కాదు. ప్రసాద్‌తో చనువుగా మాటాడితేనే మండి పడుతున్నాడు. మరి వరహాలరావు విషయం చెప్పినా వినిపించుకోడేం ?

కొబ్బరికాయ కొట్టమని వరహాలరావు పిల్చిన పిలుపుతో రాధిక ఆలోచనల్నుంచి బైట పడింది. అతని పిలుపే భయం కరంగా అనిపించిందామెకు. సరిగ్గా ఇదే సందర్భంలో ప్రసాద్ పిల్చిన పిలుపుకి, దీనికి ఎంత తేడా అనుకుందామె.

రిహార్సల్ మొదలైంది. రాధిక మనసు పెట్టి చెయ్యలేకపోతోంది. ఏదో తప్పదన్నట్టు చేస్తోంది. వరహాలరావు ఎలా చెయ్యాలో చెప్తున్నాడు. అలాంట ప్పుడు అతని ముఖంలోకి చూడ్డానిక్కూడా ఆమెకు భయంగా వుంది.

వరహాలరావుకి ఓ మేడుంది. కింద వాటాలో అతని కుటుంబం ఉంటుంది. పైన ఓ పెద్ద హాలుంది. అందులో రిహార్సల్ చేస్తున్నారు.

"మరీ సాంఘిక నాటకంలా చేస్తు న్నావ్. పౌరాణిక ఫక్కీ అలవాటు చేసుకో" అన్నాడు వరహాలరావు.

మధ్యాహ్నం వరకు రిహార్సల్ జరిగింది. భోజనాలయ్యాక "మీరిద్దరూ విశ్రాంతి తీసుకోండి. నాకు ఊళ్ళో పన్లు న్నాయి. చూసుకుని వస్తాను" అన్నాడు వరహాలరావు. రిహార్సల్ హాల్‌కి చేర్చి ఓ గది వుంది. దాని తలుపు దగ్గరగా వేసి ఉంది. మెల్లగా లోపలి కెళ్ళిన రాధిక ఆశ్చర్యపోయింది.

ఆ గది మయసభలా వుంది. అందులో పెద్ద పెద్ద మంచాలు, మెత్తటి పరుపులు, తలగడలు, బాలీసులు నీట్‌గా అందంగా వున్నాయి. మంచాలకి ఎదురుగా పెద్ద డ్రెస్సింగ్ టేబిల్, దానికి బిగించి వున్న పెద్ద అద్దం వున్నాయి. డ్రెస్సింగ్ టేబుల్‌మీద ఖరీదైన పౌడర్లు, స్నోలు, తల నూనెలు వగైరా ఉన్నాయి. ఆ గది గోడలకు పైభాగంలో అమ్మాయిల అర్థ నగ్న చిత్రాలు, పూర్తి నగ్న చిత్రాలు ఎన్నో మంచి ఫ్రేముల్లో వేలాడు తున్నాయి. ఆ గది వాతావరణం అలంకరణ రాజమందిరాల్లోని విలాసాన్ని గుర్తు చేస్తుంది. ఆ గది చూసిన ఎవరికైనా వరహాలరావు మంచి రసికుడనిపించక మానదు.

ఆ గదిని పరీకిస్తున్నంతసేపు రాధిక గుండెలు దడదడలాడాయి. ప్రసాద్ మాటలు మళ్ళీ గుర్తుకొచ్చాయి. కంగారుగా గదిలోంచి బైటికి వచ్చేసింది.

మధ్యాహ్నం రిహార్సల్ మొదలైంది. హావభావాలు ఎలా చూపాలో, డైలాగ్ ఎలా చెప్పాలో, అలవోకగా ఎలా చూడాలో, సీతపాత్రలో ముగ్ధలా ఎలా నిలబడాలో వివరించి చెప్తున్నాడు వర హాలరావు. అతని చెయ్యి తనకి తగిలి నప్పుడల్లా తేళ్ళు, జెర్రులు పాకినట్టు ఫీలవుతోంది రాధిక. అంతకితం సత్యం గారితో నాటకం వేసినప్పుడు కాని, రామ రాజు దర్శకత్వంలో కాని ఆమె అలా ఫీల్ కాలేదు. వరహాలరావు ఎంత దగ్గరగా వస్తే ఆమె అంత దూరంగా ఉండటానికి ప్రయత్నిస్తోంది. అతనెంత చనువుగా ఉండటానికి ప్రయత్నిస్తే ఆమె అంతగా ముడుచుకుపోతోంది.

తన ప్రవర్తన తనకే ఆశ్చర్యం




వేసిందామెకు. ఆమె సిగ్గుని, బిడియాన్ని, భయాన్ని వరహాలరావు అర్థం చేసుకున్నాడు.

"భయపడకు. నేర్చుకుంటే అదే వస్తుంది" అంటున్నాడు. ఆ రాత్రి రిహార్సల్ జరుగుతుండగా వెంకటరత్నం వెళ్ళి తాగివచ్చాడు. భోజనాలయ్యాక రిహార్సల్స్ హాల్లోనే వెంకటరత్నానికి, రాధికకు పక్కలు ఏర్పాటు చేశాడు వెంకటరత్నం. ఆమెకు ఒళ్ళంతా నెప్పులుగా ఉంది. పగలంతాపడ్డ శ్రమ రాత్రి నిద్రలో తీరుతుందనుకుంది. కాని ఏదో భయం ఆమెను ఆవహించింది. ఎంత గింజుకున్నా నిద్ర పట్టలేదు. పట్టినా వెంటనే మెలకువ వచ్చేసింది.

ఆ రోజు ఆమె చూసిన గది, అందులో నగ్న చిత్రాలు గుర్తుకొచ్చి వరహాలరావంటే భయం ఎక్కువైంది.

మర్నాడు రిహార్సల్లో వరహాలరావు ప్రవర్తనలో చాలా తేడా కనిపించింది రాధికకు. అతను నిజంగానే రావణాసురుడిలా అనిపించాడు. రావణాసురుడు కనీసం సీత ఆమోదం కోసం ప్రయత్నించాడు. వరహాలరావులో అంత మంచితనం ఉన్నట్టుగా అనిపించలేదు.

హాల్లో ఆమె, తండ్రి మాత్రం పడుకుంటారు. పక్కనే చేర్చి గదివుంది. ఆ గది తలుపులు వేసేస్తే లోపల్నుంచి అరచినా ఎవరికీ వినబడదు.

ఆమె గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

అంతకు ముందు రాత్రి ఏ ప్రమాదమూ జరగలేదు. అనవసరంగా భయపడుతున్నాననుకుంది రాధిక. అలా అనుకున్నప్పుడు ఆమెకి కొంచెం ధైర్యం చిక్కింది.

ఆరోజు కాస్త మనసు పెట్టి రిహార్సల్ చెయ్యగలిగింది. ఆ రాత్రి రిహార్సల్ ముగిసేముందు వెంకటరత్నాన్ని పిల్చి పది రూపాయలిచ్చాడు వరహాలరావు అర్థం కానట్టు చూశాడతను.

"మనిషన్నాక ఏవో అలవాట్లుంటాయి. వెళ్ళి రండి" అన్నాడు. ఆ మాటలు రాధికకు వినబళ్ళేదు. తండ్రి బైటికెళ్ళి వచ్చేదాకా వరహాలరావు భార్యతో కబుర్లు చెప్తూ కూర్చుంది రాధిక. వెంకటరత్నం తిరిగి రావడమే రిక్షాలో వచ్చాడు. మనిషి తూలుతున్నాడు. భోంచేసే పరిస్థితుల్లో లేడు. మెల్లగా పట్టుకుని మెట్లు ఎక్కించి అతన్ని మంచంమీద పడుకోబెట్టింది. తండ్రినా స్థితిలో తీసుకువెడుతున్నప్పుడు ఆమెకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కిందకు వెళ్ళి వరహాలరావింట్లో భోంజేసి వచ్చి పడుకుంది. ఆమెకు మనసు బాగా లేదు. అంతక్రితం రాత్రి భయంతో ఆమెకు నిద్ర పట్టలేదు. రెండు రోజులు వరుసగా రిహార్సల్స్.

శరీరం విశ్రాంతి కోరుతోంది. నిద్రపోయే ముందు హాల్లోంచి మెట్ల వైపు ఉన్న తలుపు బోల్టు వేసేసి వచ్చింది. కొద్దిసేపటికే ఆమెకు నిద్ర పట్టింది. నిద్రలో ఆమె ప్రపంచాన్ని, నాటకాల్ని, వరహాలరావుని, అతని మంచి చెడుల్ని, తండ్రిని, అతని ప్రవర్తనను అన్నీ మర్చిపోయింది.

ఎవరో మెల్లగా తట్టి లేపుతున్నట్టనిపించి రాధికకు మెలకువ వచ్చింది. ముందు కళ్ళకి ఏమీ కనబళ్ళేదు. కంగారుపడింది. కళ్ళు నులుముకుని చూసింది. పక్కగదిలో లైటు వెలుగు హాల్లో నీడలా పడుతోంది. మంచం పక్కనే



నుంచున్నది వరహాలరావు...అతని ఒంటి నుంచి సెంటువాసన గుప్పుమని కొడుతోంది. కొన్ని సందర్భాలకి భాష అవసరం ఉండదు. పరిస్థితులు, చేష్టలు, చూపులు.. భాషకన్నా ఎక్కువ భావాల్ని అందచేసాయి.

అతనేమీ మాట్లాడలేదు. ఆమె ఏమీ అడగలేదు.

ఆమెకు గుండె ఆగినంత పనయింది. పక్కనున్న తండ్రికేసి చూసింది. అతనిలో సారా బాగా పనిచేస్తోంది.

మత్తుగా గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

ఆమె చూపులకి స్వంత భాష్యం చెప్పుకున్న వరహాలరావు "మీ నాన్న లేవడు. గదిలోకి రా" అన్నాడు.

ఆమెకు ఏం చెయ్యాలో అర్థం కాలేదు. తండ్రిని లేపుదామన్న ఆలోచన వచ్చింది. తాము ఉన్నది అతనింట్లో తీరా తండ్రి లేచాక 'నీ కూతురే లేపమని నాకు చెప్పింది' అని అతను ప్లేటు ఫిరా



యిస్తే...తండ్రి అసలే మూర్ఖుడు.

"నేనలాంటిదాన్నికాదు. మా నాన్నని లేపుతాను'' అంది.

వరహాలరావు బిత్తరపోయాడు.

ఆ రోజు రిహార్సల్లో ఆమె ప్రవర్తనను చూసి ఆమె భయపడదని అతను అనుకున్నాడు. పిలవగానే గదిలోకి వస్తుందనుకున్న అతని ఆలోచన తారుమారైంది.

"నీకిష్టం లేకపోతే పోనియ్.. మీ నాన్నకి చెప్పకు. నువ్వే అల్లరిపడతావ్'' అని గదిలోకి వెళ్ళిపోయి తలుపులు వేసేసుకున్నాడు.

ఆ గదికి హాల్లోంచే కాకుండా మరోవైపు నుంచి దారి ఉందన్న సంగతి రాధికకు జ్ఞాపకం వచ్చింది.

'ఎంత ధైర్యం వెధవకి' అనుకుంది రాధిక. అతను వెళ్ళిపోయినా ఆమెకు వణుకు తగ్గలేదు. తాగిన మత్తులో నిద్రపోతున్న తండ్రి మీద ఆమెకు కోపం, జుగుప్స కలిగాయి. లేచి వెళ్ళి వరహాలరావు గదికి బైట బోల్టు వేసింది.

ప్రసాద్ హెచ్చరిక గుర్తుకొచ్చింది. ఆమెకు ఏడుపొచ్చింది. ఇంకామెకు నిద్ర పట్టలేదు.

తెల్లారాక తండ్రికి జరిగినదంతా చెప్పింది. వెంకటరత్నం గిల్టీ ఫీలయ్యాడు. ''అయితే ఏం చేద్దామంటావ్?'' అన్నాడు.

"నేను చచ్చినా అతనితో నాటకం వెయ్యను."

అతనేమీ మాట్లాడలేదు.

"మరి బలవంతం చేసే నా చావు చూస్తావ్'' తండ్రికి పెద్ద డోస్ ఇవ్వాలనుకుంది. ఇచ్చింది.

వరహాలరావుకి ఏదో ఒక వంక చెప్పి మళ్ళీ రెండు రోజుల్లో వస్తామని చెప్పి మెల్లగా బైట పడాలని నిర్ణయించుకున్నారు. వరహాలరావింటికెళ్ళి భార్యనడిగితే "పొద్దున్నే నరసాపురం వెళ్ళారు. సాయంత్రానికి వస్తానన్నారు" అని చెప్పింది.

అతను మొహం చాటు చేసుకుంటున్నాడని అర్థమైంది. ఆమెతో చెప్పేసి వెంకటరత్నం, రాధిక బస్టాండుకి వచ్చేసారు.

ఇంటికి చేరిన రాధిక ఎంతో రిలీఫ్ ఫీలయ్యింది. ఓరకంగా ఆమె వరహాలరావుని మనసులోనే అభినందించింది. తన నిజ స్వరూపం ఏమిటో మొదట్లోనే చూపించాడు.

తను జాగ్రత్తపడ్డానికి వీలు కలిగించాడు.

* * *

వరహాలరావు రాధికను అభినందించలేదు.

జీవితంలో ఎప్పుడూ తన అంచనా తప్పలేదు. ముఖ్యంగా ఆడదాని విషయంలో "ఎందుకిలా జరిగింది?" అనుకున్నాడు.

నాటకంలోంచి మంచి హీరోయిన్, పక్కలోంచి మంచిపిల్ల జారిపోయిందనుకుని మధన పడ్డాడు. అవమానం కలిగింది. తన చల్లని చూపు కోసం, తన వెచ్చని కౌగిటి కోసం, ఎంతోమంది ఆడవాళ్ళు ఎదుర్చూస్తారని అతని విశ్వాసం. తన రసికత్వపు చూపు చివర ఎంతోమంది తమ హృదయాల్నీ, శరీరాల్నీ వేలాడదీసారు.

మెత్తని పరుపు, నిలువెత్తు అద్దం తనని హేళన చేస్తున్నట్టు ఫీలయ్యాడు.




"పతివ్రత కబుర్లు చెప్పింది. చూస్తాను దీని పవిత్రత ఏమిటో!" అనుకున్నాడు.

మనసులో అనుకోడమే కాదు. పైకి అనేశాడు.

సీత చేత తిరస్కరించబడ్డ రావణాసురిడిలా అతను మనశ్శాంతి లేకుండా ఉన్నాడు.

'చూస్తాను దీని సంగతి' అనుకున్నాడు.

అలా అనుకున్నాక అతని మనసు తృప్తి పడింది.

అతనికి నిద్ర పట్టింది.

కలలో రాధిక అతన్ని కవ్వించి నవ్వించింది.

* * *

"ఎంత ధైర్యం వెధవకి" ప్రసాద్ కోపంగా అన్నాడు. రాధిక చేతుల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఆమె ఏడుపులో ప్రమాదం నుంచి బైట పడి పీడ కలలాంటిదాన్ని గుర్తు తెచ్చుకున్న బెంగ, భయం వున్నాయి.

ఆ రాత్రి వరహాలరావు అలా ప్రవర్తించినప్పటినుంచి ఆమెకు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఏడుపు వస్తోంది. ఆమె బలవంతంగా అదుపులో పెట్టుకుంటోంది. ప్రసాద్‌ని చూశాక ఏడుపుకి కట్ట తెగిపోయినట్టయ్యింది. అతని హెచ్చరిక నిజమైంది. ప్రమాదం నుంచి బైట పడ్డా దాని తాలూకు అవమానం ఆమె మనసుని బాధ పెడుతోంది. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తుంటే ప్రసాద్‌కి నోట మాట రాలేదు.

ఆమె మీద జాలితో, సానుభూతితో అతని మనసు నిండిపోయింది. అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

ప్రసాద్ రాధికను పెద్దలా అనునయించాడు. అన్నలా సముదాయించాడు. స్నేహితుడిలా ఆదరించాడు. ధైర్యం చెప్పాడు. జరిగింది పీడ కలలా మర్చిపొమ్మన్నాడు.

"నాటకాలేస్తున్న ఆడదాన్ని కదూ! అందరికీ చిన్న చూపే"

"ఎవరికైనా, నాకు కాదు. నువ్వంటే అభిమానం, ఇష్టమే కాదు గౌరవం కూడా!"

అంత దుఃఖంలోను ఆమె కళ్ళు మెరిసాయి. ఆమెకు తనమీద తనకే కాన్ఫిడెన్స్ కలిగింది. ప్రసాద్, రాధిక ఏవో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

వెంకటరత్నం ఇంటికి వచ్చాడు.

తను వెళ్ళాక రాధికను అనవసరంగా ఏదైనా అంటాడేమోనని ప్రసాద్ భయపడ్డాడు. లేనిపోనివి కల్పించి మళ్ళీ తన ధోరణిలో మాట్లాడతాడేమోనని రాధిక భయపడింది.

వాళ్ళిద్దరూ ఎదుటి వారు మాట పడాల్సొస్తుందేమో ననుకుంటున్నారు.

కాని అలా జరగలేదు.

ప్రసాద్‌ని ఎంతో అభిమానంగా పలకరించాడు వెంకటరత్నం. ఎంతో ఇష్టంగా, చనువుగా మాట్లాడాడు. వరహాలరావు విషయమంతా చెప్పి అతని సలహా పాటించనందుకు చింతించాడు.

"జరిగిపోయిందేదో జరిగిపోయింది. మీకు నేను సాయపడతాను"

వెంకటరత్నం కృతజ్ఞతాపూర్వకంగా ప్రసాద్ కేసి చూశాడు.

"ఆ ఎడవ దగ్గర పాతిక రూపాయలు ఎడ్వాన్స్ కూడా తీసుకున్నాను" బాధగా అన్నాడు వెంకటరత్నం.

"పరవాలేదులే-అతను ఏదో వంక పెట్టి మళ్ళీ కబురంపిస్తాడు. కుదరదని ఖచ్చితంగా చెప్పెయ్యి."

వెంకటరత్నం సరేనన్నాడు.

"పదిహేనో తారీఖున పెనుగొండలో పరిషత్తు వుంది. రాజుగారు చెప్పారట కదా! ఆదివారం నుంచి రిహార్సల్ మొదలెడుతున్నాం. ఆ రోజు ఉదయమే వచ్చెయ్యమన్నారు రాజుగారు."

ప్రసాద్ మాటలు విన్న రాధిక, ఆదివారం ఇంకా ఎన్నాళ్ళుందో లెఖ్ఖపెట్టుకోడం మొదలెట్టింది. ఆమెకా సమాజమన్నా, ఆ నాటకమన్నా, ప్రసాద్ సాహచర్యమన్నా ఎంతో ఉత్సాహంగా వుంటుంది.

మళ్ళీ డబ్బు వస్తుందని వెంకటరత్నం ఆశగా, ఉత్సాహంగా ఉన్నాడు.

* * *

పెనుగొండ పరిషత్తులో అనుబంధాలు నాటక ప్రదర్శన జరిగింది. పోటీలు చూడ్డానికి జనం ఎంతో దూరాల్నుంచి వచ్చారు. పోటీలు మూడు రోజులపాటు పెద్ద ఎత్తున జరిపారు.

'అనుబంధాలు' చూసిన ప్రేక్షకులు రామరాజు మీద, నటుల మీద, ముఖ్యంగా రాధిక మీద విపరీతమైన అభినందనలు కురిపించారు.

రాధికకి ఎంతో గర్వంగా ఉంది. ఆనందం, తృప్తి ఆమె ముఖంలో తొణికిసలాడుతున్నాయి. చివరి రోజున న్యాయ నిర్ణయ ప్రకటన, బహుమతి ప్రదానం. పరిషత్ కార్యదర్శి మైక్ దగ్గరికెళ్ళేసరికి ఆడిటోరియం మొత్తం నిశ్శబ్దంగా అయిపోయింది. అనుబంధాలు నాటకానికి ఉత్తమ ప్రదర్శన, రామరాజుకి ఉత్తమ దర్శకుడు బహుమతులు లభించాయి.

రాధిక ఉత్తమ నటిగా ఎన్నికైందని ప్రకటించినప్పుడు హాలంతా చప్పట్లతో మార్మోగిపోయింది. ఆ శబ్దం తగ్గడానికి ఐదు నిమిషాలు పట్టింది. స్టేజిమీద కెళ్ళి బహుమతి తెచ్చుకున్న రాధిక తిరిగివచ్చి రామరాజుకి పాదాభివందనం చేసింది.

కళ అన్నది ఓ మత్తులాంటిది. ముఖ్యంగా అందులో 'గెలుపు' మరీ మత్తెక్కిస్తుంది. స్వతహాగా నాటకాలంటే ఇష్టం వున్న రాధికకు బహుమతి రావడంతో మరింత పెరిగింది. ఎప్పటికైనా సినిమా తార నవుతానన్న ఆశ అప్పుడప్పుడు ఆమె మనసులో మెదుల్తోంది.

ఉత్తమ నటి బహుమతి అందుకున్నప్పుడు వేలాది జనం కొట్టిన చప్పట్లు, ఆమె నటిస్తున్నప్పుడు ప్రేక్షకులు కొట్టిన చప్పట్లు ఆమెను పులకరింప చేసాయి. ఆమె ఉక్కిరిబిక్కిరవుతోంది.

ప్రసాద్ తన సమాజ సభ్యులందర్నీ సమావేశపరచి రాధిక సహాయార్థం తను తలపెట్టిన ప్రోగ్రాంగురించి వివరించాడు. బాధ్యతంతా తను తీసుకుంటానని, నటించడం వరకే మిగతా సభ్యులు చెయ్యాల్సిన సహాయమని చెప్పాడు.

అందరూ సరేనన్నారు. రామరాజు, సుబ్బారావు సహాయం చేస్తామన్నారు.

ఆ రోజు టౌన్ హాల్ జనంతో క్రిక్కిరిసిపోయింది. అంతమందిని చూసిన ప్రసాద్‌కి మంచి నాటకం వేస్తే తెలుగు ప్రేక్షకులు తప్పక చూస్తారని అనిపించింది.




నాటక ప్రదర్శన విజయవంతంగా ముగిసింది. అంతకు ముందు రెండుసార్లు వేసినదే కావడం మూలంగా, నటులందరూ చక్కగా నటించారు. ప్రేక్షకులు తృప్తితో తిరిగి వెళ్ళారు.

అందరికీ అభినందన పరంపర...

గ్రీన్‌రూంలో సామాన్లు సర్దుకుంటున్న ప్రసాద్ అలికిడైతే అటుగా చూశాడు.

రాధిక...

అతనికేసి కృతజ్ఞతా భావంతో, గౌరవ భావంతో చూస్తూ అతనివేపే వస్తోంది.

"నా కోసం ఇంత కష్టపడ్డ నీ ఋణం ఎలా తీర్చుకోను?"

ఆ మాటల్లో చేతల్లో కృతజ్ఞతా భావం.

"గొప్పగా పొగడకు నే చేసింది చాలా తక్కువ."

ఆమె చటుక్కున వంగి అతని కాళ్ళకు నమస్కారం చేసింది. అతను నివ్వెరపోయాడు.

"సుఖంగా ఉండమ్మా!" ఆమెను భుజాలు పట్టుకుని లేవదీస్తూ అన్నాడు.

ఆమె కళ్ళల్లో తడి, అతని గుండెల్లో ఆర్ద్రత.

"నేనంటే నీ కెందుకింత అభిమానం"

అతను సమాధానం చెప్పడానికి తడుముకున్నాడు.

ఎన్నో చెబ్దామనుకుని ఏమీ చెప్పలేక పోతున్నాడు.

కొంతమంది మనుషుల మీద ఏర్పడ్డ అభిమానాన్ని, ఇష్టాన్ని నిర్వచించడం, విడమరచి చెప్పడం, దానిక్కారణాలు చెప్పడం కష్టం.

ప్రసాద్ అదే పరిస్థితిలో పడ్డాడు.

మర్నాడుదయమే ప్రసాద్, రామరాజు కలిసి వెంకటరత్నం ఇంటికి వెళ్ళారు. అంతక్రితం రాత్రి ఇద్దరూ కూర్చుని ప్రోగ్రాంకి అయిన ఖర్చులు, రాబడుల వివరాలు తేల్చారు. అంతా పోను ఎనిమిది వందలు మిగిలాయి. డబ్బు రూపంలో ఇస్తే వెంకటరత్నం వారం తిరక్కుండా వ్యసనాలకి తగలబెట్టేస్తాడని ఇద్దరికీ తెలుసు. వాళ్ళకిచ్చే సహాయం వస్తురూపంలో ఇవ్వాలని ప్రసాద్ చెప్పాడు. ఆ సలహా రాజుకి నచ్చింది.

రాధిక బట్టల్లేక బాధపడుతోంది. కాబట్టి ఆమెకు మూడు చీరలు, వెంకటరత్నానికి మూడు లుంగీలు, మూడు చొక్కా గుడ్డలు కొన్నారు. ఓ బస్తా బియ్యం కొన్నారు. ఇవన్నీ పోను రెండు వందల రూపాయల రొఖ్ఖం మిగిలింది.

ప్రసాద్ దూరదృష్టికి రాధిక మనసులోనే జోహార్లర్పించింది. తన చీరలు సెలక్టు చెయ్యడంలో అతని నైపుణ్యాన్ని మెచ్చుకోకుండా ఉండలేకపోయింది. చివర్న ఓ పాకెట్ అందిస్తూ "ఇది నా తరఫున నీకు బహుమానం. ప్రోగ్రాం డబ్బుల్లోది కాదు" అన్నాడు.

రాధిక ఆత్రంగా పేకెట్ విప్పి చూసింది.

చిన్న చిన్న ఎర్రపూలున్న చీర...

ఆమెను పాతజ్ఞాపకాలు చుట్టుముట్టాయి. నాటకాలు మానెయ్యమని మోహన్ కొన్న చీర.. తను వచ్చేసేటప్పుడు తెచ్చుకోలేదు. అదే ఆఖరు. ఆ తర్వాత అతను ఆమెతో మాట్లాడలేదు. అన్నయ్య గుర్తుకొచ్చాడు. ఆలోచిస్తూ ఉండిపోయింది.

"ఏం ఆ చీర నచ్చలేదా ?" ఆమె ఆలోచనలు అర్థంకాక ప్రసాద్ అడిగాడు.

"ఎందుకు నచ్చలేదూ !? చక్కగా ఉంది" అంది.



ఆమె అతనికి తన కృతజ్ఞత తెలియ చేద్దామనుకుంది. రామరాజు, తండ్రి సమక్షంలో ఏమీ మాట్లాడలేకపోయింది.

ప్రసాద్ చేసినపని వెంకటరత్నానికి నచ్చలేదు. కోపాన్ని దాచుకున్నాడు. అతను మొత్తం డబ్బు రూపంలో ఇస్తాడని ఆశపడ్డాడు. దానికి సరిపడ బడ్జెట్ కూడా సిద్ధం చేసాడు.

"ఇయన్నీ కొన్నా రెందుకు? మొత్తం డబ్బు ఇచ్చేస్తే మేలు. ఏదో ఒకటి చేసుకునేవాళ్ళం కదా !"

ఆ మాటలు ఊహించని రామరాజు ప్రసాద్ ముఖంలోకి చూశాడు. ప్రసాద్ చిరాకుని ముఖంమీద కనబర్చకుండా దాచుకుంటున్నాడు. తనకా మాటలు నచ్చకపోయినా తలవంచుక్కూర్చుంది రాధిక.

ప్రసాద్, రాజు వెళ్ళడానికి లేచారు.

"మా నాన్న ధోరణి అంతే! నువ్వేం అనుకోకు. ప్లీజ్!" అన్నట్టు చూసింది రాధిక.

ఆ చూపుల్లోని భావాల్ని చదివాడతను.

అర్థమైనట్టుగా నవ్వాడు.




మార్పు సహజం.

ప్రతి మనిషికీ జీవితం అనుకోని మలుపులు తిరుగుతుంది. ఆ మలుపుల వల్ల వ్యక్తి జీవితంలో ఎంతో మార్పు వస్తుంది.

నాటకాల్లో మంచి పేరు తెచ్చుకుని, మంచి నటిగా గుర్తింపు పొంది, ఎవరి అభిమానం, ఆప్యాయత పొందని సమయంలో ప్రసాద్ పరిచయమై చెదిరిన మనసుని కూడగట్టుకుని భవిష్యత్తుమీద ఆశ కన్నులుంచిన రాధిక జీవితం ఓ కొత్త మలుపు తిరిగింది.

వెంకటరత్నం చచ్చిపోయాడు.

కొడుకు నుంచి వేరు పడ్డాక అతను విచ్చలవిడి జీవితానికి అలవాటు పడ్డాడు. మందులు వాడటం మానేసి 'మందు' వాడకం ఎక్కువ చేసి, బ్రాకెట్ నంబర్ల కోసం నిద్ర పాడుచేసుకుని అశ్రద్ధ చేశాడు. రోగం తిరగబెట్టింది.

ఓరోజు పొద్దున్నే స్పృహ కోల్పోయాడు. రాధిక కంగారుగా వెళ్ళి పుణ్యమూర్తిని పిలిచింది. అతను వచ్చి రిక్షాలో వెంకటరత్నాన్ని హాస్పిటల్‌కి తీసికెళ్ళాడు.

వార్త విన్న మోహన్ హాస్పిటల్‌కి వెళ్ళాడు. డాక్టర్ అతనితో మళ్ళీ పక్షవాతం వచ్చిందని, అతను బతికే అవకాశాలు తక్కువని, తిరిగి స్పృహ రావడం కూడా కష్టమని చెప్పాడు.

డాక్టర్ చెప్పింది నిజమైంది. వెంకటరత్నం వారం రోజుల పాటు స్పృహ లేకుండా కోమాలో వుండి చనిపోయాడు.

రాధిక గుండెలు పగిలేటట్టు ఏడ్చింది.

తండ్రి మరణంతో ఆమె దిక్కులేని దానిలా, ప్రపంచమంతా చీకటయిపోయినట్టు ఫీలయ్యింది.

అన్నగార్ని కాదని తండ్రితో బైటికి వచ్చేసింది. తండ్రి పద్ధతులు ఆమెకు

నచ్చకపోయినా అతనితో ఉండిపోయింది. తనకో పెద్దదిక్కు వున్నాడన్న ఆశ లేకుండాపోయింది. తండ్రిని అసహ్యించు కున్న క్షణాలు, అతనిమీదజుగుప్స పెంచు కున్న క్షణాలు చాలానే వున్నాయి.

అయినా అతని మరణం ఆమెకు జీవితంలో వెలితిని సృష్టించింది. ఆమెకు దిక్కు తోచలేదు. అన్నగారి ఆదరణ లభిసుందన్న ఆశ ఆమెకులేదు. ఓరకంగా తండ్రి ఆమెను కష్టాల సడి సముద్రంలో వదిలేసి వెళ్ళాడు.

తన జీవితపు తరువాతి ఘట్టం ఏమిటి? ఏమో! ఆమెకే తెలియదు. గొప్ప సస్పెన్స్... తను ఏం చెయ్యాలి? ఏం చెయ్యకూడదు?

తండ్రి పోయాడన్న బాధ కొంత, ఎదురుగా కనబడే సమస్యలకు పరిష్కారం ఏమిటోనన్న బాధ కొంత. ఆమెకు మనసు మొద్దుబారిపోయింది. జీవం లేని తండ్రిని హాస్పిటల్నుంచి మోహన్ తనఇంటికి తీసికెడుతున్నపుడు రాధిక కూడా వెళ్ళింది. మోహన్ రమ్మనలేదు. వద్దనీ అనలేదు.

ఆనాటినుంచి పదిరోజుల కర్మ అయ్యే వరకు మోహన్ ఆమెతో మాట్లాడలేదు. అది యాదృచ్ఛికమో, లేక కావాలని అతను మాట్లాడలేదో ఆమెకు తెలియదు.

మర్నాడు "చిట్టి" అని అన్నగారు పిల్చిన పిలుపుకి ఆమె తుళ్ళిపడింది. అదే ఆప్యాయత. అదే ఆత్మీయత. మెల్లగా పారుతున్న సెలయేటిలా ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు ఉబికి వచ్చాయి. వెళ్ళి అతని పక్కనే చాపమీద కూర్చుంది. అతనామె మొహంలోకి చూశాడు. ఆమెకో పక్క ఆనందంగాను, మరోపక్క భయంగాను వుంది.

అతని కళ్ళకామె బాగా చిక్కి పోయినట్టు కనిపించింది. గడచిన పది రోజుల్లో ఆమె గురించి పట్టించుకోనందుకు అతను బాధ పడ్డాడు.

"నిన్ను నాప్రాణంలా చూసుకున్నాను. నన్ను కాదని నాటకాలు వెయ్యడానికి వెళ్ళిపోయేవు. జరిగిందేదో జరిగిపోయింది. ఆ సమస్యకు కారణమైన నాన్న ఇప్పుడు లేడు......"

అతను చెప్పడం పూర్తి కాకుండానే 'నాన్న' అన్న మాటలు విన్న రాధిక రెండు చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడవటం మొదలెట్టింది. ఏడుపు కన్నతల్లిలా ఆమెను కౌగలించుకుంది.

మోహన్‌కి కళ్ళు చెమ్మగిల్లాయి. ఆమె మీద జాలి కలిగింది. ఆమె తలమీద చెయ్యివేసి నిమురుతూ ఆమెను ఓదార్చ బోయాడు. ఆమె అతని ఒళ్ళో తల పెట్టుకుని బావురుమంది.

రాధిక దుఃఖంలోంచి తెప్పరిల్లే సరికి చాలాసేపు పట్టింది.

"పోయిన నాన్నను తిరిగి తీసుక రాలేను. నీకేలోటూ రాకుండా చూసు కుంటాను."

ఆమె మనసు తేలికపడింది.

"కాని నాటకాలు మానెయ్యాలి. పంతంకొద్దీ నేనిలా అనడంలేదు. నాటకాల సాధక బాధకాలు ఏమిటో నీకు విడమర్చి చెప్పాను."

ఆమె మౌనంగా వింటోంది.

"నీకు నాటకాలే కావాలో, నేను కావాలో నిర్ణయించుకుని వారం రోజుల్లో చెప్పు. త్వరలో నీకు పెళ్ళిచేసి పంపిస్తాను."

అతనామె ముఖంలోకి చూస్తున్నాడు.

"నీమంచి నాకన్నా ఎక్కువ చూసే

వాళ్ళెవరూ ఉండరు. ఒకవేళ ఉన్నా నేను చెప్పిందే మంచిదంటారు.''

ఆమె చటుక్కున అతని ముఖంలోకి చూసింది.

అతను అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయాడు.

ప్రసాద్‌కి వెంకటరత్నం పోయిన విషయం ఆలస్యంగా తెలిసింది. వెంటనే లైబ్రేరీ వచ్చాడు. రాధికను చూడాలని, పరామర్శించాలని అతను ఆత్రపడ్డాడు. కాని ఎలా?

మోహన్‌కి నాటకాలన్నా, నాటక జనమన్నా ఇష్టముండదని [illegible] పైగా తండ్రి పోయాక అన్నా [illegible] సంబంధ బాంధవ్యాలు ఎలా ఉన్నాయో అతనికి తెలియదు. తీరా ఆమెను పలకరించడానికి వెళ్ళి మోహన్‌చేత మాటలు పడటమో లేక ఆమెకు చీవాట్లు పెట్టించడమో అతనికిష్టంలేదు. కష్టంలో వున్న ఆత్మీయురాల్ని ఓదార్చడం తన కర్తవ్యమని మరో మూల అనిపిస్తోంది.



తన ధైర్యవచనాలు, పరామర్శ ఆమెమీద గొప్పగా పని చేస్తాయని అతనికి తెలుసు. ఆలోచించగా అతనికి ఓ దారి కనబడింది.

పుణ్యమూర్తి ఇంటికెళ్ళి అతనితో తను వచ్చిన పని చెప్పి రాధికను కలవడానికి తనకున్న ఇబ్బందులు వివరించి చెప్పాడు. ప్రసాద్ మాటల్ని పుణ్యమూర్తి సరిగా అర్థం చేసుకున్నాడు. రాధికను పిల్చుకు రమ్మని తన చిన్న కూతుర్ని పంపాడు.

ప్రసాద్‌ని చూడగానే రాధికకు దుఃఖం వరదలా పొంగింది. "మా నాన్న లేడు" చిన్నపిల్లలా చెప్పి ఘొల్లుమంది. ప్రసాద్‌కి కళ్ళనీళ్ళు తిరిగాయి. ఆమెను ఓదార్చి ధైర్యం చెప్పాడు.

మరో నాల్గు రోజుల తర్వాత మళ్ళీ పుణ్యమూర్తి ఇంటి కెళ్ళి రాధికనుపిలిపించి మాట్లాడి వచ్చాడు ప్రసాద్.

మూడోసారి ఆమెను చూడ్డానికి వెళ్ళినప్పుడు, తన అన్నగారు తనతో మాట్లాడిన విషయాలన్నీ ప్రసాద్‌కి వివరించి చెప్పింది రాధిక.

ప్రసాద్‌కి ఆనందం కలిగింది. ఆమె సమస్యకు తను కోరుకున్న పరిష్కారం దొరుకుతోందనిపించింది.

"మీ అన్నయ్య చెప్పింది చెయ్యి. అతను కష్ట పెట్టుకోకుండా నిన్ను ఆదరిస్తున్నాడు. నువ్వు నిజంగా అదృష్టవంతురాలివి" అన్నాడు ప్రసాద్.

"నాటకాలు మానెయ్యమంటావా?"

రాధిక ప్రశ్నతో ఆమె ఏం నిర్ణయించుకోవాలో తెలియని పరిస్థితిలో వుందని అర్థమైంది.

నాటకం ఓ పిచ్చని అతనికి తెలుసు. ఆ రంగంలోనే ఉండదలిస్తే ఆమె జీవితం పాడవుతుందని అతనికి బాగా తెలుసు. అమెనా ఆకర్షణ నుంచి మానసికంగా బైటికి తీసుకురావాలనిపించింది. తన అభిప్రాయాన్ని, సలహాని నాన్చకుండా నిక్కచ్చిగా చెప్పాలనుకున్నాడు.

"ఇంకా ఆలోచిస్తున్నావా? వద్దు. నాటకాలు మానేసి మీ అన్నయ్య చెప్పినట్టు విను. నాటకరంగంలో రామరాజులకన్నా' వరహాలరావు లాంటి రావణాసురుళ్ళే ఎక్కువ. నిన్ను వంచించాలని, పాడు చెయ్యాలని చూస్తారు. ఇన్నాళ్ళు నీకు రక్షణగా మీ నాన్న ఉన్నాడు..."

ఆమె మధ్యలో ఏదో చెప్పబోయింది.

"నువ్వేం చెప్తావో నాకర్థమైంది. 'నేను జాగ్రత్తగా ఉంటాను కదా!' అని. ఆ ఆత్మవిశ్వాసం చివరిదాకా వుండదు. అవసరం మనిషి నమ్మకాన్ని వమ్ము చేస్తుంది. పరిస్థితులు మనిషి జీవితాన్ని నడిపిస్తాయి. నీ జీవితం హాయిగా గడపడానికి సరిపడ డబ్బు నాటకాల వల్ల రాదు. నిన్ను ఏదో రకంగా వంచించాలని, ఆకర్షించాలని చూస్తారు. అడుగడుగునా ముళ్ళకంచెలు. మనం ఎంత జాగ్రత్తగా దాటుకుని వెడుతున్నా ఏదో ఒక ముల్లు మనకి గుచ్చుకోక మానదు.

"వద్దు. మీ అన్నయ్య చెప్పింది విను. పెళ్ళి చేసుకుని హాయిగా కాపురం చేసుకో. అందులో వున్న సుఖం మరెందులోనూ లేదు"

ఆమె ఆలోచనలో ఉండిపోయింది.

"ఇంకేమీ ఆలోచించకు రాధికా! ఈ అవకాశం పోతే మళ్ళీ మంచి నిర్ణయం తీసుకునే అవకాశం ఏదీ నీకు రాక పోవచ్చు. నీ మంచి కోరి చెప్తున్నాను. నువ్వొకవేళ సినిమా తారనవుతానని ఆశ పడుతున్నావేమో. అది భ్రమ. ఆ రంగంలో నిచ్చెనల కన్నా, పాములే ఎక్కువ. ఒకవేళ పెద్ద నిచ్చెన ఎక్కినా





అప్పటికి ఎన్ని పాములో మింగుతాయి. నీ పవిత్రత బలి అయిపోతుంది"

చివరి మాటలంటున్నప్పుడు అతని కంఠం వణికింది. ఆమె చటుక్కున అతని ముఖంలోకి చూసింది.

"క్షమించు. నా ఆదుర్దా అర్థం చేసుకో. నేను చెప్పినవన్నీ బాగా ఆలోచించి నిర్ణయించుకో. నాటకాలేసే అమ్మాయంటే అందరికీ చులకనే. అందులోను ఇకముందు నువ్వు ఒంటరిదానివి. ఇప్పుడు నువ్వు తీసుకునే నిర్ణయంమీద నీ జీవితమంతా ఆధారపడి వుంటుంది"

ప్రసాద్ చెప్పినవన్నీ రాధిక జాగ్రత్తగా వింది. తన సలహా తప్పక వింటుందని అతను ఆశపడ్డాడు.

తర్వాత కలుస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

* * *

రాధిక ఆలోచిస్తోంది.

తను తీసుకునే నిర్ణయంమీద తన జీవితమంతా ఆధారపడివుందని ప్రసాద్ అన్న మాటలు మరీ మరీ జ్ఞాపకానికొస్తున్నాయి. అతనామె శ్రేయోభిలాషి. ఎంతో ఆలోచించి చెప్పాడు. మరి కొంతమంది ఆమెను నాటకాలు వెయ్యమని సలహా చెప్పారు. వారిలో కొందరు నటిగా ఆమెకు మంచి భవిష్యత్తు ఉందని నమ్మిన వాళ్లు. మరి కొంతమంది మంచి హీరోయిన్ కొరత ఏర్పడుతుందన్న ఉద్దేశంతో చెప్పారు.

ప్రసాద్ మాటలు ఆమె మీద బాగా పనిచేసినా, నాటకం వెయ్యాలన్న కోరిక ఆమె మనసులో ఓ మూల కదులూనే ఉంది. నాటకమనే కోమాలోంచి ఆమె ఆలోచనలు బైటికి రాలేకపోతున్నాయి.

అభినందనలు, చప్పట్లు, బహుమతులు, అందరితో చనువుగా మాట్లాడం, హాస్యం...ఎన్నో!

వరహాలరావు ఓ దూతను పంపాడు. తండ్రి పోయినందుకు ఆమె విచారించనక్కరలేదని, ఆమెను కంటిరెప్పలా చూసుకుంటానని, తన సమాజంలో చేరమని కబురంపాడు. 'ఆమెకు ఇష్టమైతే శాశ్వతంగా తన సమాజంలో, తనతో ఉండిపోవచ్చని' కూడా కబురంపాడు.

తనతో ఉండిపోవడమంటే ఏమిటో రాధికకు అర్థమైంది. అవసరమయితే ఆమెకు తాళి కట్టడానికి సిద్ధమని కూడా చెప్పమన్నాడు వరహాలరావు.

అయితే వరహాలరావు తనకి తెలీకుండానే రాధికకు గొప్ప ఉపకారం చేశాడు. అంతవరకు ఎటూ నిర్ణయించుకోలేని ఆమె వెంటనే నిర్ణయించుకుంది.

అలాంటి వెధవ సందేశాలు పంపవద్దని వరహాలరావుకి చెప్పమని తిరిగి కబురు పంపింది.

"నాటకాలు మానేసి నువ్వు చెప్పినట్టు విని నీతోనే ఉంటాను" అదే రోజు మోహన్‌తో చెప్పింది. అతనికి పెద్ద భారం దిగినట్టు రిలీఫ్ ఫీలయ్యాడు.

కొన్ని రోజుల తర్వాత ప్రసాద్ మళ్ళీ రాధికను కలిశాడు. ఆమె తీసుకున్న నిర్ణయానికి సంతోషపడ్డాడు. వరహాలరావు పంపిన కబురు విషయం విన్న అతను తను ఊహించినది నిజమైందనుకున్నాడు.

"నాకు హైదరాబాద్‌లో ఉద్యోగమొచ్చింది. నాలుగు రోజుల్లో బయల్దేరి వెడుతున్నాను" ప్రసాద్ మాటలు విన్న రాధికకు ఓ మూల సంతోషం కలిగినా మరో మూల బాధగా అనిపించింది. అతనింక తనకు కనబడడనిపించి కళ్ల

తడి అయ్యాయి.

జీవితం మనుషుల్ని తలో మూలకు విసిరేస్తుంది. దూరమైపోతున్నందుకు మనుషులు బాధపడతారు. కొన్నాళ్ళకి పరిస్థితులకు అలవాటుపడతారు.

"నువ్విఁక కనబడవంటేనే బాధగా వుంది. నా జీవితం మీద ఎవరూ చూపనంత ప్రభావాన్ని చూపావ్. కారుచీకట్లో కాంతిరేఖలా కనిపించి నాకు దారి చూపించావ్. నిన్ను ఎప్పటికీ మర్చిపోను. జీవితంలో మళ్ళీ ఎప్పుడు కలుస్తామో !" రాధిక కళ్ళు ఒత్తుకుంది.

ఆమె మాటలకు అతని మనసు అర్థమైంది.

"నేను ఇంటికి వచ్చినప్పుడల్లా నిన్ను కలిసే వెడతాను"

అతని కంఠంలో ఆనందం, బాధ నిండిన జీర.

పరిచయమైన కొద్దికాలంలోనే ఒకరి మీద ఒకరు అభిమానం పెంచుకుని ఆత్మీయత పెంపొందించుకున్నవాళ్లు విడిపోతున్నారు. ఇద్దరి మనసులు బాధతో మూగాయి.

"నువ్వు మళ్ళీ మీ అన్నయ్య పంచన చేరావ్. నాకదే సంతోషం. నీ జీవితం హాయిగా, ఆనందంగా ఉండాలని కోరుకుంటున్నాను" అన్నాడు ప్రసాద్ వెళ్ళిపోతూ.

ప్రసాద్ తాలూకు ఆలోచనలు, జ్ఞాపకాలు రాధిక మనసులో నిలిచిపోయాయి. అతన్ని తల్చుకున్నప్పుడల్లా ఆమె మనసు కృతజ్ఞతాభావంతో, ఆత్మీయతతో నిండిపోతోంది.

* * *

కాలం...... పరిగెడుతోంది.

తనతోపాటు మనుషుల్ని జీవితాల్ని పరుగెత్తిస్తోంది. కొందరి మరణంతో కొన్ని సమస్యలు ఉత్పన్నమౌతాయి. కొందరి మరణంతో కొన్ని సమస్యలు పరిష్కారమౌతాయి. వెంకటరత్నం మరణంతో మోహన్‌కి కొన్ని సమస్యలు పరిష్కారమయ్యాయి. అతను తండ్రితో ఎంతలా విభేదించినా అతని మరణానికి బాధపడక పోలేదు. పెద్ద దిక్కు లేదన్న బాధ మిగిలిపోయింది. తానే బేలపడితే తల్లి, మిగిలిన పిల్లలు మరీ బెంగపడతారని అతను సాధ్యమైనంత ధైర్యంగా ఉంటానికి ప్రయత్నిస్తున్నాడు.

ముఖ్యంగా తల్లినా వయసులో, ఆ పరిస్థితిలో చూడాల్సి వచ్చినందుకు అతనెక్కువ బాధపడ్డాడు. తన తండ్రివల్ల ఆమె సుఖపడింది తక్కువ. దరిద్రంలో చివరి అంచుల్ని చూసింది. ఆమె భర్త రాధికను తీసుకుని వేరే ఉండటం ఆమెకు మనస్తాపాన్ని కలిగించింది. కాని ఆమె భర్తనుకాని, కొడుకునుకాని ఏమీఅనలేదు. ఆమె నోరు తెరచి ఎప్పుడూ ఏదీ అడగదు.

తల్లి అమాయకత్వం మోహన్‌కి ఆమంటే గౌరవాన్ని, ఇష్టాన్ని పెంచింది. తండ్రి పోగానే తల్లి బాధపడకుండా చూడటం, ఆమెను సాధ్యమైనంత వరకు సుఖపెట్టడం తన విధి అనుకున్నాడు.

వెంకటరత్నం మరణం రాధిక సమస్యకు పరిష్కారం చూపించింది. కాక ఆమె నాటకాలు మానెయ్యడమొక్కటే పరిష్కారంకాదు. ఆమె పెళ్లి మరో సమస్య.

ఆమెకు వీలైనంత త్వరలో పెళ్ళి చేసి పంపాలని మోహన్ ఆలోచన. ఆమె నాటకాలు మానేసినా వాటి తాలూకు ఆలోచనల్నుంచి ఆమె త్వరగా బైట బైటపడలేదని అతనికి తెలుసు.




ఆమెకు పెళ్ళి చేస్తే ఆ ఆనందంలో సాంసారిక జీవితంలో పడి నాటకాల విషయం పూర్తిగా మర్చిపోతుందని అతని ఆలోచన. ఆమె పెళ్ళి విషయంలో అతను తొందర పడటానికి మరో కారణం వుంది.

సుబ్బరాజుగారికి వయసు మీరిన కారణంగా, ఆయన కొడుకులంతా ఉద్యోగాల్లో దూర ప్రదేశాల్లో ఉన్న కారణంగా ఆయన మెకానికల్ షెడ్ అమ్మేసే ప్రయత్నంలో వున్నారు. మోహన్ని నరసాపురంలో వున్న ఓ మెకానికల్ షెడ్ వాళ్ళు తమతో చేరమని అడుగుతున్నారు. జీతం ఎక్కువ ఇవ్వడమే కాకుండా లాభాల్లో చిన్న వాటా ఇస్తామంటున్నారు.

మోహన్ నరసాపురం వెళ్ళిపోడానికి నిర్ణయించుకున్నాడు. తెల్సున్న ప్రదేశం కావడం మూలంగా తాడేపల్లిగూడెంలో చెల్లెలి పెళ్ళి చేసేసి తర్వాత నరసాపురం మకాం మార్చెయ్యాలని అతని ఆలోచన.

రాధికకు సంబంధాలు చురుకుగా చూస్తున్నాడు.

* * *

రమణ ఫిట్టర్ కోర్సు చదువుకున్నాడు. పాలకొల్లు షుగర్ ఫ్యాక్టరీలో ఉద్యోగం. తర్వాత అతనికి ఫోర్మన్‌గా ప్రమోషన్ వచ్చింది. తల్లి పోయాక తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. వారెవరితోనూ అతనికి సంబంధాలు లేవు. ఉన్న ఒక్క చెల్లెలూ కాపురం చేసుకుంటోంది.

రమణ మంచివాడని అతన్ని తెల్సున్న వాళ్ళందరూ అంటారు. అతను మంచిగా ఆలోచిస్తాడు. మంచిగా మాట్లాడతాడు. డ్యూటీలో లేనప్పుడు మంచి బట్టలు కట్టుకుంటాడు. మంచి తెలివి తేటలున్నాయి.

మంచి కుటుంబంలోని మంచి పిల్ల దొరికితే పెళ్ళి చేసుకుందామని అతని ఆలోచన.

రమణకి కట్న కానుకల మీద ఆశ లేదు. డబ్బు మీద ఆశవుంటే అతను తండ్రి దగ్గరకెళ్ళి ఆస్తిలో వాటా ఇమ్మని అడిగేవాడు. అతను జీవితాన్నుంచి చాలా పాఠాలు నేర్చుకున్నాడు.

డబ్బు, ఆస్తి, సంపద...... వీటివల్ల దొరకనివి ఆప్యాయత, ప్రేమ, ఆదరణ అనేవి ఉన్నాయని- అవి దొరకనివాళ్ళ జీవితం వ్యర్థమని అతనో థియరీ ఏర్పాటు చేసుకున్నాడు.

కన్నతల్లి తనకి జ్ఞానం రాకుండానే చచ్చిపోయింది.ఆస్తివున్నా తండ్రి అతన్ని సుఖపెట్టలేకపోయాడు. కష్టం తెలియకుండా పెంచిన పినతల్లి అతని చేతిలో సుఖపడకుండానే పోయింది.

ఆప్యాయత చూపే కుటుంబంలో తనని ఆదరించి, ప్రేమించి, తనకోసం బతగ్గలిగే అమ్మాయి దొరికితే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

'అలాంటి అమ్మాయి ఎక్కడైనా ఉందా? ఉందా? ఉందా? ఉందా?'—

"ఉంది'' అన్నాడు స్నేహితుడు కేశవ. కేశవ అతనితోపాటు అదే ఫ్యాక్టరీలో పన్జేస్తున్నాడు.

కేశవకి మోహన్,అతని చెల్లెలు రాధిక తెలుసు. మోహన్ రాధిక పెళ్ళిచేసే ప్రయత్నంలో వున్నాడని కూడా తెలుసు.

రమణ కేశవతో కల్సివచ్చి రాధికను చూశాడు.

రమణకి రాధిక నచ్చింది. ఆమె

పెద్దకళ్ళు నచ్చాయి. ఆమె నవ్వునచ్చింది. వాళ్ళింట్లో చూపే ఆదరణ, ఆప్యాయత నచ్చాయి. చిన్నతనంలోనే పెద్దమనిషిలా బాధ్యతలు నిర్వహిస్తున్న మోహన్ నచ్చాడు.

రమణ రాధికను చూడగానే 'ఈమె నన్ను చేసుకుంటే బాగుండును' అనుకున్నాడు.

"నాకు మీ చెల్లెలు నచ్చింది. ఆమెక్కూడా ఇష్టమైతే తర్వాతి ఏర్పాట్లు చూడండి" అన్నాడు రమణ. ఆ మాటలు విన్న మోహన్ ఆనందానికి హద్దులేదు. రాధిక గుండెల్లో చిరుగంటలు మోగాయి. ఆమె తన ఇష్టాన్ని సిగ్గుతో కలగలిపి చెప్పింది.

''మేం కట్నకానుకలు ఎక్కువ ఇచ్చుకోలేం'' ఎపోలజిటిక్‌గా అన్నాడు మోహన్.

"నాక్కావల్సింది మీ చెల్లెలు, మీ ఆప్యాయత.''

రమణ ఖచ్చితంగా మాట్లాడటం మోహన్‌కి నచ్చింది.

కాని అతనికి అసలు సమస్య మనసులో మెదిలింది. అది రాధిక గతంగురించి. ఆమె పూర్వం నాటకాలు వేసేదని చెప్తే రమణ ఇష్టపడకపోవచ్చు. చెప్పకపోడం నేరం. రమణంత హృదయ పూర్వకంగా మాట్లాడుతుంటే తను దాపరికంలో ఉంచడం మంచిది కాదని పించింది మోహన్‌కి. తీరా పెళ్ళయ్యాక ఈవిషయం తెలిస్తే అతని మనస్తత్వం ఎలా వుంటుందో? వాళ్ళ మధ్య కలతలు, కన్నీళ్ళు...

''మీ మనస్తత్వం నాకు నచ్చింది. మీకో విషయం స్పష్టంగా చెప్పాలను కుంటున్నాను'' మోహన్ చెప్పడం ఆపాడు.

''మీ చెల్లెలు ఇంతకు ముందు నాటకాలు వేసేది. అదే కదా! కేశవ నాకు ముందే చెప్పాడు. మీ నాన్నగారి ఇష్టప్రకారం అలాచేసి ఉంటుంది. మానేసింది కదా ఫరవాలేదు. ఇకముందు వెయ్యడం నాకూ ఇష్టంలేదు.''

రాధిక ఓరకంటితో చూస్తూ అతని మాటలు వింది. అది రమణ కనిపెట్టాడు.

మోహన్ రమణ విశాల హృదయానికి, నిక్కచ్చిగా మాట్లాడే తత్వానికీ, సరదాగా ఉండే అతని మనస్తత్వానికి మనసులో జోహార్లు చెప్పకుండా ఉండలేకపోయాడు. ఆనందంతో అతను తబ్బిబ్బయిపోయేడు.

లోకంలో చెడే కాదు మంచి కూడా ఉందనిపించింది.

రాధిక అదృష్టవంతురాలు...

ఆ మాట చాలామంది అన్నారు. బంధువులు, తెల్సున్నవాళ్ళు ఎందరో...

''నేనెంత అదృష్టవంతురాల్ని !'' రాధిక కూడా చాలాసార్లు అనుకుంది.

ఆకాశమంత పందిరి, భూదేవంత మంటపం వెయ్యకపోయినా తన తాహతుకి తగ్గట్టు మోహన్ ఆమె పెళ్ళి ఘనంగా జరిపించాడు.

తన చెల్లెలి పెళ్ళి కుదిరిందని చెప్పడానికి వెడితే శర్మగారు వెయ్యి రూపాయలిచ్చారు. ''మీ నాన్న ఉద్యోగం మానేసి నప్పుడే ఇద్దామనుకున్నాను. ఇస్తే తగలేస్తాడని ఇవ్వలేదు. తండ్రిపోయి అర్నెల్లు తిరక్కుండానే చెల్లెలి పెళ్ళి జరిపిస్తున్నావ్. ప్రయోజకుడివి" అని అభినందించారు.

తను పనిచేస్తున్న షెడ్ ఓనర్ సుబ్బరాజుగారు వెయ్యి రూపాయలిచ్చారు.





అతనికి తెల్సున్న లారీ ఓనర్లు, ట్రాక్టర్ ఓనర్లు సాయపడ్డారు. తను దాచుకున్న డబ్బు కొంత వుంది. మరికొంత అప్పు చేసాడు.

చెల్లెలికి కట్నంగా ఇద్దామనుకున్న డబ్బు పెట్టి ఆమె సంసారానిక్కావల్సిన వస్తువులన్నీ కొన్నాడు. చెల్లెలి పెళ్ళి జరుగుతున్నపుడు తల్లి కళ్ళలో మెరిసిన మెరుపుకి అతను పొంగిపోయేడు.

ఆ రాత్రి...

రాధిక దాంపత్య జీవితంలో మొదటి రాత్రి.

తెల్లటి చీరలో, తల్లో మల్లెలతో, కళ్ళల్లో సిగ్గుతో రాధిక గదిలోకి అడుగు పెట్టింది.

ఆమె మనసులో ఓమూల భయంగాను, మరో మూల ఆరాటంగాను వుంది. పొందబోయే అనుభవం తాలూకు ఊహలు ఆమె మనసుని చుట్టుముట్టాయి. సిగ్గు, బిడియం,ఆడదనం కల్సి ఆమె అడుగుల్ని అదుపు చేసున్నాయి.

ప్రేమతో, ఆప్యాయతతో, అనురాగంతో, కృతజ్ఞతతో భర్తను చూడాలని పించినా తల ఎత్తడానికి ఆమెకు బెరుకుగా వుంది. రమణ భార్యకు దగ్గరగా వచ్చి ఆమె రెండు భుజాలు పట్టుకుని "ఎంత అందంగా ఉన్నావ్ రాధీ!'' అన్నాడు.

ఆ పిలుపుకి ఆమె గుండెల్లో గంటలు మోగాయి.

అతనామె ముఖాన్ని తన గుండెలకు హత్తుకున్నాడు. అతని స్పర్శ ఆమెను పులకింప చేస్తోంది. ఏవో అనుభూతుల్ని ఆమెలో ప్రేరేపింపచేస్తోంది.

ఒక్కసారిగా ఆమె మెదడులో నరమేదో కదిలింది. గతం జ్ఞాపకం వచ్చింది.

హాస్పిటల్ వాచ్‌మన్ రంగయ్య, సత్యం సమాజంలో రామేశం, వరహాల రావు... ఎన్నితోడేళ్ళ చూపులు, ఎన్ని పాము బుసలు, ఎన్ని సింహాల పంజాలు, ఎన్ని మృగాల తృష్ణ...

వీళ్ళంతా ఏదోరకంగా తమ కామపర మైన కోర్కెల్ని వెలిబుచ్చినవాళ్ళే. వ్యక్త పరచకుండా మనసులోనే మలిన శృంగార తృప్తి ననుభవించినవాళ్ళు. కోర్కెల చూపులతో చుట్టేసిన వాళ్ళు – ఎందరు? ఎందరు? ఎందరు?...

నాటకాలు వెయ్యడమేనా తను చేసిన పాపం? ఇంత ఆరాటపెడుతున్న ఈ అనుభవాన్ని తనకివ్వాలని ఎంత చవకగా ఆలోచించారు. ఆమె ఆలోచించలేక పోయింది.

ప్రసాద్ సలహా పాటించకపోతే ఎంత మంచి వ్యక్తిని, ఎంత మంచి జీవితాన్ని, ఎంత మంచి అనుభవాల అదృష్టాన్ని తను పోగొట్టుకునేది?

ఆమెకు ఏడుపు వచ్చింది. కారణం ఆమెకే తెలియదు.

భర్తను రెండు చేతులతో చుట్టేసి ఆమె ఏడవడం మొదలెట్టింది.

ఆమె ఏడుపు దీనంగా, అసహాయంగా, ఉంది.

రమణకేమీ అర్థంకాలేదు.

అతనామె గుండెల్లో తలవాల్చి ''రాధీ! ఏడవకు. నా జీవితమంతా కష్టాలే! నీ కౌగిట్లో సుఖపడతానని ఆశపడుతున్నాను. మనకింక కష్టాలుండవ్. మనం సుఖపడతాం. – అదీ ఈరోజునుంచే!'' అన్నాడు.

ఆమె గుండెలు సాంద్రత పొంది ఆరాటపడుతున్నాయి. ఆమె నవ్వింది. పుచ్చపువ్వులా వెన్నెల విరబూసినట్టు

నవ్వింది. ఆ నవ్వులో రమణకి కెంపులు, ముత్యాలు ఒలుకుతున్నట్టనిపించింది.

* * *

"మీ రిద్దరూ పాలు నీళ్ళల్లా కల్సిపోయి హాయిగా కాపురం చెయ్యండి."

రమణ, రాధికలను ఓ కవిగారు ఆశీర్వదించారు.

ఆర్నెల్ల దాంపత్య జీవితంలో వాళ్ళిద్దరూ అలాగే కల్సిపోయారు. వాళ్ళకి పగలుకి, రాత్రికి తేడా తెలియడం లేదు. అంచేత వాళ్ళకి చంద్రుడు పగలు కూడా ఉదయిస్తున్నాడు. రమణ సంవత్సరం మొత్తంలో వాడుకోవల్సిన శెలవులన్నీ పెళ్ళయిన మొదటి మూడు నెలల్లోనే వాడేసుకున్నాడు.

"శీతాకాలం ఎంత బాగుందో" అన్న



రమణ మార్చి దాటాక "వేసవి ఎంత బాగుంటుందో కదూ రాధీ'' అన్నాడు. ఆమె రెండింటికీ మరేనంది.

ఒకరంటే ఒకరికి అభిమానం, మోహం, ప్రేమ .... చిన్న చిన్న త్యాగాలు ... హుషారుగా గడిచి పోతున్నాయి రోజులు. నరసాపురం మకాం మార్చిన మోహన్ వీలైనప్పుడల్లా పాలకొల్లు వచ్చి చెల్లెల్ని, బావగార్ని చూసి వెడుతున్నాడు.

సంసారం సాఫీగా సాగుతున్న ఈ తరుణంలో రాధిక ఓ చిన్న సమస్య నెదుర్కోవల్సి వచ్చింది. ఆ సమస్య రమణే సృష్టించాడు.

అతను పన్జేస్తున్న ఫాక్టరీలో ఓ నాటక సమాజముంది. అందులో చక్కని నటులున్నారు, మంచి కార్యకర్తలున్నారు. దాని తరపున మూడు నెలలకో నాటకం వేస్తారు. రమణ నటుడు కాకపోయినా అందులో ఏక్టివ్ మెంబర్.

అన్ని నాటక సమాజాల్లో వున్నట్టే అందులోకూడా రెండు గ్రూపులున్నాయి. శ్రద్ధగా పన్జేసే సభ్యుడు కాబట్టి రమణ అందులో ఓ గ్రూపుకి సన్నిహితుడు.

ఆ నెలలో రమణ గ్రూపువాళ్ళు ఓ సాంఘిక నాటకం వెయ్యాలని నిర్ణయించుకున్నారు. ఓ వారం రోజుల పాటు రిహార్సల్ జరిగింది. అప్పటికే బోలెడు డబ్బు కూడా ఖర్చయింది. మరో పది రోజుల్లో నాటకముందనగా అందులో స్త్రీ పాత్ర వేస్తున్న నటి - తల్లి పోయిందని కబురందటంతో ఊర్వెళ్లిపోయింది. నాటకం వేస్తున్న వాళ్ళంతా దిక్కుతోచక బుర్రలు బద్దలు కొట్టుకుంటున్నారు.

నాటకం పడదన్న వార్త ఫాక్టరీ అంతా మొలాసెస్ వాసనలా వ్యాపించింది. అంతకు ముందు రొమ్ములు విరుచుక తిరిగిన వాళ్ళంతా తలలొంచుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. వ్యతిరేక వర్గం వారి ఆనందానికి హద్దేలేదు. మరో హీరోయిన్ కోసం వెతికారు. అది నాటక పరిషత్తుల సీజను కావడం వల్ల ఎవరూ దొరకలేదు. ఒకళ్ళిద్దరు ఉన్నా వాళ్ళంతా ముసలి వేషాలు వేసేవాళ్ళు.

వాళ్ళ నాటకంలోని స్త్రీ పాత్ర కాలేజీ అమ్మాయి. ఏం చెయ్యాలో ఎవరికీ అర్థం కాలేదు.

అర్జంటుగా ఆ వర్గం వాళ్ళంతా సమావేశమయ్యారు. "ఇది మన ప్రెస్టీజ్‌కి సంబంధించినది. ఈ నాటకం పడక పోయిందంటే మనమిక తలెత్తుకోలేం. దీని ప్రభావం వచ్చే నాటక సమితి ఎలక్షన్లో వుంటుంది."

సభ్యులంతా వెలిబుచ్చిన అభిప్రాయ సారాంశమిది. కాని ఏం చెయ్యాలా అన్నదే ఎవరికీ తట్టడంలేదు. రమణ మౌనంగా ఉన్నాడు. సభ్యులు వెలిబుచ్చిన అభిప్రాయాలతో అతను ఏకీభవిస్తున్నాడు. నిజమే! ఇది పరువు ప్రతిష్ఠల సమస్య.

అంతవరకూ గజిబిజిగా ఉన్న తన ఆలోచనల్ని ఓ క్రమంలో పెట్టాడు. అక్కడ సమావేశమైన వాళ్ళంతా యుద్ధం జరుగుతున్నప్పటి మిలిట్రీ అధికారుల్లా ఆందోళనగా, సీరియస్‌గా ఉన్నారు.

"ఈ నాటకం పడుతుంది. కంగారు పడకండి" అన్నాడు రమణ దీర్ఘనిశ్శబ్దాన్ని భేదిస్తూ.

అందరూ తలలెత్తి ఆ మాటలన్న రమణకేసి చూశారు.

"ఎలా ?" ఓ సభ్యుడు ఆత్రంగా అడిగాడు.





"ఇదే నాటకం. అనుకున్న రోజుకే..."

"మరి హీరోయిన్...?" నాటకం డైరెక్టర్ అడిగాడు.

"మా ఆవిడ వేస్తుంది" అతని మాటల్లో నిశ్చయత వుంది.

అంతా ఆశ్చర్యంగా చూశారు.

"వేళాకోళం కాదు. మా ఆవిడ పెళ్ళి కాని క్రితం నాటకాలు వేసేది. తర్వాత నాకిష్టం లేక మానిపించేసాను. ఈ ఒక్కసారికి వెయ్యమని అడిగి ఒప్పిస్తాను. రేపట్నుంచి రిహార్సల్ మొదలెట్టండి."

రమణ చెప్పడం పూర్తి చెయ్యగానే నాటకం డైరెక్టర్ అతని దగ్గరకెళ్ళి "పరువు నిలబెట్టావురా!" అన్నాడు.

* * *

"మీరు మతి ఉండే మాట్లాడుతున్నారా ?"

పది నిమిషాల్లో రాధిక భర్తను మూడోసారి అడిగింది. రమణ బతిమాలుతున్నట్టు ముఖం పెట్టి నవ్వుతున్నాడు. ఆ నవ్వు రాధికకు కోపం తెప్పించింది.

"మీరేమైనా చెప్పండి. నేను మాత్రం నాటకం వెయ్యను"

అతను బిక్క మొహం పెట్టాడు.

"అలా అంటే ఎలా రాధీ! ఇది నా పరువు ప్రతిష్టల సమస్య. నాదే కాదు నా స్నేహితులందరిదీ. అందుకే మాటిచ్చాను. ఈ ఒక్కసారికి. ప్లీజ్! కాదనకు."

రమణ బతిమాలాడు.

"ఎవర్నడిగిచ్చారు మాట. కాలున్న పెనంమీంచి బైట పడ్డానని సంతోషిస్తున్నాను. మళ్ళీ నిప్పుల్లో దూకలేను. నేను వెయ్యనుగాక వెయ్యను."

అతని మాటలకామె లొంగలేదు. అతనామె గడ్డం పట్టుకుని అడిగాడు. ఇంకెప్పుడూ అడగనన్నాడు. ఈసారికి గండం నుంచి బైట పడెయ్యమన్నాడు. ఇంకెప్పుడూ ఆమె విషయం ఆమెనడక్కుండా నిర్ణయించనన్నాడు. ఏవేవో అన్నాడు.

"నాటకం ఓ పిచ్చండీ! అది పట్టుకుంటే వదలదు. అదో మత్తు. నేను నా మనసుని ఎలాగో దాన్నుంచి తప్పించుకున్నాను. మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నాక నాకా ఆలోచనే రాలేదు. జీవితం హాయిగా ఉంది. ఎందుకు మళ్ళీ లేనిపోనివి?"

"ఈ ఒక్కసారే కదా !"

అతని మాటలకామె నవ్వింది. ఆమె కాస్త మెత్తబడినట్టు కనిపించింది రమణకి.

"మీరు ఈ ఒక్కసారే కదా అంటారు. నాకు మళ్ళీ మనసు అటు పడిందంటే మరల్చుకోడం కష్టం. అప్పుడింక మన మధ్య గొడవలు, కలతలు ... ఎందుకు చెప్పండీ బాధంతా?"

"నా స్నేహితులంతా నన్ను పెళ్ళాన్ని ఒప్పించలేని దద్దమ్మననుకుంటారు. నీ మనసు నాటకాల వైపు పోకుండా నా మనసుకి కట్టేసుకుంటా కదా!" తన మాటలకి తనే నవ్వుకున్నాడు.

"మీకు వేళాకోళంగా ఉంది. ఇంకెప్పుడూ ఇలా చెయ్యకండి. ఈసారికి మీ పరువు నిలబెట్టడానికి ఒప్పుకుంటున్నాను."

ఆమె మాటలకు రమణ పొంగిపోయాడు.

ఆమెను తన చేతులతో చుట్టేసి ఆమె నుదుటిపై తన పెదవులతో చంద్రవంకల్ని సృష్టించాడు.

* * *

రమణ స్నేహితుల ఉత్సాహానికీ, ఆనందానికీ హద్దులేదు. పరువు, ప్రతిష్ఠలు నిలబడ్డాయన్న భావంతో వాళ్ళంతా

గర్వంగా ఉన్నారు. వేళ్ళాడేసిన తలలు మళ్ళీ లేచి నిలబడ్డాయి.

మర్నాడే రిహార్సల్ మొదలెట్టారు. నాటక ప్రదర్శన ఏర్పాట్లు పెద్ద అట్టహాసంతో చేస్తున్నారు. పేపర్లు పంచిపెట్టారు. పోస్టర్లు వేశారు. పాలకొల్లులో ఏ మూల చూసినా 'మహోజ్వల సాంఘిక నాటకం' అన్న పోస్టరు కనబడేటట్టు అతికించారు.

పోష్టర్లమీద, కరపత్రాలమీద మహానటి శ్రీమతి రాధిక ప్రత్యేక ప్రదర్శన అని రాశారు. రిహార్సల్‌లో రాధికకు ఇబ్బందులేమీ లేవు. మిగతా నటులు, దర్శకుడు అంతా రమణ స్నేహితులు కావడం మూలంగా అందరూ ఆమెను గౌరవంగా చూస్తున్నారు. ముఖ్యంగా ఆమె తమని కష్టకాలంలో ఆదుకుందన్న భావం వాళ్ళ మాటల్లో, ప్రవర్తనలో కనిపిస్తోంది.

రాధిక తన మనసును అదుపులో పెట్టుకుంటోంది. మళ్ళీ జనం, చప్పట్లు, ఈలలు, అభినందనలు ... వీటికి లొంగిపోకుండా ఉండాలని తాపత్రయ పడుతోంది. 'నేను నటించేది ఈ ఒక్కసారికే'అని పదే పదే గుర్తుచేసుకుంటోంది.

ప్రదర్శనరోజు దగ్గర పడుతున్న కొద్దీ చక్కని ప్రదర్శన ఇవ్వగలమన్న ధైర్యం రాధికకు, మిగతావారికి కలుగుతోంది. రమణ ఆమెను ఉత్సాహపరుస్తున్నాడు.

ప్రదర్శన ఎంత త్వరగా అయిపో తుందాసని ఆమె రోజులు లెఖ్ఖపెట్టు కుంటోంది. వాళ్ళ దినచర్యలో మార్పు వచ్చింది. ఒకరి కోసం ఒకరు సమయం ఖర్చు పెట్టలేకపోతున్నారు. ఒకే ఇంట్లో వుంటున్నా మనసుల్లో ఎంతో దూరంగా వుంటున్నట్టు ఫీలవుతున్నారు. నాటకం త్వరగా ముగియాలని కోరుకుంటున్నారు. ఇంక కొద్ది రోజులే కదా అని సరిపెట్టు కుంటున్నారు.

*　　*　　*

''నువ్వు చెప్పేది నిజమా?'' వరహాలరావు నమ్మలేనట్టుగా అడిగాడు.

''నిజమే! నేను పోష్టరు కూడా చూశాను. ఖచ్చితంగా ఆ అమ్మాయి వెంకటరత్నం కూతురే అయ్యుంటుంది'' శిష్యుడు సమాధానం చెప్పాడు

ఎప్పుడు? ఎలా? ఎక్కడ? ఎందుకు?

''పాలకొల్లులో... పదో తారీఖున.''

''అది నాటకాలు మానేసి పెళ్ళిచేసుకుంది కదా? మళ్ళీ ఎందుకు వేస్తోంది ?''

వరహాలరావు ప్రశ్నకి సమాధానం శిష్యుడి దగ్గరలేదు. మొత్తం వివరాలు సేకరించే బాధ్యతను తనమీద వేసుకున్నాడు. తన దూరపు బంధువొకడు పాలకొల్లుషుగర్‌ఫాక్టరీలో పనిచేస్తున్నాడని, అతనిద్వారా విషయాలన్నీ తెల్సుకుంటానని మాట ఇచ్చి వరహాలరావు ఇచ్చిన డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు.

వరహాలరావు బుర్ర చురుకుగా పనిచేస్తోంది.

రాధిక ఆ రాత్రి తనని కాదన్నప్పట్నుంచి అతనికి అవమానంగా ఉంది. ఆమె తిరస్కారం అతను సహించలేకపోయాడు. అఫ్టరాల్ ఓ ఆడపిల్ల దగ్గర ఓడిపోయానన్న భావం అతనిలో అప్పుడప్పుడు రగులుకుని మనశ్శాంతి లేకుండా చేస్తోంది.

ఆమె తండ్రి పోయినప్పుడు 'తనతో ఉండమని' కబురంపిస్తే ఆమె తిరస్కరించడమే గాకుండా - అలాంటి కబుర్లు పంపవద్దని, మరీ తల బిరుసుగా వ్యవహ

రిస్తే ఆ తల తీసెయ్యగల అన్నయ్య నాకున్నాడు అని ఆమెతిరిగి కబురంపింది.

అతని అవమానం పెరిగి పెద్దదై కక్షగా మారింది. "ఎంత పొగరు- అ లం..." అనుకున్నాడతను.

తన శిష్యుడు చెప్పింది విన్నాక అతనికి ప్రతీకారం తీర్చుకునే అవకాశం వచ్చినట్లు లీలగా అనిపించింది. అతని తెలివి తేటలు, అతని మెదడుకున్న చురుకుదనం పనిచేయనారంభించాయి.

మెరుపులాంటి ఆలోచన వచ్చింది. వచ్చిన అవకాశాన్ని మంచికైనా, చెడుకైనా ఉపయోగించుకోడం వరహాల రావులోని ప్రత్యేకత. శిష్యుడు ఎప్పటి కప్పుడు సమాచారం సేకరించి అందిస్తూనే ఉన్నాడు. ఆమె ఎందువల్ల ఏపరిస్థితుల్లో నాటకం వేస్తోందో వివరించి చెప్పాడు వాడు.

వరహాలరావు ఏ విషయంలోను తొందరపడడు. తాపీగా ఆలోచించి పథకం ప్రకారం పంజా విసురుతాడు. అతను జీవితంలో పైకి రావడానికి అదే కారణమని అతనికి గొప్ప నమ్మకం.

శిష్యుడికి కొన్ని పనులు అప్పగించి వరహాలరావు ఆలోచనలో పడిపోయాడు.

* * *

షుగర్ ఫాక్టరీ వాళ్ళ నాటకం ముగిసింది.

ప్రత్యర్థివర్గంవాళ్ళు తలలొంచు కున్నారు. తమ పరువు కాపాడినందుకు అందరూ రాధికను అభినందించి, కృతజ్ఞతలు తెలియజేసారు. సభ్యుల తరఫున డైరెక్టర్ ఆమెకు వెండి కుంకుమ భరిణి బహూకరించాడు.

ఆ రాత్రి భోజనాలయ్యాక-

"రాధీ! వాళ్ళంతా కృతజ్ఞతలు మాటల్లో చెప్పారు. మరి నేనెలా చెప్పాలి" అన్నాడు రమణ.

రాధిక కళ్ళు మెరుస్తున్నాయి. రమణ కామెలో కొత్త అందాలు కనిపించాయి. అతనామె కళ్ళల్లోకి గుచ్చి చూశాడు. ఆమె సిగ్గుతో ముఖాన్ని అతని గుండెల్లో దాచుకుంది.

* * *

శిష్యుడు చెప్పింది విని వరహాలరావు ఆనందపడ్డాడు. ఏ రకంగా ఆలోచించినా పథకం విజయవంతమయ్యే అవకాశాలే ఎక్కువ కనిపిస్తున్నాయి.

"దాని మొగుణ్ని ట్రైనింగు కోసం ఫాక్టరీలో వాళ్ళు మద్రాసు పంపారు"

"అవునండి."

"వాడు ఇరవై రోజుల దాకా రాడు."

"చిత్తం రాడండి."

"అది హిందీ పరీక్షలకి చదవడానికి పాలకొల్లులోనే వుంటుందా?"

"అవును. ఉంటుంది."

"దానికి తోడుగా దాని తల్లి ఉందా?"

"మరేనండి."

"ఈ [illegible]."

శిష్యుడికి అర్థం కాలేదు.

"మంచి సమాచారం తెచ్చావ్ ఇదిగో పుంచు."

వరహాలరావిచ్చిన నోట్లు తీసుకుని శిష్యుడు వెళ్ళిపోయాడు.

[illegible] తన గదిలో అద్దంలో చూసుకుంటూ ఆలోచిస్తున్నాడు వరహాల రావు. ఆ అద్దం మీద అతనికో సెంటి మెంటు వుంది. తన పథకం పారితే ఆమె మీద తనపగ తీరుతుంది. అంతేకాదు. మళ్ళీ ఎప్పటికైనా ఆమె తనతో నాటకాలు వెయ్యడానికి తన దగ్గరకొచ్చి తనకాళ్ళ మీద పడే అవకాశం కూడా ఉంది.



అప్పుడిహ ఆ అద్దం నిరాశ పడక్కర్లేదు. రాధిక నగ్న స్వరూపాన్ని తనలో ప్రతిబింబించే అవకాశం దానికి వస్తుంది.

వరహాలరావు చిన్నగా నవ్వుకున్నాడు.

ఆరోజే వరహాలరావు పాలకొల్లు ప్రయాణమై వెళ్ళాడు. బస్సు దిగి హుటాహుటిన రిక్షాలో వర్మ ఇంటికెళ్ళాడు.

వర్మ డ్రామా కాంట్రాక్టర్. మంచి నాటకాల ప్రదర్శన ఏర్పాటు చేసి టిక్కెట్లు అమ్ముకుంటాడు. ప్రోగ్రాం వేసిన ట్రూప్‌కి తను మాట్లాడిన మొత్తం ఇచ్చేసి మిగిలిన లాభ నష్టాలు అతను పొందుతాడు.

అతను చాలా కాలంగా వరహాలరావుని తనకో నాటకం వేసి పెట్టమని అడుగుతున్నాడు. తన ట్రూప్‌కి ఖాళీలేక, వర్మ ప్రోగ్రాంకి ఎక్కువ ఇవ్వలేదని వరహాలరావు ఎప్పటి కప్పుడు దాటవేస్తూ వచ్చాడు.

వరహాలరావంతటివాడు తనని వెతుక్కుంటూ వచ్చాడంటే నమ్మలేక పోయాడు వర్మ. అతన్ని ఆదరంగా ఆహ్వానించి కుశలప్రశ్నలడిగాడు.చివర్న "ఊరక రారు మహానుభావులు" అన్నాడు.

వరహాలరావు నవ్వాడు.

"ఏంలేదు. ఏదో పనిబడి మీ వూరొచ్చాను. మీరు గుర్తుకొచ్చారు. ఎన్నాళ్ళనుంచో మీకో ప్రోగ్రాం వేసి సాయపడదామనుకుంటూనేఉన్నానుకాని-ఏదీ వెధవది కుదిరి చావడంలేదు."

వర్మ ముఖంలో ఆనందం స్పష్టంగా తెలుస్తోంది.

"పదిహేను రోజుల్లో మీరు టికెట్లు అమ్ముకోగలరా?"

వర్మ ఆశ్చర్యపడ్డాడు.

"చాలండి. మీరు దయతలచాలి. అంతే!" వర్మ వినయంగా అన్నాడు.

"పెద్దలలా మాట్లాడకూడదు. సాటి వారికి సాయపడాలి. అది నా ఉద్దేశం. అంతేకాకుండా మీరు నాటకాన్ని నమ్ముకుని బతుకుతున్నారు."

వర్మ కృతజ్ఞత నిండిన కళ్ళతో చూశాడు.

"ఈవేళ రెండు. పదిహేడున పెట్టుకోండి."

వర్మ రెండు చేతులెత్తి దణ్ణం పెట్టాడు.

"మీ రేటు ..." వర్మ భయంగా చూశాడు.

వరహాలరావు చిర్నవ్వు నవ్వాడు. దాని అర్థమేమిటో వర్మకి తెలియలేదు.

"ఖర్చులు పెట్టుకోండి. నాకేం ఇవ్వక్కర్లేదు"

ఆ మాటల్ని వర్మ నమ్మలేక పోయాడు. వరహాలరావు శ్రీరాముడి పాత్ర వేస్తున్నాడా యీమధ్య – అన్న అనుమానం కలిగింది.

వర్మ వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుని వీలైనన్ని ఎక్కువ టిక్కెట్లు అమ్ముకోవాలని నిర్ణయించుకున్నాడు. వరహాలరావు నాటకాలకి ప్రజల్లో ఎంత క్రేజ్ ఉందో వర్మకి తెలుసు.

ప్రచారం పెద్ద ఎత్తున ప్రారంభించాడు. ఊర్నిండా పోష్టర్లు, బోర్డులు... రిక్షాలో మైక్ పెట్టి ప్రచారం. వర్మకి అనుకున్న దానికంటే ఎక్కువ 'రెస్పాన్స్' వచ్చింది. అతనికి పాలకొల్లులో మంచి పలుకుబడి వుంది. అతనికి మంచి వ్యక్తిగా పేరుంది. తెల్సున్నవాళ్ళంతా అతనికి సాయపడుతున్నారు.

సరిగ్గా నాటకం ఇంకో వారముందనగా

 

వరహాలరావు పంపిన కబురు విని వర్మ కుప్పలా కూలిపోయాడు. బెంగ, భయం అతన్ని చుట్టుముట్టాయి.

"మా హీరోయిన్‌కి టైఫాయిడ్ వచ్చింది. నాటకం కేన్సిల్ చేసుకోండి."

వర్మ గుండెలు దడదడలాడాయి.

అప్పటికే అతను రెండువేల రూపాయల టిక్కెట్లు అమ్మాడు. నాటకం రద్దు చేసినా, వాయిదా వేసినా అతనికి చెడ్డ పేరు వస్తుంది. అందరూ అతన్ని మోస గాడంటారు. చాలామంది డ్రామా కాంట్రాక్టర్లలాగే అతనూ ప్రజల్లో చులకనైపోతాడు. ఇన్నాళ్ళు తను ఆర్జించుకున్న పలుకుబడి, పేరు హరించుక పోతాయి.

వర్మ ఆందోళనగా భీమవరం పరి గెత్తుకెళ్ళాడు.

వరహాలరావు వర్మ చెప్పినదాంతో ఏకీభవించాడు. అతని బాధలో పాలు పంచుకున్నాడు. జాలిపడ్డాడు. సానుభూతి చూపించాడు.

వర్మకి కావల్సింది ఇవేమీ కాదు. తను ఈ ప్రమాదంలోంచి బైట పడే మార్గం.

"పోనీ మరో అమ్మాయిని ప్రయ త్నిద్దాం. ఎంత డబ్బు అడిగినా ఇచ్చు కుంటాను. ఈ ప్రోగ్రాం పడకపోతే నా ఎముకలు విరగ్గొట్టేస్తారు. నేనింక తలెత్తుకు తిరగలేను" వర్మ వణికి పోతున్నాడు.

"మరో అమ్మాయి విషయం నేను ముందుగానే ఆలోచించాను. మా నాట కంలో సీత పాత్రకి పనికొచ్చే అమ్మాయి ఈ ప్రాంతంలో లేదు. పెంటపాడు పుష్పవల్లి ఊళ్ళో లేదట. దువ్వ రత్న మాలకి ఖాళీ లేదట. పెరవలి సీత తాటకిలా వుంటుంది. పెద్దాపురం పాప నాటకాలు మానేసి ఎవరి పంచనో చేరింది. ఇంకెవరున్నారు చెప్పండి. ఎవరైనా కొత్త అమ్మాయిని ప్రయత్నిద్దామంటే ఎవరు దొరుకుతారు? దొరికినా మనకి సమయం లేదు. వాళ్ళకి నటనలో అ...ఆ...లు నేర్పాలి."

వర్మకి దిక్కు తోచలేదు.

"ఏదో ఉపాయంచేసి మీరే నన్ను ఆదుకోవాలి. నాకిది జీవన్మరణ సమస్య".

వర్మ వరహాలరావు కాళ్ళు పట్టు కున్నంత పని చేసాడు. చివరికి కాళ్ళు పట్టుకున్నాడు.

వరహాలరావు చేతిమీద నుదురు ఆన్చుకుని కాసేపు ఆలోచిస్తూ మౌనంగా ఉన్నాడు. అద్దంలోకి చూశాడు. భృకుటి ముడిచాడు.

"ఒక దారి వుంది. కాని అది ఎంత వరకు ఫలిస్తుందో చెప్పలేను. తొంభై తొమ్మిది వంతులు అనుమానమే!" వరహాలరావు సాగదీస్తూ చెప్పాడు.

వర్మ మనసులో ఆ ఒక్కవంతు ఆశ తళుక్కున మెరిసింది.

అతను ఏం చెయ్యడానికైనా సిద్ధంగా ఉన్నాడు. నాటకం పడాలి. తను తిట్లను, అవమానాల్ని, అనుమానాల్ని తప్పించు కోవాలి.

"చెప్పండి ఏం చెయ్యమంటారో!"

"మీ ఊళ్ళోనే ఓ అమ్మాయుంది. ఆమె నాటకాలు మానేసి పెళ్ళి చేసుకుని హాయిగా కాపురం చేసుకుంటోంది. ఈ మధ్య వాళ్ళాయన స్నేహితులకి అభా వతు వస్తే అందులో వేసిందని విన్నాను. పూర్వం అత్తిలి సత్యం ట్రూప్‌లో సీతగా వేసింది. కాని మనకి వేస్తుందా అన్నది అనుమానమే!"

వర్మ ఓ నిర్ణయానికి వచ్చాడు. ఆమెను బతిమాలి, ఎంత డబ్బైనా ఇచ్చి ఆమెను ఒప్పించాలని నిశ్చయించుకున్నాడు. ఆ విషయం వరహాలరావుకి చెప్పాడు.

"ఆవిడ డబ్బు కోసం వెయ్యదు. కష్టం కాయమని అడగండి. లేదా ఎవరైనా పెద్దలతో చెప్పించండి"

వర్మ సరేనని - ఏ విషయం కబురు చేస్తానని వెళ్ళడానికి లేచాడు.

"ఆ అమ్మాయికి నాల్గురోజుల రిహార్సల్ సరిపోతుంది. కావాలంటే రిహార్సల్ పాలకొల్లులోనే పెట్టుకుందాం. ఆ విషయం కూడా చెప్పండి"

వర్మ సరేనని ఆశగా బయల్దేరాడు.

వరహాలరావు నవ్వుకున్నాడు.

* * *

తలుపు తీసిన రాధిక గుమ్మంలో అంతమందిని చూసి ఆశ్చర్యపడింది. కంగారుగా చూసింది. వచ్చినవాళ్ళల్లో వర్మ ఉన్నాడు. ఆ వూరి మున్సిపల్ ఛైర్మన్ సుబ్బారావుగారున్నాడు. ఓ మున్సిపల్ కౌన్సిలర్ ఉన్నాడు. మరో ఇద్దరు షుగర్ ఫాక్టరీలో పనిచేసే ఉద్యోగులున్నారు.

రాధికకు తన భర్తతో పనిచేసే ఆ ఇద్దరూ తప్ప వాళ్ళల్లో ఇంకెవరూ తెలవరు. వాళ్ళనైనా రిహార్సల్ దగ్గర చూసింది తప్ప—పెద్దగా పరిచయం లేదు.

అంతా లోపలికొచ్చి కూర్చున్నాక



"ఆయన లేరండీ! మద్రాసు ట్రైనింగుకి వెళ్లారు" అని చెప్పింది రాధిక.

"ఆ విషయం వీళ్ళిద్దరూ చెప్పారమ్మా! వీళ్ళిద్దరూ మీవారితో ఫాక్టరీలో పన్జేస్తున్నారు" వర్మకి అసలు విషయం ఎలా మొదలెట్టాలో అర్థం కావడం లేదు. ఆమె ఒప్పుకోదని ఓ మూల భయంగాను, ఒప్పించాలని మరో మూల ఆత్రుతగాను ఉందతనికి.

కాస్సేపు నిశ్శబ్దం. ఎవరూ మాట్లాడ లేదు. చివరికి మున్సిపల్ ఛైర్మన్‌గారు అసలు విషయం చెప్పారు. ఆమె అలా ఊహించలేదు. ఆశ్చర్యపోవడం ఆమె వంతైంది.

"క్షమించండి. నేను నాటకాలెయ్యడం మానేశాను. మొన్న మావారి ఆఫీసులోనైనా ఆయన బలవంతమీద వేశాను"

ఆమె మృదువుగా తిరస్కరించింది.

వర్మ తాను ఏ పరిస్థితుల్లో ఆమెను అడగడానికి వచ్చినదీ వివరించి చెప్పాడు. ఈ నాటకం పడకపోతే తన పరువు పోతుందనీ, తనో మోసగాడిగా చిత్రింపబడతానని చెప్పాడు. తనని ఆదుకుని రక్షించమని అర్థించాడు. బతిమాలాడు.

ఆమె కతనిమీద జాలేసింది. సానుభూతి కలిగింది. కాని నాటకం వెయ్యడం ఆమె కిష్టంలేదు. భర్త ఊళ్లో లేకపోవడం, వరహాలరావు లాంటి తుచ్ఛుడితో వెయ్యాల్సి రావడం ఆమె నిర్ణయాన్ని మరింత గట్టిపరిచాయి.

ఆమె వెయ్యనుగాక వెయ్యనంది.

వర్మతో వచ్చినవాళ్ళంతా ఆమెను బతిమాలారు. వర్మ లాంటి పెద్ద మనిషికి సాయపడడం ఆమె ధర్మమన్నారు. ఆమె మేలు మర్చిపోలేమన్నారు. మున్సిపల్ ఛైర్మన్‌గారు మచ్చలేని వర్మని కాపాడటానికే తాను కూడా వచ్చానని చెప్పారు. రమణ స్నేహితులిద్దరూ అతను వచ్చాక ఆమె ఏ పరిస్థితుల్లో నాటకం వేసినదీ నచ్చచెప్తామన్నారు.

ఆమె నవ్వి ఊరుకుంది. వర్మకు ఆందోళన ఎక్కువయింది.

"నీ తండ్రి లాంటివాణ్ణి. నన్ని ఆపదలోంచి నువ్వే బయట పడెయ్యాలమ్మా! వేరే దారి లేక నిన్ను అర్థిస్తున్నాను. నా పరువుపోతే నేనింక బతకక్కర్లేదు. చిన్నదానివైనా చేతులెత్తి దణ్ణం పెడుతున్నాను" అన్నాడు వర్మ ఆమె ముందు చేతులు జోడిస్తూ.

చివరి మాటలన్నాక కండువాతో కళ్లు ఒత్తుకున్నాడు. ఆమె హృదయం కలుక్కుమంది.

ఆమె మనసు మంచులా కరుగుతోంది. ఆమెకు తన తండ్రి జ్ఞాపకం వచ్చాడు. కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆమె అతికష్టంమీద సరేనంది.

కాని నాటకం రిహార్సల్ మాత్రం వర్మ ఇంటిలో పగటిపూటే పెట్టాలంది. వర్మ సరేనన్నాడు. ఆమె గౌరవ మర్యాదలకి భంగం రాకుండా చూసే పూచీ తనదేనని మాట ఇచ్చాడు.

మర్నాడు నరసాపురం వెళ్ళాల్సిన తల్లిని నాటకం అయ్యేవరకు ఉండమని చెప్పి ఒప్పించింది.

అంత బలవంతంమీద నాటకం వెయ్యడానికి ఒప్పుకున్న రాధికకు మనసులో భయంగా వుంది. వరహాలరావు తాలూకు ఆలోచనే ఆమెకు జుగుప్స కలిగిస్తోంది. కాని మరో మూల ఓ వృద్ధునికి సాయపడుతున్నానన్న ఆలోచన ఆమెకు తృప్తినిస్తోంది.

చాలా రోజుల తర్వాత వరహాల




రావుని చూసిన రాధికకు గుండెలు దడదడలాడాయి. అతని నవ్వులో ఆమెకు పాము బుస వినిపించింది.

వరహాలరావు గొప్ప నటుడు. అసలేమీ జరగనట్టుగా ఆమెను పలకరించాడు. భర్త ఉద్యోగ వివరాలు అడిగాడు. చివర్న "ఎందుకొచ్చిన నాటకాల్లెద్దూ! హాయిగా పెళ్లి చేసుకుని చక్కగా కాపురం చేసుకుంటున్నావ్" అన్నాడు.

ఆమె నవ్వి ఊరుకుంది.

రిహార్సల్ జరుగుతున్నన్నాళ్లు వరహాలరావు మర్యాదగా ప్రవర్తించడం రాధికకు ఆశ్చర్యం కలిగించింది. అది ప్రళయం ముందు నిశ్శబ్దంగా ఆమెను భయపెట్టింది. అతని మెదడులో పెద్ద పథకం వుందేమోనని ఆమెకు అనుమానం కలిగింది.

నాటక ప్రదర్శన జరిగిన రోజున తన అనుమానం అర్థంలేనిది అనిపించింది రాధికకు.

వర్మ కృతజ్ఞతలు చెప్పి రాధికకు చెయ్యెత్తి దణ్ణం పెట్టాడు. మూడు వంద కాయితాలు ఆమెకివ్వబోయాడు.

"అవసరంలో మిమ్మల్ని ఆదుకోవాలని వేశాను డబ్బు కోసం కాదు" అంది రాధిక నవ్వుతూ.

అతను రెండు మూడు సార్లు అడిగి వూరుకున్నాడు.

మర్నాడుదయమే వర్మ రాధిక ఇంటికి వెళ్లి ఓ పట్టుచీర ఇచ్చి "నీ ఋణం తీర్చుకోలేనిదమ్మా! నా సంతోషం కోసం ఈ చిన్న బహుమానం ఉంచుకో తల్లీ" అన్నాడు. బలవంత పెట్టాడు

తప్పక ఆమె తీసుకుంది. అతనికి సాయపడ్డందుకు ఆమెకు తృప్తిగా ఉంది.

ఆవేళే ఆమె తల్లి నరసాపురం వెళ్ళిపోయింది.




ఇరవై రోజుల తర్వాత భార్యను చూడబోతున్న రమణ ఆమెతో తను గడపబోయే మధుర క్షణాలను తల్చుకుంటూ ట్రైన్ దిగాడు. స్టేషన్నుంచి బైటకొచ్చి రిక్షా ఎక్కగానే అతనికి నాటకం తాలూకు పెద్ద బోర్డు కనిపించింది. దానిమీద పెద్ద పెద్ద అక్షరాలతో రాధిక పేరు పక్కనే వరహాలరావు పేరు. చూడగానే అతనికి ఆశ్చర్యం, కోపం ఒకేసారి కల్గాయి.

స్టేషన్నుంచి ఇంటికొచ్చేసరికి బజార్లో, ఏ సెంటర్లో చూసినా పెద్ద పెద్ద బోర్డులు వాటి మీద రాధిక పేరు, వరహాలరావు పేరు... అతని బొమ్మలు.

ఏం జరిగి ఉంటుందో అతను ఊహించగలిగాడు. అతని బుర్ర వేడెక్కిపోయింది. అతని ఆరాటం, ఆనందం అన్నీ ఒక్కసారిగా నీరు కారిపోయాయి.

ఇంటికి రాగానే రాధిక ఆప్యాయంగా పలకరించినా అతను ముభావంగా ఉండిపోయాడు. ఎన్నోసార్లు పలకరించినా అతను పలక్కపోయేసరికి "ఏం ఎందుకని అసలు మాట్లాడరూ?" అందామె ఆందోళనగా.

"ఆనందం... మహదానందం. నా పెళ్ళాం వరహాలరావుతో నాటకాలు వేస్తోందనీ, ఆమె పేరు బోర్డుల మీద కెక్కిందనీ బ్రహ్మానందం" వెటకారంగా అన్నాడు రమణ. ఆమె బిత్తర పోయింది. ఆమె మనసు కీడుని శంకి స్తోంది. అతనికి మెల్లగా చెప్పవచ్చను కుంది. అతని కోపం వస్తే ఎలాగైనా నచ్చజెప్పవచ్చనుకుంది. అతను రావడం ఉగ్రరూపంతో వస్తే ఆమె భయపడింది.

తమ మధ్య పెంచుకున్న అనుబంధా నికి చెడ పడుతోందని, అర్ణవంలా గంభీ రంగా ఉన్న తమ దాంపత్యంలో తుఫాను రేగబోతోందని అనిపించి ఆమెకు వణుకొచ్చింది. మొదటిసారి భర్త నోటి నుంచి కర్కశమైన మాటలు వినాల్సి వచ్చినందుకు ఆమె మనసు రంపపు కోత అనుభవిస్తోంది. ఆమె కళ్ళు అశ్రుపూరితా లయ్యాయి. మరొక్కమాట మాట్లాడితే ఆమె ఏడ్చేటట్టు వుంది.

అదీ అయింది.

"నేను మావాళ్ళతో వెయ్యమంటే అంత బిగదీసుకుపోయావ్. నేను ఊళ్ళో లేకపోయేసరికి నీకు ఎక్కడలేని ధైర్యం వచ్చేసిందా?"

ఆమె ఏడవటం మొదలెట్టింది.

"ఏడవకు. తప్పుచేసి ఏడ్చేవాళ్ళంటే నా కసహ్యం."

ఆ మాటలకి ఆమె ఏడుపు ఎక్కు వయ్యింది. మెల్లగా సంబాళించుకుంది. తను ఏ పరిస్థితుల్లో నాటకం వేయాల్సి వచ్చిందీ, వర్మ తననెంతగా బతిమాలిందీ, మిగిలినవాళ్ళు తననెంత ఒత్తిడి చేసిందీ వివరించి చెప్పింది. అంతా విన్నాక కూడా అతనిలో మార్పు రాలేదు. అతను మొండిగా ఆలోచిస్తున్నాడు.

"సమర్థించుకోడానికిప్పుడేదైనా చెప్తావ్. నీకసలు నాటకాల పిచ్చి వుంది. నాకిష్టం లేదు కాబట్టి ఈరకంగా వేసేస్తే తర్వాత నేనే ఒప్పుకుంటానని ఆలోచించావ్. లేకపోతే నాకో ఉత్తరం వేసేదానివేగా!"

ఆ మాటలకామె అహం దెబ్బతింది. అయినా తమాయించుకుని నచ్చజెప్ప బోయింది. తప్పని ఒప్పుకుంది. ఇంకెప్పుడూ వెయ్యనంది. ఫ్యాక్టరీ స్నేహితులు తాము రమణకు నచ్చచెప్పుకుంటామన్న సంగతి గుర్తు చేసింది.

"వెనకటికెవడో లాగి లెంపకాయకొట్టి సారీ అన్నాట్ట. అలా వుంది" అన్నాడు రమణ అంతా విని.

"ఈ ఒక్కసారికి క్షమించండి. మీ కోపాన్ని నేను భరించలేను" అంది. అత నామెకేసి చూసాడు. అతని కళ్ళు కోపంతో పొగలు కక్కుతున్నాయి.

"వరహాలరావు ఎలాంటివాడో తెల్సుండీ, అతనితో ఓ చెడ్డ అనుభవం జరిగీ అతనితో నాటకం వేసావంటే...నీ ఉద్దేశం నా కర్థంకాలేదు."

ఆ మాటల్ని రాధిక సహించలేక పోయింది. భర్తమీద కస్సున లేచింది.

"నేను ఈ నాటకం వెయ్యడం ఎంత తప్పో-మీరు మీవాళ్ళతో నాటకం వేయ్యిం చడం అంతే తప్పు. నిజమే! నాకు నాటకం పిచ్చి. కాని ఇప్పుడు కాదు, పూర్వం. దాన్ని మర్చిపోయి నేను హాయిగా బతుకు తుంటే 'ఈ ఒక్కసారికి' అవసరం వేయమని వేయించారు. అలాగే,ఆ వర్మగా రడిగారు. వయసు మళ్ళిన పెద్దమనిషి కళ్ళనీళ్ళెట్టుకుని, చేతులు జోడించి అడిగితే కాదనలేకపోయాను. ఈ మాత్రం దానికి ఉద్దేశాలు అంటకడితే సహించను" ఆమె కోపంగా ఉడుకుమోత్తనంగా అంది.

 

రమణకి పౌరుషం వచ్చింది.

"సహించక ఏం చేస్తావ్? ఇంట్లోంచి పోతావా?"

"మీకిష్టం లేకపోతే చెప్పండి. తక్షణం వెళ్ళిపోతాను,''

"పోతే పో" రమణ ఛీత్కారంగా అన్నాడు.

ఆ ఛీత్కారాన్ని ఆమె సహించలేక పోయింది.

కోపం మూర్ఖత్వాన్ని కలిగిస్తుంది. మూర్ఖత్వం మనిషిలో ఇంగితాన్ని నశింప చేస్తుంది.

అంత అన్యోన్యంగా ఉండే రమణ, రాధికల విషయంలో కూడా అదే జరిగింది. ఇద్దరిలోను తప్పుంది. ఇద్దరి వాదనలోను అర్థముంది. కాని పట్టుదల, కోపం, మూర్ఖత్వం వాళ్ళ మనసుల్ని మూసేశాయి. వాళ్ళలోని ఇంగితాన్ని నశింప చేసాయి.

ఒకరి వాదనలోని రీజనింగ్ మరొకళ్ళు చూడలేకపోయారు. మొండిగా వాదించుకుని మూర్ఖంగా ప్రవర్తించారు. వాళ్ళు తాడు తెగేదాకా లాగారు. అది తెగింది.

కోపంతో, అభిమానంతో ఇంట్లోంచి బైటికి వచ్చేసిన రాధికకు ఎక్కడి కెళ్ళాలో అర్థంకాలేదు. నరసాపురంలో ఉన్న అన్నగారింటికి వెడదామంటే అతను తల్లిని తీసుకుని ఆమె కోసం తీర్థయాత్రలకు వెళ్ళాడు.

ఒకవేళ అన్నగారు ఉన్నా అక్కడి కెళ్ళడం ఆమె కిష్టం లేదు. ఏ సమస్యల మీద తను ఒకప్పుడు అన్నగారికి దూరమైందో అదే సమస్యమీద మొగుడితో విభేదించి పుట్టింటికెళ్ళడం ఆమెకు ఇష్టం లేదు. అన్నయ్య తననే వేలెత్తి చూపుతాడని, క్షమించడని ఆమెకు నమ్మకం.

సూట్‌కేస్ తీసుకుని వచ్చేస్తుంటే రమణ కనీసం 'పొమ్మంటే పోవడమేనా?' అంటాడేమోనని ఆమె ఊహించింది. కాని అతనేమీ అన్లేదు.

ఆమె వెళ్ళిపోయేటప్పుడు 'మీకిష్టం లేదన్నారుగా - నేను పోతున్నాను' అంటుందేమో అని అతను ఊహించాడు.

ఆమె ఏమీ అన్లేదు.

ఇద్దరిలో ఏ ఒక్కరు మాట్లాడినా రెండోవారు అడ్డుకునేవారు. కాని ఇద్దరికీ అహంకారం అడ్డు వచ్చింది.

రాధిక బైటికొచ్చాక ఎక్కడి కెళ్ళాలా అని కొంచెంసేపు ఆలోచించింది. ఆమె మనసులో అరుణ మెదిలింది. అరుణ ఆమెకు మంచి స్నేహితురాలు. ఆమె ఎలిమెంటరీ స్కూల్లో పనేస్తూ హిందీ పరీక్షలకి చదువుతోంది. వాళ్ళింట్లో అరుణ, ఆమె తల్లి మాత్రం ఉంటారు. ముందు అక్కడికి వెడితే తర్వాత కార్యక్రమం మెల్లగా ఆలోచించుకోవచ్చనుకుంది.

రిషా ఎక్కి అరుణ ఇంటికి వెళ్ళింది. ఆ వీధి మొగలోనే రిషాదిగి డబ్బులిద్దామనుకుంటే డబ్బు తెచ్చుకో లేదన్న విషయం జ్ఞాపకమొచ్చింది. తను వెళ్ళేదే సగం మనసు చంపుకుని... వేరే దారిలేక. వెళ్ళగానే అరుణను డబ్బులడగడానికి సిగ్గనిపించింది. ఏంచెయ్యాలో తోచక కొద్ది క్షణాలు ఆలోచిస్తూ నిలబడిపోయింది. చటుక్కున ఆమెకో విషయం జ్ఞాపక మొచ్చింది. ప్రసాద్ తన కెప్పుడో ఇచ్చిన పాతిక రూపాయలు సూట్ కేస్‌లో బట్టల కింద వున్నాయి. సూట్ కేస్ రిషాలో పెట్టి తెరిచి చూసింది. డబ్బుతీసి రిషావాడి కిచ్చింది. ఆమె మనసులో ప్రసాద్

మెదిలాడు. "ఇప్పుడు కూడా నన్నాదు కున్నావ్!" అనుకుంది. ఆమె మనసు ఆర్ద్రమైంది. గుండె తడి అయింది. తన పరిస్థితి అతనికి తెలిస్తే? తనమీద జాలి పడతాడా? అసహ్యించుకుంటాడా?

మనుషులు దూరమైన కొద్దీ ఇలాంటి సమయాల్లో మనసులు మరింత దూరమయ్యే అవకాశం వుంది. కాని ఏం చెయ్యాలి?

ఆమెక్కుబాపురుమనిఏడ్వాలనిపిస్తోంది.

* * *

రాధిక చెప్పిన విషయాలన్నీ సానుభూతితో వింది అరుణ "నువ్వు నాతో ఉండటానికి నా అభ్యంతరం ఏమీలేదు. కాని నువ్విలా వచ్చెయ్యకుండా ఉండాల్సింది. నెమ్మది మీద ఆయనే అర్థం చేసుకునేవారేమో."

"నువ్వూ నాదే తప్పంటున్నావా?" రాధిక ఉడుకుమోత్తనంగా అడిగింది.

"అది కాదోయ్! మనసులు విరిగితే అతకడం కష్టం. కలతలు వచ్చినప్పుడు మనుషులు ఎదురెదురుగా ఉంటే గొడవలు అవే సమసిపోతై. మనుషులు దూరమైన కొద్దీ ఇలాంటి సమయాల్లో మనసులు మరింత దూరమయ్యే అవకాశం వుంది. నువ్వు నాతో ఎన్నాళ్లున్నా నాకు అభ్యంతరం లేదు"

"ఆయనలా నాకు లేని ఉద్దేశాలు అంటగడితే సహించలేకపోయాను" రాధిక కళ్ళమ్మట నీళ్లు గిరగిరా తిరిగాయి.

"ధైర్యంగా ఉండు. పరిస్థితులవే చక్కబడతాయి. ఇంత బెంబేలు పడే దానివి అంత మొండిగా ఎలా వచ్చేశావ్" అంది అరుణ.

'నేను తప్పు చేశానా?' అనుకుంది రాధిక. అంతలోనే 'తప్పంతా ఆయనదే' అనుకుని సంతృప్తిపడింది.

రమణ జ్ఞాపకం వచ్చాడు. ఇరవై రోజుల పాటు గాఢ నిట్టూర్పుల సెగలు, పొగలు భరించి అతని కోసం వేచిచూస్తే ఇలా జరిగింది. ఛీ... నాటకం వెయ్యకుండా ఉండాల్సింది అనుకుందామె.

రమణ గురించి రాధిక, రాధిక గురించి రమణ ఆలోచిస్తూనే ఉన్నారు. ఒకరు లేకపోవడం ఒకరికి బాధగానే వుంది. ఇద్దరూ మధురంగా గడిపిన గతాన్ని తల్చుకుంటున్నారు. ఆమె ఎక్కడ ఉందో అతనికి తెలుసు. అతనెలా వున్నాడో ఆమె వాకబు చేస్తూనే ఉంది.

రెండో మనిషి లేకపోడం వల్ల, తమ జీవితంలో వెన్నెల కరువైందని ఇద్దరికీ అనిపిస్తోంది.

కాని విచిత్రం... కాలం గడుస్తున్నా ఇద్దరూ చొరవ తీసుకోడం లేదు. ఇద్దరికీ అహంకారం అడ్డుపడ్తోంది. కాలంతోపాటు వాళ్ళ ఆలోచనలూ దొర్లిపోతున్నాయి.

రాధిక వచ్చేసి ఇరవై రోజులు దాటి పోయింది. ఇన్ని రోజుల్లో రమణ వస్తాడని, తనని తీసికెడతాడని ఆమె ఎంతో ఆశించింది. కాని అలాంటిదేమీ జరగ లేదు.

ఆమె నిరాశ పెంచుకుంటోంది. ఇంక తమ బాంధవ్యం తెగిపోయిందన్న నిర్ణయానికి వచ్చింది. అలా ఎన్నాళ్ళు అరుణ ఇంట్లో తినాలో అర్థం కాలేదామెకు. అందుకామెకు బాధగా కూడా వుంది. అన్న దగ్గర కెళ్ళడం, అతనికి సమస్య కావడం ఇష్టంలేదు. 'ఇన్నాళ్ళు




పడ్డాడు. ఇంకెన్నాళ్ళు పడతాడు నాతో' అనుకుంది. నానా కష్టాలు పడి పెళ్ళిచేసి పంపిస్తే చెల్లెలు కాపురం పాడు చేసుకుని ఇంటికి వచ్చిందని అతనెంత కుమిలి పోతాడు? మోహన్, తల్లి తీర్థయాత్రల నుంచి తిరిగి వచ్చేసరికి ఏదో ఒకటి చెయ్యాలి. ఏదో పరిష్కారం వెతుక్కో వాలి అనుకుంది రాధిక.

కాని ఏం చెయ్యాలి ?

తనని తాను పోషించుకోవాలని ఉన్నా ఎలాగ అన్నది సమస్య. ఆమె ఎక్కువ చదువుకోలేదు. ఉద్యోగం రాదు. చాలా ఆలోచించి కష్టసుఖాలు, లాభనష్టాలు బేరీజువేసి ఓ నిర్ణయానికి వచ్చింది. ఆమెకు ఒక్కటే మార్గంలా కనిపించింది.

అది......నటన.

ఆ నిర్ణయం తీసుకోగానే ఆమె గుండెల్లోంచి బాధ పెల్లుబికింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

నటన కోసం అన్నగారితో విరోధం తెచ్చుకుంది. నటన కోసం తండ్రితో ఇంట్లోంచి వెళ్ళిపోయి వేరే ఉంది. నటనతో ప్రసాద్ పరిచయమయ్యాడు. నటన మానెయ్యమని అన్నగారు, అన్నలాంటి ప్రసాద్ సలహా చెప్పారు. నటించడం వల్ల భర్తతో గొడవపడి కాపురం వదిలేసుకుని బైటికి వచ్చింది.

నటన, నాటకం, నటన, నాటకం....

ప్రస్తుతం అదే తనకి జీవనాధారమౌతోంది.

ఆమెకు మెదడు మొద్దుబారిపోయింది.

ఎప్పుడో నటనే తన జీవితాన్ని, తనకున్న అందాన్ని, వయసుని కబళిస్తుందనిపించింది.

ఆమెకు బావురుమనిఏడ్వాలనిపిస్తోంది.

ఆమె కన్నీళ్ళతో తలగడంతా తడిసిపోయి, ఆమె చెక్కిలంతా తడి అయింది.

ఆమె జీవితాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించి విఫలుడైన వేదాంతిలా వెర్రి నవ్వు నవ్వింది.

ఆమె గుండెలు నిశ్చయంతో గట్టి పడ్డాయి.

భయపడకుండా జీవితంతో పోరాడాలని ఆమె నిర్ణయించుకుంది.




"రాధికా! నువ్వా! ఇక్కడా? ఏమిటిది?"

ప్రసాద్‌కేమీ అర్థం కాలేదు.

ఆమెను చూసినందుకు ఆనందం, అనుకోకుండా కల్సినందుకు ఆశ్చర్యం. ఆ ప్రదేశంలో, ఆ పరిస్థితిలో, ఆ వాతావరణంలో ఆమెను ఊహించని ఆరాటం...

రాధికకు ప్రసాద్‌ని చూడగానే ఆనందం కల్గింది. తనకున్న ఒకే ఒక ఆత్మీయుణ్ని, మంచి స్నేహితుణ్ని చాలా కాలానికి కలిసినందుకు ఆమె మొహం నిండా తృప్తి నిండుకుంది. అంతలోనే తను ఉన్న పరిస్థితులు జ్ఞాపకంవచ్చాయి. ఆమె కళ్ళల్లోకి నీళ్ళు ఉబికి వస్తున్నాయి.

ఆమె తన భావాల్ని దాచుకోడానికి ప్రయత్నిస్తోంది.

"అన్నయ్యా! నువ్విక్కడికి ఎప్పు

దొచ్చావ్? ఎలా వున్నావ్? ఎంత కాల మైందో కదూ నిన్ను కలిసి? నువ్వెన్ని సార్లు జ్ఞాపక మొచ్చావో తెల్సా?"

కళ్ళల్లో వర్షాన్ని అదుపుచేసుకుంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తోంది.

ఆ వాతావరణం, ఆ పరిస్థితుల్లో అలా కల్సుకున్నందుకు ఇద్దరికీ బాధగానే వుంది.

మౌనాన్ని రాధిక ఛేదించింది.

"నేనీ ఆఫీసువాళ్ళకి నాటకం వేస్తున్నాను. వచ్చేనెలలో హైదరాబాద్‌లో వీళ్ళ డిపార్టుమెంటువాళ్ళ పోటీలున్నాయి. రవీంద్రభారతిలో జరుగుతాయి. అన్నట్టు నువ్వుండేది హైదరాబాద్‌లోనే కదా! నాటకానికి తప్పకుండా వస్తావ్ కదూ!"

ఆమె ఎంతో ఉత్సాహంగా, ఏమీ జరగనట్టు, దొరక్కుండా చెప్పాననుకుంది.

ఆ కంఠంలో జీర, వణుకు. ఆమె మాటల వెనకాల వ్యధ అతను అర్థం చేసుకున్నాడు.



"నేనీ ఆఫీస్ ఆడిట్ చెయ్యడానికి మా టీంతో వచ్చాను. ఎవరో చెప్పారు ఇక్కడ నాటకం రిహార్సల్స్ చేస్తున్నారని. కాలక్షేపం కోసం ఇలా వచ్చాను.

"నువ్వు నాటకాలు మానేసావని పెళ్ళి చేసుకున్నావని తెల్సింది. సంతోష పడ్డాను. మీ అన్నయ్య నరసాపురం వెళ్ళి పోయాడని చెప్పారు. అతన్ని కలవ డానికి,నీ గురించి తెల్సుకోడానికి భయ



పడ్డాను. ఎందుకంటే అతనికసలే నాటకాల మనుషులంటే ఎలర్జీ.

"ఒకవేళ తెల్సుకున్నా నిన్ను కలవడాన్కి మనస్కరించలేదు. మీవారు ఎలాంటివారో తెలియదు. ఆయన నా రాకని అపార్థం చేసుకుంటే అనవసరంగా నిన్ను ఇబ్బందిలో పెట్టినవాణ్ని అవుతానని ఆలోచించాను..."

"ఆయన అలాంటివారు కాదు. చాలా మంచివారు.

"మరెందుకిలా జరిగింది? హాయిగా కాపురం చేసుకుంటున్నదానివి. మళ్ళీ నాటకాలు ఎందుకు వేస్తున్నావ్? ఏమైంది? ఎందుకిలా జరిగింది ??" అతని మాటల్లో ఆత్రుత ఉంది.

"నేనే ఇంట్లోంచి బైటికి వచ్చేశాను"

ప్రసాద్ స్థాణువులా నిలబడిపోయాడు.

"నువ్విప్పుడు ఎక్కడుంటున్నావ్?" ప్రసాద్ అడిగాడు.

"అరుణనే స్నేహితురాలింట్లో వుంటున్నాను"

"మీ ఆయన ఊళ్ళో ఉన్నారా?"

"ఉన్నారు"

ఆమెను ఏమడిగినా ఏడ్చేటట్టు వుంది. అందరి ముందు సీన్ చెయ్యడం అతని కిష్టంలేదు.

"వెంటనే అరుణగారింటికెళ్ళిపో. నిన్ను రేపు పొద్దున్నే వచ్చి కలుస్తాను"

ప్రసాద్ మాటలకి ఆమె సరేనంది. అరుణ ఎడ్రస్ ఇమ్మని అడిగాడు. ఆమె చెప్పింది. అది కాయితం మీద రాసుకోడానికి అతను జేబులోంచి పెన్ తీసాడు.

నీలం రంగు పెన్...



ఆమె కళ్ళల్లో మెరుపు మెరిసింది.

"ఈ పెన్ నీ దగ్గరింకా..."

ఆమె మాటలకి ప్రసాద్ నవ్వాడు.

"నీ గుర్తు. నిన్నెలా మర్చిపోతాననుకున్నావ్."

ఆమె నాటకం డైరక్టరుకి చెప్పి వెళ్ళిపోయింది.

చక్కని కల చెదిరిపోతున్నట్టు, పచ్చని మల్లెతోటకు నిప్పంటుకున్నట్టు, నిర్మలమైన ఆకాశంలో మేఘాలు అలుముకున్నట్టు అనిపించింది అతనికి.

ఏదో చెయ్యాలి, ఏమైనా చెయ్యాలి.

ఏం చేసైనా ఆమె కాపురం నిలబెట్టాలి. అలా నిర్ణయించుకున్నాక అతనా నాటకం డైరెక్టరుతో మాట్లాడాడు. ఆమె కాపురం నిలబడాలంటే ఆమె ముందు నాటకం మానెయ్యాలి. ఈ నాటకం జరిగిపోతే ఆమెభర్త వినకపోవచ్చు. మొత్తం కథ అడ్డం తిరుగుతుంది.

విషయమంతా డైరెక్టరుకి వివరించి చెప్పి, సానుభూతితో అర్థం చేసుకుని ఆమెను నాటకం నుంచి వదిలేసి మరొకర్ని చూసుకోమని బతిమలాడి చెప్పాడు. అతను సరేనన్నాడు.

మర్నాడు పొద్దున్నే అరుణ ఇంటికెళ్ళి రాధికను కల్సుకున్నాడు ప్రసాద్. రాధిక జరిగినదంతా ప్రసాద్‌కి చెప్పింది. ఆమెకు భర్తంటే ఉన్న ఇష్టం, అనురాగం ఆమె మాటల్లో అతనికి అర్థమయ్యాయి.

ఇద్దరూ మొండిగా, మూర్ఖంగా ప్రవర్తించారనిపించింది ప్రసాద్‌కు.

"నువ్వు తొందరపడకుండా ఉండాల్సింది" అన్నాడు ప్రసాద్.

"నువ్వూ నాదే తప్పంటున్నావ్?"

"అదికాదమ్మా! అంత ప్రేమగా చూసుకునే భర్త ఓ మాటంటే పడొచ్చు. నెమ్మదిమీద తన తప్పు అతనే తెల్సుకొనే

వాడు. దాంపత్యమన్నాక ఒకరికొకరు ఎడ్జెస్ట్ కావాలి. అంతేకాని ఇంట్లోంచి బైటికి వచ్చెయ్యడం తప్పుకదూ!

ఆమె మౌనంగా విని ఊరుకుంది.

ఏం చెయ్యాలిప్పుడన్నది ప్రసాద్ కెదురైన సమస్య.

రాధిక చెప్పినదాన్నిబట్టి రమణ సౌమ్యుడు, పెద్దమనిషి అన్న అభిప్రాయం ఏర్పడింది. అతను తనను ఏదైనా అన్నాసరే ఫరవాలేదు. మొత్తం మీద వాళ్ళిద్దర్నీ కలపాలి.

రాధిక ఇంట్లోంచి బైటికి వచ్చేసినప్పట్నుంచి తన సమాజంలో నా ట కా లు వెయ్యమని వరహాలరావు కబుర్లు పంపుతున్నాడన్న విషయం విన్న ప్రసాద్ మరింత ఆందోళన ప డు తు న్నా డు. సమస్య ఎంత త్వరగా పరిష్కారమైతే రాధికకు అంత మంచిదని అతని అభిప్రాయం. కాలం సాగేకొద్దీ, వాళ్ళిద్దరు కలవలేనంత దూరం అయిపోతారు.

రమణను కలవడానికే ప్రసాద్ నిర్ణయించుకున్నాడు.

* * *

తనకోసం వచ్చిన ఆగంతకుణ్ణిచూసి రమణ ఆశ్చర్యపడ్డాడు.

"మీతో మాట్లాడాలి" అన్నాడు ప్రసాద్.

సెక్యూరిటీ రూమ్ నుంచి నడుచుకుంటూ కేంటీన్ వైపు వెడుతున్నారు.

"మీరు...'' అర్థం కానట్టు అడిగాడు రమణ.

''నాపేరు ప్రసాద్, హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాను. ఇక్కడో ఆఫీస్ ఆడిట్ కి వచ్చాను"

రమణ ఏదో ఆలోచిస్తున్నట్టు, అర్థం కానట్టు ఉండిపోయాడు.

"మా స్వగ్రామం తాడేపల్లిగూడెం దగ్గర పిప్పర."

రమణకి జ్ఞాపకమొచ్చింది.

"మీరు రాధితో నాటకాలు వేసేవారు కదూ!"

"మీకెలా తెలుసు?'' ఆశ్చర్యపోవడం ప్రసాద్ వంతైంది.

"రాధి మీ గురించి చాలా చెప్పేది. మిమ్మల్ని ఆ స్తమానూ గుర్తు చేసుకునేది.''

ఆ మాటలలో ప్రసాద్‌కి రమణ చాలా అర్థమయ్యాడు.

''అవును. ఆమంటే నాకెందుకో అభిమానం. మంచిపిల్ల. మీ మంచితనం ఏమిటో ఆమె నాకీవేళే చెప్పింది. వెంటనే మిమ్మల్ని కలవాలని వచ్చేసాను.''

"జరిగినదంతా చెప్పిందా?"

''చెప్పింది" ఎటో చూస్తూ చెప్పాడు ప్రసాద్.

"నన్నూ, రాధిని ఈ పరిస్థితుల్లో చూసానని మీరు ఊహించి వుండరు. సారీ!'' రమణ నొచ్చుకున్నాడు.

ప్రసాద్ చప్పుడు కాకుండా నవ్వాడు.

"రాధి ఎలా వుంది?"

"బాగానే వుంది– మీతో లేదన్న బెంగ తప్ప."

రమణ తలొంచుకున్నాడు.

"ఇలా జరక్కుండా ఉండాల్సింది కదూ!"

"మీకు ఆమె మీద ప్రేమ వుంది. ఇష్టం వుంది. అవునా?"

ఔనన్నట్టు తలఊపాడు.

"అనుమానం వుందా?"

''లేదు. అలాంటిదేమీ లేదు. వరహాల రావుగాడు దగుల్బాజీ అని తెల్సి వాడితో నాటకం వేసింది – అదీ నేను ఊళ్ళో లేనప్పుడు. నా పరువు ప్రతిష్టలు

ఏమవ్వాలి?"

"ఆమె వాడితో నాటకం వెయ్యడం తప్పే. నేనూ ఒప్పుకుంటాను. కాని మీ రిద్దరూ వాదించుకుని, పోట్లాడుకుని ఆవేశంలో, కోపంలో విడిపోయారు. నలుగురిలో చులకన అవరూ?"

"అడది... తనకే అంత పొగరైతే నాకెంత వుండాలి?"

"పొగరు ఎవరికున్నా ప్రమాదమే! చనువు తీసుకుంటున్నందుకు క్షమించండి. మీరిద్దరూ ఆవేశంలో వాదించుకున్నారే తప్ప ఇదంతా వరహాలరావు పన్నిన నాటకమని ఎందుకు ఊహించలేదు."

రమణ అర్థంకానట్టు చూశాడు.

"మీరు రాధికచేత ఏ పరిస్థితుల్లో నాటకం వేయిందారో - అదే పరిస్థితులు వర్మ కలతను కలిగించాడని ఎందుకనుకో కూడదూ! అర్థంకాలేదా? రాధిక మీ ఇంట్లోంచి బైటికి వచ్చినప్పట్నుంచి తన సమాజంలో నాటకం వెయ్యమని రోజుకో కబురు పంపుతున్నాడు తెల్సా?"

"అసలా వెధవ మూలంగానే మాకీ కలతలన్నీ వచ్చాయి. వాడికోసారి బుద్ధి చెప్పాలి."

"అది విజ్ఞుల లక్షణం. వెళ్ళి శలవు పెట్టేసి రండి. రాధిక మీ కోసం అక్కడ ఒళ్ళంతా కళ్ళు చేసుకుని వీధి వీధంతా కలియచూస్తూంటుంది."

ప్రసాద్ మాటలకి రమణ చిర్నవ్వు నవ్వి, ఆలోచిస్తూ ఉండిపోయాడు.

* * *

రాధిక చేతి వంట కడుపునిండా తిని రమణ, ప్రసాద్ ముందు గదిలో కూర్చు న్నారు.

పోస్టుమేన్ ఉత్తరం తీసుకొచ్చి ఇచ్చాడు. తల్లిని తీసుకుని మర్నా డుదయమే వస్తున్నట్టు మోహన్ రాశాడు.

ప్రసాద్ లేచి "నేనింక ఆఫీసుకి వెడతాను" అన్నాడు

"ఈవేళ్టకి ఆఫీసు మానెయ్యండి సార్" అన్నాడు రమణ.

"అబ్బే అలా కుదరదు - వెళ్ళకపోతే 'నువ్వొచ్చింది ఆఫీసు ఆడిట్ చేయడానికి, కాపురాలు దిద్దటానికి కాదు' అని మా బాస్ నన్ను హైదరాబాద్ పంపేస్తాడు. అసలే ఆయన పేరు నర-సింహన్. బుద్ధిగా ఉంటే మరో వారం రోజుల పాటు చెల్లెలి చేతి భోజనం తినొచ్చు" అన్నాడు ప్రసాద్.

రమణ అతని మాటలకు నవ్వాడు.

"మళ్ళీ ఎప్పుడు దర్శనం" అన్నాడు.

"రేపు వస్తాను. రేపు మోహన్ బదరొస్తున్నాడు కదా! ఓ సారి వరహాల రావు దగ్గరకెళ్ళి 'ఓ మహా నటుడా! జీవితంలో నాటకాలెయ్యకు' అని చెప్పి వస్తాం. పక్కన మోహన్ వుంటే మంచిది. ఎంతైనా మెకానిక్కు కదా! నాకు ధైర్యం వస్తుంది!" అన్నాడు ప్రసాద్.

* * *

"తెర జీవితం జోలికింక పోను. మిమ్మల్నొదిలి నేను బతకలేను" అంది రాధిక.

రమణ ఆమె కళ్ళల్లోకి కొంటెగా చూశాడు.

ఆమె ఆవేశంతో, ఆనందంతో, ఆరాటంతో, కన్నీళ్ళతో ... అతన్ని చుట్టుకుపోయింది.

అతనామె తలమీద గడ్డం ఆన్చాడు. వాళ్ళిద్దరి మధ్య...

తెర తొలిగింది. ★

# హార్ట్ ఫిలిం

ప్రఖ్యాత వాస్తవ చిత్రీకరణ స్పెషలిస్టు నిజంగారి చిత్రం హాల్లో ప్రదర్శించబడుతోంది. జనం అంతా ఓపికగా చూస్తున్నారు. మొదటి సీనులో కథానాయకుడు హాల్లో సోఫా మీద కూర్చుని వుండగా నాయిక "రాం! టీ తీసుకు వస్తానుండు" అని లోపలికి వెళ్ళింది. కెమేరా ఆమె వెనకాతలే పరుగులు తీసింది.

వంటింట్లో అలమారుపై క్లోజప్. కథానాయిక చేతులు స్టవ్‌ను అందుకున్నాయి. మరో క్లోజప్ మరో గూడుపై. గూడులో



వస్తువులు అన్నీ ప్రత్యక్షంగా కనబడుతున్నాయి. చేతులు అగ్గిపెట్టెను అందుకున్నాయి. అగ్గిపెట్టెతో స్టవ్ వెలిగించటం, కెమేరా కథానాయికతో దొడ్లోకి చేరింది. దొడ్లో తుప్పలు, తుమ్మలు... అంతా చిందరవందరగా ఉంది. ప్రేక్షకులంతా ఊపిరి బిగబట్టి చూస్తున్నారు—ఏదో జరగబోతోందన్నట్లు. బకెట్‌తో నీళ్ళు తోడి గిన్నెలోకి ముంచుకొని వంటింట్లోకి వచ్చి స్టవ్ మీద పెట్టింది.

కెమేరా స్టవ్ మీద కాన్సన్‌ట్రేట్ అయింది. కథానాయిక చేతులకూ, స్టవ్ మంటలకూ ప్రేక్షకుల ఉత్కంఠ పెరుగుతోంది. నీళ్ళు కాగటం, పాలు, డికాషన్ పంచదార జోడింపు కావటం, కప్పులోకి చేరటం వగైరా జరిగాయి.

కథానాయిక టీ కప్పుతో హాల్లోకి వచ్చింది.

"చాలా బాగుంది" టీ సిప్ చేస్తున్న హీరోగారి కామెంటు.

"అలాగా! మరో కప్పు చేసి తీసుకురానా?" హీరోయిన్‌గారి ఆరాటం.

"వద్దు! బాబోయ్" వాస్తవిక చిత్రీకరణతో హార్ట్ బర్న్ అయిన ప్రేక్షకుల హాహాకారాలతో హాలు నిండింది.

—"సుచంద్ర"

# అద్దె వసూలు

కాంతారావు ప్రేమారావు, పాపారావు, మంచి మిత్రులు. ఎం. ఎ. చదువుతున్నారు. పరంధామయ్యగారిల్లు వంద రూపాయలకు అద్దెకు తీసుకుని వుంటున్నారు. ఇంట్లోవాళ్ళు పంపిన డబ్బంతా వాళ్ల జల్సాలకు ఖర్చు పెట్టుకొనేవాళ్లు. అద్దె మాత్రం సరిగ్గా యిచ్చేవాళ్లు కాదు. ప్రతినెలా పరంధామయ్య అద్దె వసూలుకు రావడం, ఎలాగోలా సర్ది చెప్పి పంపడం వారికి అలవాటైంది.

ఒకరోజు పరంధామయ్య ఎలాగైనా సరే ఆరునెల్ల అద్దె వసూలు చేసుకొని

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

**కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:**



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకువెళ్ళి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

## నోటి దుర్వాసనను ఆపండి...
## కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
## దంతక్షయాన్ని ఎదుర్కోండి!






పరిపూర్ణమైన దంతరక్షణ కోసం
కోల్గేట్ సైగార్డ్ టూత్‌బ్రష్‌లనే వాడండి.
మూడింతలు మేలైనవి
1 పళ్ళ ఎనామిల్‌కి రక్షణ
2 పళ్ళ పొరలారినుండి
3 చిగుళ్ళకు రక్షణ

DC.G.74 TL

పోవాలని ఉదయాన్నే వచ్చి మామూలుగా తన చేతి కర్రతో తలుపు తట్టాడు. ఆ కర్ర తట్టుడు వారికి బాగా అలవాటే. విధిలేక వెళ్ళి తలుపు తీశారు.

"ఏమోయ్ కాంతా, ప్రేమా, పాపారావులూ! అద్దె ఈ రోజన్నా యిచ్చేది వుందా లేదా చెప్పండి. ఇవ్వకపోతే మీ పెట్టేబేడా బయట పారేసేది మాత్రం ఖాయం" అన్నాడు పరంధామయ్య కోపంగా.

"ఎందుకుసార్! అలా కోప్పడతారు. కొద్దిరోజులాగండి. మీ డబ్బులు మీకు పువ్వుల్లో పెట్టిస్తాం" అన్నారు ముగ్గురూ.



తనని 'సార్' అనేసరికి అప్పటికే అయిసయిపోయాడు పరంధామయ్య.

అయినా "అదేం లాభంలేదయ్యా" అన్నాడు గట్టిగా.

"సార్! మాకాంతారావుకు ఐదు లక్షల భాగ్యలక్ష్మి లాటరీ రాబోతోంది. అదొచ్చిందంటే మీ ఆరు నెలల అద్దె ఏం ఖర్మ, ఇంకో పది నెలలది ముందుగానే అడ్వాన్సుగా యిస్తాం. అంతేకాదు రిపేర్లు కూడా మేమే ఫ్రీగా చేయిస్తాం" అన్నారు మిగతా ఇద్దరూ.

"లాటరీ వస్తుందనేంటయ్యా నమ్మకం!" అన్నాడు పరంధామయ్య కాస్త ఆశగా, అనుమానంగా.

"గ్యారంటీ సార్! అంతెందుకు మీకు గ్రహశాంతి చేశాడు చూశారా జ్యోతిష బ్రహ్మ కూర్మాచార్యులు, అతనే నిన్న ఫస్టు ప్రైజు ఐదు లక్షలొస్తుందని, మన కాంతారావు చెయ్యి చూసి మరీ చెప్పాడు" అన్నారు ప్రేమారావు, పాపారావులు.

"నిజంగానా!" అన్నాడు కూర్మాచార్యుల మీద గురివున్న పరంధామయ్య.

"ఒట్టు. రేపొకటో తేదీ డ్రా, రెండో తేదీ కేష్" అన్నారు ముగ్గురూ.

"మరి రెండో తేదీ మాత్రం తప్పక యివ్వాలి ఆరు నెల్ల అద్దె, పది నెలల అడ్వాన్సు. ఆ అన్నట్టు రిపేర్ల సంగతి మర్చిపోవద్దు. మరి నే వస్తా" అన్నాడు పరంధామయ్య.

ఇంతలో "సార్! ఒక రూపాయుంటే అప్పిస్తారా!" అనడిగాడు కాంతారావు.

"లక్షలొచ్చేవాడివి, నీకెందుకోయ్ రూపాయి! తమాషాలాడుతున్నావా ఏమిటి?" అన్నాడు గలగలా నవ్వుతూ, పర్సులోంచి రూపాయి తీస్తూ.

"అదేంకాదు సార్! మరి లాటరీ టిక్కెట్టు కొనాలిగా" అన్నాడు కాంతారావు పరంధామయ్య చేతిలోంచి రూపాయి లాక్కుంటూ.

—పగడాల జనార్ధనరావు.

## తీర్పు

పల్లెలో "చంద్రుడు గొప్పా, సూర్యుడు గొప్పా" అన్న చర్చ వచ్చింది. కొందరు సూర్యుడు అన్నారు- మరికొందరు కాదు

చంద్రుడన్నారు. "కాదు... కాదు... కాదు..." గొడవ పెద్దదైంది. తెల్లవారే వరకూ పోట్లాడుకున్నారు, కొట్లాడుకున్నారు. పల్లె రెండు ముఠాలుగా చీలిపోయింది. ఒక ముఠా సూర్యుడినీ, రెండో ముఠా చంద్రుడినీ సపోర్టు చేశాయి. రెండో రోజునుంచి రెండు ముఠాలకు మధ్య పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేలా తయారైంది వ్యవహారం. శాంతి భద్రతలు నశించి పల్లెలో అల్లకల్లోలం మొదలైంది. ఆరు నెలల తీవ్రమైన ఘర్షణ జరిగాక ఇరుపక్షాలు ఒక నిర్ణయానికి వచ్చాయి. పట్నం వెళ్ళి



యూనివర్సిటీలో మేధావిగారిని కలిసి ఆ సమస్య పరిష్కరించుకొందామనుకున్నాయి.

వెంటనే ఇరుపక్షాలనుంచి ఇద్దరు ప్రతినిధులు బయలుదేరివెళ్ళి మేధావిగార్ని కలిశారు. సమస్యను ఆయన ముందుంచారు.

మేధావిగారు వారం రోజుల పాటు ఉద్గ్రంథాలన్నీ చదివి చివరికి ఎనిమిదో రోజున తీర్పు ఇచ్చాడు–

"సూర్యుడుకన్నా చంద్రుడే గొప్ప. ఎందుకంటే రాత్రిళ్ళు చంద్రుడు లేకపోతే మానవులు చీకటిని భరించలేరు. రాత్రిపూట వెలుగును ఇస్తున్నాడు చంద్రుడు. అదే సూర్యుడు పగటిపూట వెలుగునిస్తున్నాడు. పగలు ఎలాగూ వెలుగు వుంటుంది. అప్పుడు వెలుగిచ్చే సూర్యుడి గొప్పేముంది? కాబట్టి అన్నివిధాలా చంద్రుడే గొప్ప."

– రోహిణి

## అతి తెలివి

నేను రైల్వే స్టేషన్‌లో కొచ్చేసరికి – ఢిల్లీ వెళ్ళే జి. టి. ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫామ్మీద బయలుదేరడానికి సిద్ధంగా వుందని ఎనౌన్స్‌మెంట్ వినిపించింది. టిక్కెట్టు తీసుకుని గబగబా పరుగెత్తాను. అక్కడ చూస్తే జనం కిటకిట లాడుతున్నారు. సీటు దొరకటం మాట అటుంచి కనీసం కాలు మోపటానికైనా చోటు దొరుకుతుందా అన్నంత రద్దీగా వుంది.

ఏమైతే అయిందని ఒక రిజర్వ్‌డ్ కంపార్ట్‌మెంట్‌లోకి జొరబడి ఒక బెర్త్ మీద దర్జాగా పడుకున్నాను. నా బెర్త్‌కు కింది బెర్త్‌మీద అంతకు ముందే ఓ మనిషి పడుకుని వున్నాడు. బహుశా రిజర్వేషన్ వుండి వుంటుందనుకున్నాను. రైలు మరి కాసేపటికి కదలబోతుందనగా ఇద్దరు మనుషులు వచ్చి నన్ను తట్టి లేపారు. ఆ బెర్త్ రిజర్వు చేయించాం కిందికి దిగండన్నారు. నేను ఏంచేయాలా? అని ఆలోచిస్తున్నాను–ఢిల్లీ వరకు నిలబడి వెళ్ళటం నావల్ల అయ్యేపని కాదు. వెంటనే మెరుపులాంటి ఆలోచన తట్టింది. వెంటనే అన్నాను–

"అఫ్‌కోర్స్ మీరు రిజర్వు చేయించి





వుండొచ్చు-కానీ నేనెవరినో తెలుసా? సి.ఐ.డి. ఆఫీసర్ని" అన్నాను అంతే! పాపం వాళ్ళు ఖంగు తినేశారు. నన్ను వదిలేసి నా కింది బెర్త్ మీద పడుకుని వున్న మనిషిని లేపారు. అది కూడా వాళ్ళు రిజర్వ్ చేయించారన్న సంగతి అప్పుడు తెలిసింది. పోనీలె వాళ్ళిద్దరూ ఆ బెర్త్ మీద సర్దుకుంటారనుకున్నాను. నా కంటే ముందే వచ్చి, రిజర్వేషన్ లేకుండానే దర్జాగా పడుకున్న ఆ మనిషి మీద ఒళ్ళు మండిపోయింది నాకు.

ఆ మనిషి లేచి కూర్చుని టక్కున



చెప్పాడు. "నేనెవర్నో తెలుసా! ఆయన అసిస్టెంటుని" అన్నాడు నా వైపు చూపించి.

అది విని నేనాశ్చర్యపోయాను. నేనే అబద్ధం చెప్పానంటే వీడెవడో నన్ను మించి పోయాడే అనుకున్నాను. పాపం ఆ మనుషులిద్దరూ బితుకు బితుకు మంటూ భయపడుతూ కిందే కూర్చుండి పోయారు.

అతి తెలివి చూపించిన అబద్ధపు ఆఫీసర్లం మేం మాత్రం ఒకడి తెలివికి మరొకరం ఆశ్చర్యపోతూ కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాం. చక్కగా ఆఫీసర్లలా నటించాం. ఆ తర్వాత నిద్ర పోయాం.

ఈలోగా రైలు చాలా దూరం ప్రయాణించింది. మధ్యలో ఏదో స్టేషన్ దగ్గర రైలు ఆగింది. నేను సిగరెట్లు తెచ్చుకుందామని కిందకు దిగి వెళ్ళాను. సిగరెట్లు కొనుక్కుని, ఒక టీ తాగి నేను ప్రదర్శించిన తెలివి తేటలను, బెర్త్ మీద దర్జాగా ప్రయాణం చేయగలుగుతున్నందుకు లోలోపలే ఆనందపడుతూ నా బెర్త్ దగ్గర కొచ్చాను.

అంతే! నా గుండె ఆగినంత పనైంది. అక్కడ నా అబద్ధపు అసిస్టెంటు కాని, ఆ కింద కూర్చున్న మనుషులు కాని లేరు. వాళ్ళతో పాటు నా రెండు సూట్ కేసులూ లేవు—

—గౌస్

## జమీందారు

హరి, గిరి యిద్దరూ యీ మధ్యనే కొత్తగా స్నేహితులయ్యారు. ఒకరోజు యిద్దరూ అనుకోకుండా రోడ్డుమీద కలుసుకున్నారు. కుశల ప్రశ్నల తరువాత హోటల్లో కాఫీ తాగారు. బిల్లు నేనిస్తానంటే నేనిస్తానంటూ వాదించుకొని, చివరకు ఎలాగయితేనేం గిరి బిల్లు చెల్లించాడు. ఇద్దరూ హోటల్ బయటకు వచ్చారు.

ఇంతలో రోడ్డుమీద ఓ ఖరీదైన చవర్లెట్ కారు రావటం గమనించిన 'హరి' ఆ కారును చూసి. ఆ కారులో కూర్చున్నతను తనను చూస్తాడేమోనని భయ

# పొట్టోడు-చెట్టెక్కాడు

అది ఒక పల్లెటూరు. ప్రశాంతంగా ఉండే ఆ గ్రామంలో ఓ రోజు అకస్మాత్తుగా కలవరపాటు కలిగింది. దానికి తోడు చుట్టుపక్కల గ్రామవాసులు ఆ గ్రామంలోనికి వస్తున్నారు. ఈ కలవరపాటంతా ఒక మహానీయుణ్ని చూడడానికని తెలిసింది. అందుకని జనం తండోపతండాలుగా ఆ మహానీయుణ్ని చూడాలని ఆ గ్రామంలోనికి వస్తున్నారు. కొందరు ఆ మహానీయుణ్ని దర్శనం చేసికొని ధన్యులౌతున్నారు. మరి కొందరు దర్శనం చేసికొనడానికి శతవిధాల ప్రయత్నిస్తున్నారు. ఆయన్ని చూడాలని సకల ప్రయత్నాలు చేసి విఫలుడైన ఓ పొట్టివాడు దగ్గరలోనున్న చెట్టొకటి ప్రయత్నంచేసి ఎక్కగలిగాడు. అంతటితో ఆ సంఘటన ఆగిపోలేదు. చెట్టు పైనుండి ఆ మహానీయుణ్ని చూస్తున్న పొట్టివాడు, ధన్యుడనయ్యాననుకొన్నాడు. అదే సమయంలో ఆ పొట్టివాణ్ని చూసి "ఆతిథ్యం కొరకు నీ ఇంటి కొస్తున్నాను" అని ఆ మహానీయుదన్నాడు. ఆ మాటలకు పొట్టివాడు కలవరపడ్డాడు. అయోగ్యుడనైన నా ఇంటికా మహానీయుడు రావడం అని ఆశ్చర్యపోతుండగా, "త్వరగా చెట్టు దిగు, నేను నీ ఇంటికి వస్తున్నాను" అన్న మాటలు విన్పించాయి. వెంటనే పొట్టివ్యక్తి చెట్టు దిగాడు. ఆ మహానీయుణ్ని తన గృహానికి ఆహ్వానించి ఆత్మీయ దీవెనలు పొందాడు.

ఆ మహానీయుని చూడటానికి ఎందరో వచ్చారు. అయితే ఆ మహానీయుడు చూసింది ఒక్కన్నే! దేవుడు మానవ హృదయాల్ని పరిశీలిస్తుంటాడు - చెట్టెక్కిన వ్యక్తిలోనున్న జిజ్ఞాసే ప్రభుని చూసేలాగా చేసింది. ఎందరో వ్యక్తులు ఆ ప్రభుని దర్శనం చేసుకొని ధన్యులౌతున్నారు. వ్యక్తి యెటువంటి వాడైన, "నా యొద్దకు వచ్చినవానిని నేనెంత మాత్రం త్రోసివేయను" అని యేసు ప్రభువు అన్నాడు. అట్టి ప్రభుని గూర్చి నీవు తెలుసుకోవాలని, ఆయన్ని దర్శనం చేసుకోవాలని, నీ వాశించిన యెడల ఈ క్రింది చిరునామాకు వ్రాయండి. మీకు ఒక మంచి గ్రంథము ఉచితంగా పంపుతాము. "నమస్తే".

"వారిపాటి"

**డా॥ యస్. జాన్ డేవిడ్**

ఎ.యం.జి. ఇండియా,

వార్తాపత్రికల శుభ సందేశాలు,

పోస్టు బాక్సు నెం. 1820, ముషీరాబాదు,

హైదరాబాద్-500 020, ఆం. ప్ర.

పడుతూ 'గిరి' వెనుక నక్కాడు.

ఆ కారు మామూలుగానే వారిని దాటి వెళ్ళిపోయింది. ఆ కారును చూసి హరి ఎందుకంతగా భయపడ్డాడో గిరికి అర్థం కాలేదు. అదే అడిగాడు.

"ఆ కారు వెనుక సీట్లో కూర్చున్నాడు చూశావ్ ! అతనే మా తాతయ్య. నన్ను యిలా చూశాడంటే చివాట్లు పెట్టి మా కంపెనీకి తీసుకుపోయి అది చూడు యిది చూడు అంటూ బోర్ కొట్టేస్తాడు" అని చెప్పాడు హరి ముఖం విసుగ్గా పెట్టి.

"అలాగా !" అన్నాడు గిరి



ఆశ్చర్యంగా. అంటే హరి తనలాగా నిరుద్యోగి కాదన్నమాట, అనుకున్నాడు సంతోషపడుతూ.

అలా యిద్దరూ మాట్లాడుకుంటూ మరి కొంత దూరం నడిచారు. ఇంతలో వారికెదురుగా ఒక నల్లని అంబాసిడర్ కారు రావటం గమనించిన హరి మళ్ళీ భయపడుతూ గిరి వెనక్కి వచ్చి నక్కాడు.

"ఆ కారులో ఎవరున్నారు?" అంటూ అడిగాడు గిరి.

"ఆ కారులో కూర్చున్నతనే మా నాన్న నేనిలా తిరగటం చూశాడంటే నేరుగా ఫ్యాక్టరీకి తీసుకువెళ్ళి చివాట్లు పెట్టి ఆఫీసులో పడేస్తాడు. నాకా పని బోర్ !" అంటూ విసుగు ప్రదర్శించాడు హరి.

"ఓహో ! అలాగా !" అన్నాడు గిరి. 'అయితే హరి ఒక చిన్నసైజు" జమిందార్ 'అన్నమాట' అనుకున్నాడు హరినిచూస్తూ.

ఇంతలో ఒకతను మోటర్ బైక్ మీద రావటం గమనించిన హరి, మళ్ళీ గిరి వెనుక్కి నక్కి అతను దాటి వెళ్ళి పోయిన తరువాత గిరితో "అతనే మా అన్నయ్య. నన్ను చూశాడంటే ఇంటి కెళ్ళి రిపోర్టులిస్తాడు నేనేదో బలాదూరుగా తిరుగుతున్నానని" అంటూ చెప్పుకు పోతున్నాడు. ఇంతలో వారికెదురుగా ఒకతను రిక్షా తొక్కుకుంటూ రావటం గమనించిన హరి ఒక్కసారిగా అదిరి పడి మళ్ళీ గిరి వెనక్కి నక్కబోయాడు. కానీ ఆ రిక్షావాడు హరిని చూడటం, రావటం, హరి కాలరు పుచ్చుకోవటం జరిగిపోయింది.

"ఏరా ! ఇంటిదగ్గర పనీ పాటా, వదిలేసి ఇలా బజార్లెంట జులాయి వెధవలా తిరుగుతుండావా. నిన్ను ముప్పూట్లా తిండి పెడాతానికేన్నటా నేను రిక్షా తొక్కుతాంది? ఇలా ఏమీ పట్టకుండా తిరిగితే నా తరువాతెవ్వడానికు కూడెట్టేది; వెధవా ! నా కడుపున సెడ బుట్టావ్ గదరా ! పద యింటి దగ్గర నీయమ్మ నువ్వు నిన్నట్నుంచీ రావటం లేదని బెంగెట్టుకుంది" అంటూ హరిని కాలరు పట్టుకొని రిక్షాలో పడేసి తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు రిక్షావాడు

—ఎస్. ఎమ్. మెహబూబ్

# కోటీశ్వరుల పడవ పందాలు

వానాకాలం వచ్చిందంటే పిల్లల కేరింతలకు లోటుండదు. వాన నీళ్ళు చూరు నుంచి జారి కింద కాలువలా ప్రవహిస్తుంటే తాము చేసిన కాగితపు పడవల్ని ఆ ప్రవాహంలో వదిలి 'ఎవరిది ముందు పోతుందా?' అని సంబరంగా చూస్తుంటారు పిల్లలు. వారే పెరిగి పెద్దయి పెద్ద పెద్ద పడవల పోటీల్లో పాల్గొనవల్సి వస్తే అప్పటి వారి మనస్తత్వం ఎలా వుంటుందో చెప్పలేం.

మన సాహిత్య, సంప్రదాయాల్లో పడవలకున్న ప్రాముఖ్యం తక్కువదేమీ కాదు. రాముని పాద ధూళి తాకితే తన పడవ కూడా ఏ 'అహల్యో' అయిపోతుందేమోనని ఓ పక్క భయపడుతూనే ఇంకో పక్క భక్తి ప్రపత్తులతో రాముణ్ని గుహుడు నది దాటించడం రామాయణంలో ఓ మనోజ్ఞ దృశ్యం.

శంతనుడు పడవ నడిపే మత్స్యగంధి సత్యవతిని చూసి మోహించి వుండకపోతే భీష్ముడి చరిత్రా, భారత కథా మరో విధంగా వుండేవేమో!

ప్రకృతి అందాలతో వెల్లివిరిసే కేరళలో సంప్రదాయంగా వచ్చే పడవ పందేలు లేకుండా వారి ఓనం పండుగకు నిండుదనం లేదని భావిస్తారు కేరళీయులు.

మూడేళ్ళకోసారి వేసం కాలం చివర్లో న్యూపోర్టు రోడె ద్వీపంలో 5 కోట్ల డాలర్ల ఖరీదుతో తెరచాప పడవ పందేలు జరుగుతాయి. ఏదో ఆషామాషీగా చేద్దామంటే కుదరని పని. అంతా డబ్బుతో పని. ఈ పోటీల సందర్భంగా సంతలో సంబరాల్లాగ కుస్తీ పోటీలు, ఇతర చిన్న చిన్న పందేలు న్యూపోర్టు రేవు ఒడ్డున జరుగుతాయి.

పడవ పందేలకు ఖర్చు అయ్యే డబ్బు చాలావరకూ పోటీదారుల నుండి, చూడ్డానికి వచ్చిన ప్రేక్షకుల నుండీ వచ్చేస్తుంది. గెలిచినవారికిచ్చే 'కప్పు' పాల్గొనేవారికీ, ప్రేక్షకులకు కూడా ఓ పెద్ద ఆకర్షణ. ఈ పోటీల్లో ముఖ్యంగా ఫ్రాన్స్, స్వీడన్, బ్రిటన్, ఆస్ట్రేలియా, అమెరికావారు పాల్గొంటారు. ఎవరికి వారే తమ ప్రతిభతో విజేతలై కప్పును గెల్చుకుంటామన్న గట్టి నమ్మకంతో ఎదురు పెట్టుబడి పెట్టి రంగంలోకి దిగ

డానికి ఉత్సుకత చూపిస్తారు.

పోటీల్లో కప్పు సంపాదించాలన్న కోరిక చాలా ఖరీదైన వ్యసనం అనిపిస్తుంది వీటి వరస చూస్తుంటే. 12 మీటర్ల పొడవున్న 'లయన్స్ హార్ట్' అనే వాణిజ్య పడవకి బ్రిటన్‌కి చెందిన జాన్ ఓక్లీ యజమాని. ఈ పడవకు పోటీల్లో పాల్గొనేందుకయ్యే మొత్తం ఖర్చు 7 లక్షల డాలర్లు. సిబ్బంది ఓ నెల్లాళ్ళపాటు న్యూపోర్టులో సుష్టుగా భోంచేసి కులాసాగా వుండేందుకు కావల్సిన సరుకులకే 32 వేల డాలర్లు అవసరమవుతాయి. శుభ్రపరిచే నిమిత్తం నీళ్ళలోంచి పడవను పైకెత్తడానికి ఉపయోగించే లిఫ్ట్ ఖరీదు కేవలం 12 వేల డాలర్లు. పడవలు నిలిపే పరిశుభ్రమైన స్థలంలో గాక వెనగ్గా మురిగ్గా వున్న స్థలంలో పడవ నుంచితే బడ్జెట్ కొంతలో కొంత తగ్గుతుంది. కానీ 'ప్రిస్టేజ్ క్వొశ్చెన్' అందుకు అంగీకరించనివ్వదు. పడవ నిలిపే స్థలానికి చెల్లించవల్సిన మూల్యం ఎక్కువగా వుందని ఇతర దేశాలవారు భావించినాగాని చేసేదేమీలేదు. బడ్జెట్‌ను దృష్టిలో వుంచుకుని ధరలను కంట్రోల్ చేయాలన్నది అందరూ అనుకుంటున్నదే. కానీ క్రీడలతో బాటు వ్యాపారం కూడా ముడిపడి వుండడంచేత మిన్నకున్నారు.

'కరేజియస్' అనే పడవ యజమాని ధైర్య సాహసాలు, ఉత్సాహమూ వున్న టర్నర్. పోయినసారి వాణిజ్య పడవల పందేల్లో నేర్పుని, ధైర్యాన్ని ప్రదర్శించి బహుమతి గెల్చుకున్న ఇతను ప్రపంచం మొత్తం మీద సెక్సప్పీలు వున్న పది మంది మగవారిలో ఒకడట. ఇతనికి ఆడపిల్లలంటే మోజు ఎక్కువ. వారిని పక్కనపెట్టుకుని తనంటే అసూయపడే వారిని ఉడికించడమంటే మరీ మోజు. ఒసారి అధికారులంతా తీరిక సమయంలో నౌకా విహారం చేస్తున్న సందర్భంలో టర్నర్ కూడా మరులుగొలిపే తన గర్ల్ ఫ్రెండుతో విహారం మొదలెట్టాడు. వారి మతులు పోగొట్టి, మనసు చెదరగొట్టేలా ఆ అమ్మాయి నడుం పైభాగం అనాచ్ఛాదనం చేసుకుని పడవ వెనక భాగంలో నిలబడి కొంటె విన్యాసాలు చేయడం మొదలెట్టింది. అది అధికారుల దృష్టిలో పడినా చేసేదిలేక అతనికున్న డబ్బు, నావికునిగా అతని నైపుణ్యం చూసి నోర్మూసుకున్నారు. ఇంచుమించు ప్రతి రేసులోనూ ఏదో ఒక బహుమతిని కొట్టేసేవాడు ఇతను.

ఈ పడవల యజమానులందరూ మంచి నావికులు. వీరిలో ఒకరు రెండుసార్లు ఒలంపిక్స్‌లో పాల్గొన్నారు. మరొకరికి అమెరికా ఒలంపిక్ పతకం లభించింది. ఇంకొకరు 1977లో న్యూపోర్టు రేసు సిరీస్‌లో అద్భుత నావికునిగా ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్నాడు.

ఈ పడవల వెనక వున్నవాళ్ళంతా కోటికి పడగలెత్తినవాళ్ళే. అయినా విజేతలకిచ్చే కప్పు అమృతభాండంలా వారిని ఆకర్షిస్తోంది. నిజానికి వాళ్ళకున్న సంపదతో పోలిస్తే అది చాలా చిన్న వస్తువు. కానీ బహుమతి అనగానే చీపురుపుల్లయినా అమూల్యంగా తోస్తుంది కదా! ఐదేళ్ళపాటు ఫ్యాక్టరీల్లోను, ఇతర సంస్థల్లోను పరిశ్రమించి వంద మిలియన్ డాలర్లు సంపాదించినాగాని గుంపులో ఒకరిగా తప్ప గుర్తింపు వుండదు. అదే, పోటీలో కప్పు గెల్చుకుంటే బ్రహ్మరథం పడతారు. అదీ ఆకర్షణ.

కప్ కోసం ఛాలెంజ్ చేయడానికి



ఆర్హత, హక్కు వున్న పడవల్లో బ్రిటన్, ఆస్ట్రేలియా, స్వీడన్, ఫ్రాన్స్‌లకి చెందిన పడవలకు దేశభక్తి ప్రపూరితమైన పేర్లున్నాయి. ఫ్రీడం, ఎంటర్‌ప్రైజ్, కరేజియస్ అనేవి అమెరికా పడవల పేర్లు.

ఒక్కోసారి సంప్రదాయికంగా నిశ్చయించిన పేరును రాత్రికి రాత్రి మార్చేసి అధిక ధన సహాయం చేసినవారి పేరును పెట్టుకోవడం కూడా సంభవిస్తూ వుంటుంది. ఆఖరి క్షణాల్లో ఒకాయన ధన సహాయం చేస్తాడన్న వార్త తెలీగానే ఓ పడవకు అంతవరకూ వున్న పేరును శుభ్రంగా చెరిపేసి ఆయన సూచించిన పేరును పెయింట్ చేశారు తెల్లారేలోగా.

క్లిప్పర్ అనే పడవకి రస్సెల్ లాంగ్ యజమాని. ఇతని వంశవృక్షం వేళ్ళు కూడా మేలిమి బంగారంవేనంటే అతిశయోక్తి లేదు. ఇతని తండ్రికున్న సంపద, నాయనమ్మకున్న పుగాకు,

అల్యూమినియం వ్యాపారాలుగాక తల్లి, సవతి తండ్రి నుండి వారసత్వంగా వచ్చిన న్యూయార్కులో వున్న మెట్రో పొలిటన్ మ్యూజియం కూడా ఇతని స్వంతమే! అందుకనే తన పడవ మీద ఓ పది లక్షల డాలర్లు ఖర్చయినా ఫరవాలేదన్న ధీమాతో ఉన్నాడు.

కానీ ఇతని కొడుకుది మాత్రం స్వతంత్ర వ్యక్తిత్వం. ఆస్థి మీద ఆధార పడకుండా ఉద్యోగం చేసి తన నావకి కావల్సిన డబ్బుని సమకూర్చడంలో కృతకృత్యుడయ్యాడనే చెప్పాలి. పోటీలో గట్టిగా నిలదొక్కుకోవాలంటే డబ్బు పుష్కలంగా ఖర్చుపెట్టగలిగి వుండాలి ప్రచారాలకీ వాటికీ. అందుకని ఓ ఇద్దరు కోటీశ్వరులను వాటాదారులుగా చేస్చు కున్నాడు.ఇతని పడవ స్థూల భాగం కాంతి వంతమైన రంగులతో కంటికి నదురుగా కనిపిస్తుంది. నీటి మధ్యవున్నా, రేవుతో సంబంధాలు కల్పించే అధునాతనమైన కంప్యూటర్లు, స్విచ్ బోర్డులు ఈ పడవలో ఉన్నాయి.

ఫ్రాన్స్ III అనే పడవకు అధిపతి ఫ్రాన్స్కి చెందిన బేరన్‌బిక్. కప్ కోసం, ప్రచారం కోసం కావల్సిన డబ్బునంతా తనొక్కడే సర్దుబాటు చేయగల కుబేరుడు. రెండేళ్ళపాటు నిర్విఘ్నంగా 'బిక్' బాల్ పాయింట్ పెన్నులతో ప్రచార కార్యక్రమం నిర్వ హించిన ఘనుడు కూడా ఇతడే.

ఈ పడవ పోటీలు జరిగే న్యూపోర్టు రేవు ఎంతో అధునాతనంగా, చూడ ముచ్చటగా వుంటుంది. బేరన్ తన ఫ్రాన్స్IIIతో బాటు తను వేసుకొచ్చిన ఎర్ర రోల్స్‌రాయిస్ కారును కూడా ఒడ్డునే పార్కుచేయడం అలవాటు. పైగా అదే స్టేటస్ సింబల్‌గా భావిస్తాడు.

65 యేళ్ళ వయసుగల బేరన్ గత పదేళ్ళలో 65 లక్షల డాలర్లని కేవలం ఈ పోటీలకే ఖర్చు పెట్టాడు. ఆ డబ్బుకి పన్ను మినహాయింపు వుందనుకోండి. అది వేరే విషయం. ఈ సంవత్సరం ప్రచారం కోసం 15 లక్షల డాలర్లను వినియో గించాడు.

బేరన్ చాలా పెద్ద ధనవంతుడు. అతని 'బిక్' బాల్ పాయింట్ పెన్నులు ప్రపంచ బాల్ పాయింట్ పెన్నుల మార్కెట్లో 30 శాతం రాబడిని తెచ్చి పెడతాయి. ఇవేగాక వ్రాత పరికరాలు, వెలిగించి పారవేసే అగ్గిపుల్లలాంటి సిగ రెట్ లైటర్లు, ఆడవాళ్ళ లోదుస్తులు, నావి కులు వేసుకునే రకరకాల డ్రస్సులు వగైరా తయారుచేసే వివిధ రకాల పరిశ్రమల్లో వాటాలు, కొన్నింటిలో స్వయంగా యాజ మాన్యాధికారాలు వున్నాయి బేరన్‌కి. అమెరికాలోని న్యూ రేజర్ బ్లేడ్ల ఫ్యాక్టరీ కూడా ఇతనిదే. రెండేళ్ళ కిందట బేరన్ వ్యాపారం 15 కోట్ల డాలర్లయితే గత ఏడాది అది 62 కోట్ల డాలర్లకు పెరిగింది.

ఇంతకు ముందు జరిగిన పడవ పోటీల్లో ఒక్కదాంట్లోనైనా గెలవక పోయినా ఈసారి న్యూపోర్టు పోటీల్లో పాల్గొనకుండా వుండలేకపోయాడు బేరన్. అందుకే అతనిది 'కప్ ఫీవర్' అని చమత్కరిస్తుంటారు సన్నిహితులు. 'నడి సముద్రంలో కూడా స్టీరింగ్‌ను నేర్పుగా తిప్పగల దిట్ట బేరన్' – అని తోటివారు కించిత్ అసూయ కలిసిన అభినందనలు కురిపిస్తుంటారు.

ఔత్సాహికుల కోసం బేరన్స్ స్క్వాడ్ అనే పేరుతో 'కప్' గెలవడం ఎలాగో నేర్పించడానికి ఒక సంస్థను స్థాపించి




1979 నుంచీ శిక్షణా కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాడు. ఫ్రాన్స్‌కి చెందిన 30 ఏళ్ళ జోహన్ అనే నిపుణుడు ఈ శిక్షణా వ్యవహారాల్ని దగ్గరుండి చూసుకుంటాడు.

బేరన్ దృష్టి ఎంతసేపూ 'పోటీలు-విజయం-కప్పు' ఈ మూడింటి మీదే వుండటం చేత సిబ్బందిని క్షణం కూడా విశ్రాంతిగా వుండనివ్వడు. సంవత్సరం నుంచీ మాతృదేశాన్ని వదలి వున్న సిబ్బందికి ఇంటిమీద గాలి మళ్ళింది. ఈసారి పోటీల్లో ఫలితం ఎలా వున్నా గెల్చినా, ఓడినా వాళ్ళు మాత్రం బేరన్‌కి గుడ్‌బై చెప్పేలాగే వున్నారు.

బ్రిటన్‌లో పుట్టి, ఆస్ట్రేలియా పౌరసత్వం తీసుకున్న 42 ఏళ్ళ అలన్‌బాండ్ బేరన్‌కి సమఉజ్జీ. మూడవ కప్ ఛాలెంజ్ పోటీల కోసం దాదాపు 47 లక్షల డాలర్లు ఖర్చు పెట్టాడు. కప్పును సాధించడం కోసం ఎన్నికల్లోలా అంత డబ్బు కేవలం ప్రచారానికై ఖర్చు పెట్టడం సామాన్య విషయం కాదు. ఈసారి బాండ్ పెట్టబోయే ఖర్చు ఆస్ట్రేలియా దేశ బడ్జెట్‌లో మూడో వంతు వుంటుందని అంతా అనుకుంటున్నారు.

బాండ్ ఓ విధంగా కష్టపడి పైకొచ్చాడని చెప్పవచ్చు. తండ్రి అనారోగ్య కారణంగా పశ్చిమఆస్ట్రేలియాలోని పెర్త్ నగరానికి వలసవచ్చి స్థిరపడింది బాండ్ కుటుంబం. 12 ఏళ్ళకే స్కూలు చదువుకి స్వస్తి చెప్పి సైన్ బోర్డులు రాసే శిక్షణ పొందాడు. అయితేనేం ప్రస్తుతం అదృష్ట దేవత వరించింది. వ్యాపార రంగంలో మకుటంలేని మహారాజులా వెలిగిపోతున్నాడు. బొగ్గుగనులు, నాచురల్ గ్యాస్, ఆయిల్, కలప చితుకులు, చెక్కపొట్టు, దూరదర్శిని, రవాణా సౌకర్యాలు మొదలైన వ్యాపార లావాదేవీలున్నాయి.

పోయినసారి న్యూపోర్ట్ పోటీల్లో పాల్గొన్నప్పటికన్నా ఈసారి అన్నింటా మెరుగ్గా వుంది ఆస్ట్రేలియా పడవ. వంపు తిరిగివున్న పడవ స్తంభం కొత్తగానూ, ప్రత్యేకంగానూ కనబడ్డం విశేషం. పడవకున్న అంచు చిన్నదిగా వుండడం మినహా మిగతా వాటిల్లో సాంకేతిక పరంగా అమెరికావాటికి ఏమాత్రం తీసిపోనట్లుంది ఆస్ట్రేలియా.

స్వీడన్ పడవని 47 ఏళ్ళ పెల్లె పిట్టర్‌సెన్ నడిపిస్తాడు. పడవలుతయారు చేయడంలోను, వాల్వోకార్లను డిజైన్ చేయడంలోను పెల్లెకి మంచి ప్రావీణ్యత వుంది.

ఈ స్వీడన్ పడవ సిబ్బందిలో తామే విజేతలమన్న భావన కల్గించడానికి ఇద్దరు ప్రఖ్యాత మనస్తత్వవేత్తలను న్యూపోర్టుకి రప్పించారు. కానీ వారిద్దరిలో ఏకాభిప్రాయం లేకపోవడంతో వారిని సాగనంపారు. సిబ్బందిపై ఓ మంచి చిట్కా ప్రయోగించారు. ఎన్నో నెలలుగా భార్యల్ని, ప్రియురాళ్ళని వదలి వున్న వారికి మనోరంజకంగా కొంతమంది అమ్మాయిల్ని తాత్కాలిక భార్యలుగా, గర్ల్‌ఫ్రెండ్స్‌గా పడవలెక్కించడం వల్ల అనుకున్న దానికంటే అద్భుత ఫలితాలు వచ్చాయి.

ఆంథోనీ బోయెడిన్ లయన్‌హార్ట్‌కి సపోర్టునిచ్చి ద్రవ్య సహాయం చేసిన వారిలో ప్రప్రథముడు. నాలుగు లక్షల డెబ్బై వేల డాలర్లు చందాలివ్వడమేగాక ఇంచుమించు అంతే మొత్తాన్ని ఇతరుల వద్ద నుండి చందాలు, ఋణాల రూపంలో వసూలు చేసిచ్చాడు. 1964లో మొదట్లో ఓ చిన్న రేసుబోటు కొని దానికి

